ఓం

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# శ్రీమదాంధ్ర భగవద్గీత.



[వచనము]

-: రచన :-

శ్రీరామాయణము, పద్మవ్యూహము, శ్రీకృష్ణరాయబారము
కృష్ణలీల, చింతామణి. మున్నగు నాటక కర్తలు.

ఎడ్యుకేషనల్ సర్వీసు,
శ్రీయుత బల్లా స్వామికవిగారు

ప్రకాశకులు

ఎం. ఎస్. చౌదరి అండ్ సన్సు,

బుక్ సెల్లర్సు, పబ్లిషర్సు అండ్ స్టేషనర్సు.
మండపేట. తూ॥ గో॥ జిల్లా.

**1956**

# విజ్ఞప్తి.

—o—

సుజ్ఞానులారా!

మహామనీష పండితవర్యులారా!

శ్రీమదఖిలాండకోటి బ్రహ్మాండనాయకుండును, పరబ్రహ్మస్వరూపుండును, భక్తవత్సలుండును నగు శ్రీరామచంద్రమూర్తి నిర్హేతుకజాయమాన కటాక్షవీక్షణములను – బహుభాషాప్రవీణ కవితాదురంధరులును, పురాతన శిలాశాసన పరిశోధక నిపుణాగ్రేసరులును సుహృదయులు నగు మద్గురువర్యులు 'శ్రీ మానవల్లి రామకృష్ణకవిచంద్రుల' వారి యనుగ్రహంబుచేతను నాకుం బ్రసాదితమైన కవితా విశేషంబున భాషాయోషామతల్లి సేవ చేయుచుండుట భవాదృశులకుం జిరపరిచితుండనే కావచ్చునని విన్నవించుకొనుచున్నాను.

భగవదనుగ్రహముచే నాకలవడిన కవితాకళావిశేషమున నేగ్రంథము వ్రాసిన భవజలధిం తరింపం జేయునదియు, సర్వమానవకళ్యాణప్రదంబును, మోక్షదాయకమగునదియు, ముముక్షులోకాది సకలజనానందకరమై యలరుచున్న లోకంబునకుపకరించునా యని యూహించుచుండ 'శ్రీ వేదవ్యాస మహామునీంద్ర విరచితంబయిన శ్రీమహాభారతమున' 'నరనారాయణాంశ' సంభూతులయిన "శ్రీకృష్ణార్జునుల సంవాద" రూపకంబున వికసిల్లుచుండు నీ 'భగవద్గీతాశాస్త్రంబు' సర్వజనగ్రాహ్యమగునట్లు పామర జనమునకు కంఠపాఠముగా వ్రాయుటయుక్తంబని దలంచి పెక్కండ్రు పండితోత్తములచే వ్రాయంబడిన గీతాగ్రంథములు సాధారణంబుగ గ్రహించి తత్సహాయముం జేసి వచనరూపంబున వ్రాయం బ్రయత్నించి

కృతార్థుఁడనై నందులకెంతయు సంతసింపుచు నక్క-విభుంగ వులకు వినమ్రుఁడనై కృతజ్ఞతాపూర్వకముగా నభివందనము లాచరించుచున్నాను.

గీతాశాస్త్రంబన బ్రహ్మవిద్యాగ్రంథముకనుకఁదత్సంబంధమైన పారిభాషికపదము లనేకములీ పొత్తమునం దిమిడి యుండుననుట నిక్కము. అయినను నాకుఁదెలిసినంత వఱకుఁ దత్పదములకు సమానార్థముల నిచ్చు తేట తెనుఁగు పదము లనే పొందుపర్చి వ్రాసియున్నాఁడను. అయినప్పటికి పాఠకులు దీనిని సుస్థిరచిత్తముతో బఠించిననేగాని సులభగ్రాహ్యముకానేరదు. ఎట్లయినను భగవన్నామమును స్మరించుటయు భగవద్గీతలను పారాయణము జేయుటయుగీతార్థశ్రవణానందమరందమాధురీ గ్రహణాసక్తచిత్తులగుటయు సంసారభవార్ణవతరణమునకు సాధనములు గనుకఁదప్పక దీనిని పఠించి తరింతురుగాకయని కోరుచున్నాఁడను.

అల్పవిద్యాపరిజ్ఞానుఁడనయ్యు సాహసించి వ్రాసిన యీవ్రాతలయందు దోషములసంఖ్యాకము లుండవచ్చునని మనవిచేయుచున్నాను. గుణగ్రహణపారీణులగు పండితోత్తములందులకు గేలిసల్పక నాసాహసమును మన్నించి దయతో నాకు దెలియఁజేసినచో కృతజ్ఞతతో సందుకొని సవరించుకొందునని విధేయుఁడనై విన్నవించుకొనుచున్నాను.

శ్రీజయ, శ్రావణ
శుక్లపాడ్యమి శుక్ర
30-7-1954 సం॥
మండపేట.

ఇట్లు,
సుజన విధేయుఁడు,
బల్లా స్వామి కవి.
పితృస్థానం—ఆనూరు. పెద్దాపురం తాలూకా.

క॥ శ్రీకంఠ ధనుర్భంజన
శ్రీకంఠ శిరాగ్రనటక । శ్రీ శ్రీ గ్రహణా!
శ్రీకంఠవైరి వాహన
శ్రీకంఠ నృపేంద్రశయన । సీతారమణా!॥

శ్లో॥ శ్రీనీలాంబుద శ్యామలకోమలాంగమ్
జానకీ సమాసంస్థిత వామభాగమ్
పాణ్యోదయే పృథుశరచాపచాపమ్
ఓంనమామి రామమ్ రఘువంశనాథమ్॥

క॥ శ్రీమద్రామా మానస
రామా! గిరిజామనోభి । రామార్చితశ్రీ
రామా! భార్గవరామా!
రాముసిసవనీశ రామ! రామభిరామా!॥

క॥ ప్రాజ్ఞుండఁగాను విద్యల
విజ్ఞానమలేదునిన్ను । వినుతింపఁగ స
త్యజ్ఞానరూపకన్రబ
హ్మజ్ఞానుఁడఁగాను కావు । మా శ్రీరామా!॥

క॥ శ్రీయంబరీషకులభర
ణా! యంబరిషావ్రతావ । నభయవిదూరా!
శ్రీయంబరిషసురవర
దా! యంబురహాక్ష ఘోర । దైత్యవిదారా!॥



ఓమ్

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః




గ్రంథకర్త :

'రచనవిశారద'

# శ్రీ బల్లా స్వామికవిగారు

ఓమ్.

# పండితాభిప్రాయము.

---

ఈభగవద్గీతాగ్రంథమును రచించిన శ్రీ బల్లా స్వామి కవిగారిని సుమారు 36 సం॥లనుంచిన్ని అందులో 1941 సం॥ వరకు అనపర్తి సావరంపాఠశాల మానేజరుగానుండి యచ్చట విద్యావ్యాప్తి గావించి యున్నందున బాగా యెఱుఁగుదును. అదియుంగాక అనపర్తి గ్రామమునాటికాప్రదనము పరంపరం పరిదేయగుటచే ఆదిగ్రామంపుల్లో కలుగు తగవులనుపరిష్క-రించవలసివచ్చినప్పుడు తరుచు మేమిద్దఱము సన్నివేశమైపరి ష్కారముచేయుచుండు వారమగుటంబట్టి బాగా యెఱుఁగుదు నని చెప్పుచున్నాను.

వీరు 1915-1918 సం॥ల మధ్య కాలములో రంగా పురం గ్రామమునసబుగాను, స్పెషల్ రివిన్యూడిపార్టుమెంటు లోను ఉద్యోగము చేసియున్నారు. వీరు రామాయణాభజన కీర్తనలాది పెక్కు గ్రంథములు రచించి ఆంధ్ర సారస్వతము నలంకరించి యున్నారనుట అతిశయోక్తిగా నేరదు. వీరిరచన లెంతయుఁ బ్రశంసనీయములై యున్నవి. యీ 'ఆంధ్రభగవద్గీత' లోని కొంతభాగమును జదివినాను. వ్యాసవచనానువాద మైనను న్యాయసమ్మతముగా స్వతంత్రపోకడలు చాలవరకుఁ గన్పట్టుచున్నవి. కవియొక్క భాషాసంస్థానమును, బ్రయోగ

విజ్ఞానమును గొనియాడఁదగియున్నది. ఈరూపమున భక్తి సామ్రాజ్యమును చూరగొన్న యిక్కవి ధన్యులలో ధన్యుఁడు. ఇందలి ప్రతిభావము భక్తిరసపూరితమై, సరళ సమన్వితమై, సహజలక్షణ కవితా ధారాసంయుతమై, పామర లోకమున కైనను పఠించుట కనువగునటుల సులభశైలిలో వ్రాయఁబడినది.

వీరు పరమేశ్వరభక్తియుతులై, భాషాసేవ జేయుచుందమ కాలమంతయు విద్యావ్యాసంగమందే గడుపుచున్నారు. వీరియొక్క పరమార్థచింతనము, శుద్ధ సాత్విక స్వభావము, పరమేశ్వరునియందలి యనన్యభక్తి యీ గ్రంథమే చాటుచున్నది.

పరమేశ్వరుఁడు వీరికి చిరాయువులొసంగి యిట్టిగ్రంథములనింకను రచించి పాఠకలోకమున కందించునటుల సహృదయలోక మీ కవి నాశీర్వదించుగాక!

శ్రీగంగిరెడ్డి గ్రంథాలయము
శాంతిపుర సౌధము
అనపర్తి. (తూ॥ గో॥)

ఇట్లు భాషాభిమాని,
ద్వారంపూడి వేంకటరెడ్డి
ది. 20_7_1956 సం॥నం.

ఓమ్.

శ్రీ రామకృష్ణ పరబ్రహ్మణేనమః

శ్రీ విశ్వంబర చిన్మయాభువన సృ । ష్టికారణా కారణా
భావాతీత పరాత్పరా! భవహరా! । భద్రాత్మకా! నిర్గుణా!
గోవిందాచ్యుత! వాసుదేవ! యభవా! । గోవర్ధనోద్ధారణా!
ప్రావీణ్య సుజనైకపోషణ స్వభా । వా! కృష్ణ సంకర్షణా!॥

శ్రీ మద్భక్తజనావనైకవరదా । శ్రీజానకీ సేవితా!
కామక్రోధవిమోహలోభరహితా । కర్మోష్టితా! దివ్యమా
యామోహవ్యయలోలమానసహితా।యద్వైతవిద్యున్మతా
ప్రమోద్యద్భవ దోషతారణ జగ । ద్విఖ్యాత శ్రీరాఘవా!॥

శ్లో॥ శ్రీనీలాంబుద శ్యామలకోమలాంగమ్
జానకీ సమాసంస్థిత వామభాగమ్
పాణిద్వయే పృథుశర చారుచాపమ్
ఓం నమామి రామమ్ రఘువంశనాథమ్॥

క॥ శ్రీకర! భక్తవశీకర!
పాకారి సురాదిమౌని । వరనుతపద శో
భాకర! భూరికృపా నీ
రాకర! శ్రీరామచంద్ర । రమ్యచరిత్రా!॥

క॥ కమలామనోహరాంగా!
కమలాసనమాని హృదయ । కమల విహంగా
కమలాతు్మ జనకజహృది
కమలా నటరాఘవేంద్ర । గరుడతురంగా!॥

క॥ శ్రీధరణీజ పయోధర
మోదానహానటనసార । మోహ మయూరా!
వేదాతీత జనార్ధన
వేదార్చిత పాదపద్మ । విజయవిహారా!॥

క॥ శ్రీకంఠ ధనుర్భంజన
శ్రీకంఠ శిరాగ్రనటక । శ్రీ శ్రీ గ్రహణా!
శ్రీకంఠ వైరివాహన
శ్రీకంఠ నృపేంద్రశయన । సీతారమణా!॥

క॥ శ్రీమద్రామా మానస
రామా! గిరిజామనోభి । రామార్చిత శ్రీ
రామా! భార్గవరామా!
రాముని సవనీశరామ । రామభిరామా!॥

క॥ శ్రీయంబరీష కులభర
ణా! యంబరిషావ్రతావ । న భయవిమోరా!
శ్రీయంబరీష సురవర
దా! యంబురహాక్షఘోర । దైత్యవిదారా!॥

ఓమ్.

శ్రీ రామచంద్రపరబ్రహ్మణేనమః

## * శ్రీ విఘ్నేశ్వర స్తవమ్ *

శ్రీ గంగాధర పుత్రయో సర్వ విద్యాప్రధాన ప్రభూమ్
వాగీశామర ముఖ్యదేవ స్తవనీయమ్ శుభదాత్మయే
యోగానంద కరే ఋషీహృత్పంకజ మధూలిహామ్
శ్రీ గౌరీ వదనానంద విఘ్నరాజా భజామిమమ్॥

## * దేవీ సంస్తవమ్ *

శ్లో॥ శ్రీవేధప్రియముదాకరీ! శుభకరీ! సృష్టికళాకారిణీ!
శ్రీ విద్యామృదుగాన వాగ్ధృతకరీ! విజ్ఞాన దీపాంకరీ!
శ్రీవీణాంచితపాణిపుస్తకధరీ! శృంగారరత్నాకరీ!
శ్రీవిద్వత్కవిమండలార్చితచరీ! శ్రీభారతీపాహిమామ్॥

శ్లో॥ ఓంకారదేవి శర్వాణి యాదిశక్తి పరాశరీ!
ప్రణవాత్మజ్యోతిస్వరూపే సర్వయోగి హృద్భాసితే
అజ్ఞానతిమిరాంశుమాలె యష్టాపదస్థిత వాసినే
జగన్మాతాకృపానిలయే భగవతే ప్రణామ్యహమ్॥

శ్లో॥ క్షీరాంభోదికుమారి పావనకరీ! సౌభాగ్య భోగాకరీ!
నీరేజాలయ సుందరీ! ధృతకరీ! నిష్కల్మతాపఃహారీ!
సర్వాభీష్టకరీ! దశాఫలకరీ! సద్ధర్మనిష్టాకరీ!
లీలానాటక సూత్రఖేలనకరీ! లక్ష్మీ కృపాసాగరీ!॥

## * గురు సంస్మృతి *

ఉ॥ శ్రీమహి 'మానవల్లి'కుల। సింధుసుధాకరమూర్తి సద్గుణో
ద్ధాముఁడుసత్యభాషనిర। తాత్ముఁడుపండితమండనుండు ని
ష్ఠాముఁడు 'రామకృష్ణకవి'। సత్తము మద్గురుపాద కంజము
న్నేమరకెల్లవేళనుతి। యించెదమన్మదినెంచిభక్తితోన్



ఓం

శ్రీ రామచంద్రపరబ్రహ్మణేనమః

# శ్రీ భగవద్గీతా మహాత్మ్యము

—o—

శ్రీవసుంధరాదేవి యొకదినంబున శ్రీమహావిష్ణువును గాంచియిట్లడిగెను. "దేవా! విశ్వంభరా! నీవు సర్వేశ్వరుఁడవు. ప్రారబ్ధకర్మఫలమనుభవించువానికి నీయందు దృఢతర భక్తి యెట్లుకలుగును" వచింపుమనిన–శ్రీమహావిష్ణువిట్లు చెప్ప దొడంగెను.

దేవీ! ప్రారబ్ధకర్మముననుభవించు చున్నవాఁడైనను సదాభగవద్గీతా పారాయణమందాసక్తిగలవాఁడగుచో ముక్తి నార్జించి సుఖవంతుఁడై ప్రారబ్ధకర్మబంధ శూన్యుఁడగు చున్నాఁడు. భగవద్గీతలధ్యానము చేయువాని నట్టిపాపము లెన్నఁడునంట జాలవు. ఎంతమహాపాపములు (బ్రహ్మహత్య గోహత్యాదులు) చేసినవాఁడైనను భక్తిశ్రద్ధలతో గీతాధ్యానము చేసినయెడల 'తామరాకును నీరుఅంటనట్లు' ఆపాపము లిసుమంతయు వారిని స్పృశింపఁజాలవు. భగవద్గీతా శాస్త్రపుస్తక ముండుచోటను, ఈమహాత్మ్యంబుసహా గీతాపారాయణము చేయుచోటను, ప్రయాగాది నిఖిల తీర్థములును ఉండును గీతలను పారాయణము చేయువారలకు సర్వదేవతలు, ఋషులు, యోగులు, పన్నగులు, గోపాలకులు, గోపి

కలు, నారదుఁడు, ఉద్ధవుఁడు, వైకుంఠద్వారపాలకులు (జయ విజయులు) సహాయులై వర్తింతురు. ఓభూదేవీ! ఎచ్చోట గీతలనుచదివెదరో; తద్గీతార్థవిచారణచేయంబడునో! ఎచ్చట గీతలనుపదేశింతురో! గీతలధ్వని వినబడుచున్నదో అచ్చట నేనుతప్పక వశించియుందును. భగవద్గీతలే నా కాశ్రయంబు. గీతలే నాకు శ్రేష్ఠమైన సౌధము— గీతలయం దుల్లేఖించిన జ్ఞానము ననుసరించియే నేను త్రిలోకాధిపతినై పరిపాలించు చున్నాను. అర్ధమాత్రరూపము. నాశనరహితము, బ్రహ్మ స్వరూపము, శాశ్వతమునగు నీభగవద్గీతాశాస్త్రము బ్రహ్మ విద్యయనుట కెంతయు సందియములేదు. దీని భావమును శ్రీమన్నారాయణుండును, సచ్చిదానంద స్వరూపుఁడునగు శ్రీకృష్ణుఁడు స్వయముగా నర్జునకుపదేశమొనర్చెను.

ఇయ్యది వేదత్రయస్వరూపముగాను, ఆనందస్వరూ పముగాను తత్వజ్ఞానము నతిసులభముగా బోధించునదిగాను నలరారుచున్నది. ఏమానవుఁడనుదినము నిశ్చలమనస్కుఁడై అనన్యభక్తితో గీతాధ్యాయము పదునెనిమిదింటిని పారా యణము చేయునో వాఁడు బ్రహ్మజ్ఞానమును బొంది పునర్జ న్మలేని మోక్షమునుబొందుచున్నాడు. అనుదినమన్నియధ్యా యములను పారాయణము చేయలేనివారు సగముపారాయ ణముజేసినను చాలును. అందువలన గోదానము జేసినంత పుణ్యఫలము ప్రాప్తించును. మూఁడవవంతు అనగా యారు యధ్యాయములు పఠించినచో 'గంగాస్నానము' చేసినంత

ఫలము గలుగును. మూఁడుఅధ్యాయములు పారాయణము
చేసిన సోమయాగఫలమును పొందును. ప్రతిదినమొక్కొక్క
అధ్యాయమును నిశ్చలభక్తితో నెవ్వఁడు పారాయణము
సేయుచున్నాఁడో వాఁడు రుద్రలోకమున కేగి శివుని ప్రథమ
గణములతోఁ జిరకాలమచ్చట నానందించుచుండును. అను
దినమొక్కొక్క యధ్యాయమును పఠింపలేకుండిన నొక్క
శ్లోకముగాని, శ్లోకమునందలి పాదముగాని, మహాభక్తితో
నెవ్వఁడు పఠించునో వాఁడు మన్వంతరకాలము భూలోకము
లో నరుఁడై జనించి చిరకాలజీవియగును. పదిశ్లోకములు గాని
ఏడుగాని, అయిదుగాని, నాలుగుగాని, కడకొక్కటిగాని,
శ్లోకములో నర్థభాగముగాని, పాదములో నర్థ భాగముగాని
ప్రతిదినమెవ్వఁడు పారాయణము చేయునో వాఁడు చంద్ర
లోకమునకుఁబోయి పదివేల సంవత్సరములచ్చట మహదా
నందము బొందుచు నివసించియుండును.

గీతాపఠన సమయంబున మృతినొందినవాఁడు కేవ
లము దేవత్వము నొందుచున్నాఁడు. గీతాశాస్త్ర పారాయ
ణుఁడు నిక్కముగా మోక్షమును బొందితీరును. మరణకాల
మందు గీతలనొక్కసారి స్మరించినమాత్రముననే ఉత్తమగతి
తప్పకలభించును. గీతాశ్రవణాసక్తుఁడు యెంతటిమహాపాప
ఘ్నుఁడు అయినప్పటికి దేహపాతానంతరము విష్ణులోకము
నకుంబోయి యచ్చట శ్రీమహావిష్ణువుతోనానందించు వాఁడ
గుచున్నాఁడు.

నిత్య వర్ణాశ్రమధర్మ విధ్యుక్త కర్మముల నాచరించిన పిమ్మట గీతార్థములను భక్తితో నెవ్వఁడు ధ్యానము చేయుచున్నాఁడో యతఁడు జీవన్ముక్తుండై శరీర పాతము కాఁగానే పరమపదము నలంకరించును. జనక మహారాజు మున్నగు పెక్కండ్రు రాజఋషులు విగతపాపులై యశోధనులై కడను మహోత్కృష్టమైన పథమును బొందిరి. గీతలను పారాయణముచేసి మహాత్మ్యంబును పఠనముచేయకుండి నచో నదివ్యర్థమేగాని ఫల మొక్కింతయు గలుగనేరదు. గీతామహాత్మ్యముతో సహా గీతలను పారాయణముఁ జేయునట్టిపురుషుఁడు తదాఫుణ్యఫలమును బొందినవాఁడై మోక్ష పథము నధిష్టించుచున్నాఁడు.

బహుపురాతనమైనదియు, నాచే నిప్పుడు వచింపఁబడినదియునగు నీగీతామహాత్మ్యంబును జదివిన శ్రీభగవద్గీతలను పారాయణశ్రవణ పఠన స్మరణాది సర్వ సూక్తులవలన చెప్పినంత ఫలము కలుగుననుట నిశ్చయము.

ఈవిధంబున వరహాపురాణమందు చెప్పఁబడిన శ్రీ భగవద్గీతా మహాత్మ్యంబున శ్రీ వేదవ్యాస మునీంద్రునిచే వచింపఁబడెను.

క॥ భగవద్గీతల నిశ్చల
మగు భక్తిన్ పఠనజేయు। మానవులిలలో
నగణిత వై భవశ్రీలను
నొగిఁగాంచియు మోక్షపథము। నొందుదు రెపుడున్॥

మాలిని॥ సకలభువనపోషా । సర్వమానందవేషా!
ప్రకటకలుష నాశా । భక్తహృత్కంజవాసా॥
సుకవిజన సుభాషా । సూక్తితోషావిలాసా!
వికట దనుజ విభీషా । వేదభూషాప్రకాశా!॥

తోటక॥ ఖలదైత్యవిదారణ । కర్మగుణా!
కులమాని సుపోషణ । గోపగణా!
కలుషార్ణవతారణ । ఖ్యాతిరణా
తల శాత్రవభీషణ । స్థైర్యచణా!॥

క॥ బృందావన సంచరణా!
సుందరవనమాలధరణ । శోభితచరణా!
మందరకుధరోద్ధరణా!
కందర్పాకార గోపి । కాహృద్భరణా!॥

క॥ మంగళ మండజవాహన
మంగళకర మారజనక । మంజులవేషా!
మంగళమచ్యుత మాధవ!
మంగళమానందరూప । మహిజకళత్రా!

మంగళమ్ మహత్

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

సర్వేజనాస్సుఖినోభవంతు.

శ్రీ రామచంద్రార్పణమస్తు.



శ్రీరస్తు.

శ్రీ కృష్ణ పరబ్రహ్మణేనమః

అవిఘ్నమస్తు.

శ్రీకళ్యాణవిలాస మౌనిజన సం । సేవాపదాంభోజ లీ
లాకారాజగదేక మోహనకృపా । లాభక్తమందార త్రై
లోకారాధ్య సురేంద్రపాలవిబుధా । లోకావనాదీక్ష సు
శ్లోకాసీతమనోభిరామ యినవం । శోద్ధామ శ్రీరాఘవా!॥

# శ్రీమదాంధ్ర భగవద్గీత,

[వచన కావ్యము]

ప్రథమ భాగము

## అర్జున విషాద యోగము

శ్రీ గోవింద జనార్దన
వాగీశ ప్రముఖదేవ । వరవరదమహా
యోగీంద్ర చిత్తమందిర
భోగీశ్వర రామచంద్ర । భువనోద్ధరణా!॥

ఓ సంజయా!

శ్రీమన్మహీమండలంబున పుణ్యభూమి యనంబరగు కురుక్షేత్రంబున నా కుమారులగు దుర్యోధనాదులును, పాండుకుమారులగు ధర్మరాజాదులును యుద్ధముచేయ నిశ్చయించినవారలై ఏమిచేసిరి? అని యడిగిన ధృతరాష్ట్రునకు సంజయుఁడిటు చెప్పఁదొడఁగెను.

ఓ ధృతరాష్ట్రా! నీతనయుండు రాజరాజైన దుర్యోధనుఁడు పద్మ, శకటాది బంధురవ్యూహాకారములుగ నొనర్పఁబడిన పాండవసైన్యమునుగాంచి భయభ్రాంతుఁడై ద్రోణాచార్యునికడకరిగి 'గురువర్యా' భవదీయశిష్యుండును, బుద్ధినైపుణ్యుఁడునగు దుష్టద్యుమ్నునిచేఁ గల్పింపఁబడి వ్యూహాకారముగ నిలిచియున్న భయంకరమగు పాండవసేనను విలకింపుము. ఈపాండవ సైన్యంబున విక్రమాఢ్యులై నభీమార్జునులతో సరిపోలు మేటివీరులనేకులు కలరు— సాత్యకి, విరటుఁడు, ద్రుపదుఁడు, దృష్టకేతుఁడు, చేకితానుఁడు, కాశిరాజు, పురుజిత్తు,కుంతిభోజుడు,శైబ్యుఁడు, యుధామన్యుఁడు, ఉత్తమౌజుఁడు, అభిమన్యుఁడు, ద్రౌపదేయులు.

ఇఁక మనసైన్యాధిపతులలో నుత్తమవీరులను జ్ఞాపకార్థము నీకు వివరముగా జెప్పుచున్నాను వినుము: నీవు, భీష్ముఁడు, కృపాచార్య, అశ్వత్థామ, కర్ణుఁడు, వికర్ణుఁడు, భూరిశ్రవుఁడు, సైంధవుడు, జయద్రధుఁడు మొదలగు మహావీరులు అగణ్యశరసంధాన ప్రవీణులు—వీరలు నా నిమిత్తము తమయశువులనైన విడుచుటకు సంసిద్ధులైయున్నారు. ఇట్టిమన సైన్యంబు భీష్మ సురక్షితంబయ్యును పరిపూర్ణంబు గాకయున్నది. పాండవసైన్యము భీమునిచే రక్షింపబడుచునంతట నిండియున్నది. కావున మీరందఱును మీమీనియమితస్థానములందుండి *గాంగేయునిగడుజాగరూకులై కాపాడవలయును

*శిఖండినుండి భీష్ముని గాపాడవలెనని దుర్యోధనుఁడు సేనానాయకులకుఁ జెప్పియుండెనని భావము గ్రహింపనగును.

ఇట్లువచించుచుదుర్యోధనుని వాక్యములాలకించి భీష్ముండు రారాజున కాహ్లాదకర మగునట్లుగా సింహనాదం బొనర్చి శంఖమును పూరించెను. తద్ధ్వని నాలకించినంతటనే కౌరవ సైన్యమునందలి వీరులు శంఖములు—పణవభేరీ మృదంగాది గోప్పవాద్యవిశేషంబులను భూమ్యాకాశంబులు నిండి ప్రతి ధ్వనించునట్లుగా వాయించిరి.

పిమ్మట శ్రీకృష్ణార్జునులు తెల్లని గుఱ్ఱంబులు కట్టం బడిన మేలురథంబునధిష్టించి గగనతలంబున 'పాంచజన్య' 'దేవదత్తము' లను తమ శంఖంబుల రెండింటిని బాగుగా పూరించిరి. మహానందభరితమానసకరవిక్రముండై భీముడు 'పౌం డ్రము' ను, శంఖంబును పూరించెను. ధర్మరాజు 'అనంతవిజయ' మను శంఖంబు నూదెను. నకుల సహదేవులు 'సుఘోష మణి పుష్పకంబు' లనెడి శంఖములను పూరించిరి. మఱియు, కాశీ రాజు—సిఖండి—దృష్టద్యుమ్నుడు—విరటుడు—సాత్యకి—ద్రుపద రాజు—ద్రౌపదేయులు (ప్రతివింధ్యాదులు) అభిమన్యుడు మొదలగువారలు తమతమ శంఖములను వేరువేరుగా పూరిం చిరి. ఆధ్వని భూమ్యాకాశములునిండి భోరుకొల్పుచుదుర్యో ధనాదుల హృదయములను వ్రక్కలి భేదిల్లంజేసెను. తదనంత రము కపికేతనుండు యుద్ధముచేయ సరుదెంచియున్న దుర్యో ధనాదులంగాంచి శస్త్రప్రయోగము సేయంబూని కార్ముకంబు నెక్కుబెట్టి వాసుదేవుని జూచి, శ్రీకృష్ణా! ఈమహాసంగ్రామ మున నేనెవ్వరితో సమరము చేయవలయునో వారలను నేను బాగుగా జూచుకొనుటకుగాను యీనారథంబు నీరెండు సేనల

మధ్యగానిలుపుము. దుర్మదులగు దుర్యోధనాదుల పక్షమున యుద్ధముసేయ నిష్టముగలవారై చావునకు సంసిద్ధులై యేయే పరాక్రమవంతులు వచ్చియున్నవారో గాంచెదనుగాక, అనిన అర్జునుని వచనము లాలకించగనే శ్రీకృష్ణుండు భీష్మద్రోణాది సకలరాజన్య సమూహమున కెదురుగా నుభయసేనల నడుమ దేరునిలిపి, అర్జునా! సమరసన్నద్ధులై యుద్ధరంగమున నిలిచి యున్నయీకౌరవసైన్యంబును జక్కగావీక్షింపుముఅనియెను.

అంతట నాపాండవమధ్యముండు నుభయసేనలను దిలకించి యందుగల తాతలను, తండ్రులను, గురువులను, మేనమామలు మొదలుగాగల పుత్రమిత్రపౌత్రాదిబంధుజనుల నెల్ల జూచి యర్జునుండు మిగులజాలినొంది దుఃఖించుచు నాసు దేవునకిట్లనియె; బావా! శ్రీకృష్ణా! సమరముసేయ నిచ్చటికరుదెంచిన యీనాబంధుమిత్రాది గురుజనంబులను గాంచి నంతనే నామనంబు తల్లడమందుచున్నయది. నోటం దడి యారెడిని, శరీరము కంపించుచున్నది. గాండీవము హస్తమున బట్టుటకశక్తమై దోచెడిని. సర్వాంగములు పట్టుతప్పి శక్తిహీనములైనవి. నాదేహమందు నగ్నిముట్టించినట్లున్నది. నేనిక నిలువజాలకున్నాను. పెక్కుదుశ్శకునంబులు దోచు చున్నవి. యుద్ధమందు సమస్తబంధుమిత్ర గురుజనాది పరి వారవర్గంబులంగూల్చి తరువాత నేను పొందెడి లాభమే మున్నది? నాకు విజయమక్కఱలేదు. రాజ్యముగాని, భోగ భాగ్యములుగాని యక్కఱలేదు. సకలబాంధవులనుజంపిమేము అనుభవించెడు సౌఖ్యంబేమికలదు? ఎవ్వారలతోఁ గూడి

యుండిన రాజ్యసుభోగభాగ్యములు సుఖదాయకము లగునో అట్టిదోణ కృపాచార్యాది గురుజనంబులును, భీష్మాది పితృ పితామహ పుత్రపౌత్ర మిత్రాద్యఖిల బాంధవులును ధన ధాన్యాదులమీఁదను, ప్రాణములమీఁదను నాశవిడచియుద్ధము సేయ వచ్చియున్న వారు. వీరెల్లఱును మమ్ములఁ జంపుటకు వచ్చియున్నను, ముల్లోకాధిపత్యము రానున్నను నేనువీరలఁ జంపఁ జాలను.

జనార్ధనా! ఈదుర్యోధనాదుల వధించిమేము పొందెడు భాగ్యమేమికలదు? మాకేమిసంతోషజనకము! కౌరవులు కడు దుర్మార్గులేయగుఁగాక వీరినిజంపుటచేత మాకును పాపమే సంభవించును. అదియుంగాక హేయంబులగు "యోషణ త్రియం"బను తుచ్ఛసుఖముల కాసించి పాండవులు వంశ నాశనమొనర్చిరని లోకము దూషించును. ఆత్మసంరక్షణ మవశ్యకర్తవ్యమే; అయినను "అహింసో పరమోధర్మః" అను నీతిననుసరించి ధార్తరాష్ట్రులఁజంపకుండుట యుత్తమ ధర్మము. కనుక మాదాయాదులగు దుర్యోధనాదులనుమేము వధింపరాదు. స్వజనమారణమొనర్చి సుఖజీవనమెటు సేయఁ గలము? బంధువులనందఱను జంపి నేను జీవించియుండు టేల? కౌరవులు రాజ్యకాంక్షచే నష్టబుద్ధులై యీధర్మమును గుర్తింప జాలకున్నారు. కులనాశనము వలన గలుగు మహాపాతకమును బాగుగా నెఱిఁగిన మేమీ పాపకర్మము నెందుకాచరింపవల యును? తెలిసిగాని, తెలియకగాని పాపమెట్లుచేసినను పాప

ఫలమవశ్యప్రాప్తముకదా! విచారించిచూడ నే విధముచేత నైనను కులనాశనమే గన్పట్టుచున్నది. కులనాశనము వలన వంశపరంపరావచ్చుచున్న వంశాచారధర్మములన్నియు నడుగంటును. అనాచారముల కాలవాలమై కులస్త్రీ ధర్మంబులు నశించును. స్త్రీలు చెడిపెడ్డచరింతురు. దానంజేసివర్ణసంకర మగును. వర్ణసంకర మొనర్చిన వారికిని, సంకరకులమునకును, కులనాశకులకును శాశ్వతనరకము తప్పదు. వారిపితృదేవతలు పిండోదకాది శ్రాద్ధకర్మలు లేకయధోగతి పాలగుదురు.

వాసుదేవా! కులనాశన మొనర్చి కులధర్మములనశింప జేసినవారికి శాశ్వతనరకప్రాప్తి తప్పదుకదా! ఇదిమనమించు కేనియుఁ దలంపక రాజ్యభోగాభిలాషాదిప్రకృతిమోహమున జిక్కి బంధుజనంబులఁజంపనెంచి యుద్ధమునకు సంసిద్ధమైతిమి కదా! అయ్యో! ఎంతపాపము. నేనీ పాపకృత్యము సేయఁజాలను. నేనిదే యస్త్రసన్యాస మొనర్చుచున్నాను. ఆయుధపాణులైన దుర్యోధనాదులు ఆయుధశూన్యుఁడనగు నన్ను యుద్ధమందు వధించినను సరే. అదియేనాకు మిగులమేలగును. అంతియేగాని రాజ్యసంపాదనకై బంధుజనులఁజేతులారజంప జాలనని శ్రీకృష్ణునితోఁబల్కి యర్జునుఁడు దుఃఖముచేచిత్తచాంచల్యముకలవాఁడై ధనుర్బాణములనుజాఱవిడిచి రథము మీఁదఁ గూలఁబడెను.

అర్జున విషాదయోగము—సమాప్తము.



ఓమ్.

# శ్రీమదాంధ్రభగవద్గీత

## ద్వితీయ భాగము

## సాంఖ్య యోగము

శ్రీ సీతారమణీమృదూక్తి ప్రణయ । స్వేనా పరిష్వంగ వా
రాశీ గర్వవిభంగ రంగ నటనా । త్రైలోక్య సంతాపిణా శా
మ్యాసర్వేశ్వర భక్తపాల పరబ్రి । హ్మో దేవమూర్తిత్రయా
సంశోభాయసదాస్మరామిహృదితం। స్వాయంభవో రాఘవా!॥

ఈ విధముగా విషాదమున గన్నీరుగార్చుచు దుఃఖించుచున్న అర్జునుని గాంచి శ్రీకృష్ణుండిట్లనెను.

అర్జునా! ముక్కంటి నెదిర్చిన మహావీరశాలివే! అజ్ఞానివోలె దురపిల్లెదవేల? నీకీమతిభ్రమణ మెట్లు ప్రాప్తించెను? ఇది పామరజనాచరణీయమైనది. వీరలక్షణము కాదు. అపకీర్తికరమైనదియు, నరకహేతువగునదియు, పిరికితనము గలదియునగు కార్యము- యుద్ధసమయంబున నీయట్టి మహావీరునకిదితగునా? నీవుశత్రుసంహారము సేయఁగల ధైర్యగుణాకరుఁడవు. భయమందకుము. నీకీ పిరికితనంబుతగదు. నీమనంబున నీచంబగు అధైర్యంబును విడిచి యుద్ధముసేయుము,. లెమ్మా.

ఇట్లనిన శ్రీకృష్ణునకు నర్జునుఁడిటులఁబల్కెను. మధు

సూధనా! పూజనీయులగు భీష్మద్రోణుల నెదిరించి వారితో నేనెట్లుపోరుసల్పగలను? మహానుభావులైన గురువులను, బంధుజనులను జంపి యానెత్తుటితో దడిసిన రాజ్యసుఖాది భోగములనెట్లనుభవించగలను? రక్తపుకూడు మెక్కుటకంటెబిచ్చాటనముచేసి బ్రతుకుట మంచిది. అదియుంగాక, "జయాపజయములు దైవాధీనములు". యుద్ధమున దుర్యోధనాదులను మనమే జయింతుమో! మనలను వారే జయింతురో తెలియరాదు. కార్పణ్యకిల్బిషంబున నాహృదయము కలంగి నాశౌర్యస్వభావము మాఱినది. ధర్మమేదో అధర్మమేదో తెలియకున్నది. జ్ఞానశూన్యుఁడనై నిన్నడుగుచున్నాను. ఈ రెంటిలోను నాకేదియుచితమో - ఏది శ్రేయోదాయకమో నీవునిశ్చయించి చెప్పుమని ప్రార్థించుచున్నాఁడను-నీకు నేను శిష్యుఁడను, నీవేనాకు శరణ్యము, కావున నన్ననుగ్రహించి యుపదేశమొసంగుము- నిష్కంటకమైన భూలోక సామ్రాజ్యాధికారముగాని, అమరలోకాధిపత్యముగాని ప్రాప్తించినను భీష్మాది గురుజనంబులఁజంపుటకు నాచిత్తము సాహసింపక దుఃఖమున దోఁగుచున్నది. పంచభూతాత్మకంబయిన నాదేహమునంగల సమస్తేంద్రియములకు సంతాపము గల్గించుచుండెను- ఈశ్లోకమెట్లారటజెందునో తెలియఁజాలకున్నాను- నాకెద్దియుఁ దోఁచుటలేదు- అర్జునుండీ విధముగా శ్రీకృష్ణునితో బలికి నేను యుద్ధసేయనని కన్నీరుఁగార్చుచు నూరకుండెను.

ఇట్లు దుఃఖించుచున్న యర్జునుని జూచి మందహాసం బున శ్రీకృష్ణుండిట్టుల పలికెను. నీవు ఎవరినిగూర్చి విచారింప దగవో యట్టి భీష్మద్రోణాదులగూర్చియే దుఃఖిల్లుచున్నావు బహువిధ ధర్మవాక్యములు పలుకుచున్నావు-జ్ఞానులు ప్రాణికి యున్నట్టికాని, చనిపోయినట్టిగాని వ్యక్తులంగూర్చి విచారిం పరుసుమా! అర్జునా! నీవును, నేను, ఈ సర్వరాజన్యులును పుట్టుటకు ముందు లేనివారము కాము, అప్పుడును యిప్పుడును ఉన్నారము- ఈశరీరము పుట్టకముందును నశించినపిమ్మ టనుగూడ మనముందు వారమే-దేహనాశనమే కాని ఆత్మ వినాశముకాదు- ఆత్మ యవ్యయ పదార్థము- జీవుండుపొందు తనువులు మాత్రమే యశాశ్వతములై నశించుచున్నవి-జీవా త్మలు పరమాత్మవలనే ఆత్మస్వరూపులై నిత్యములై ప్రకా శించుచుండును_ అవస్థాభేదములచే జీవులనేకములుగా గోచ రించుచున్నవి- అన్నిటియందు వ్యాపించియుండు జీవుండొ క్కండే—ఆత్మకీ స్థూలదేహమందు బాల్య, యౌవన, కౌమార వార్ధక్యము లెట్లువచ్చుచున్నవో యాటులనే జీవిమరణానంతరము నొకశరీ రమును బొందుటయు గలుగుచుండును- జ్ఞాని జీవరహస్యము నెఱిగినవాండు గనుక దేహియొక్క చావుపుట్టుకలకు విచా రింపండు- పంచతన్మాత్రలవలన జనించిన శబ్దస్పర్శ స్వరూ పాది యింద్రియములు విషయ సంయుక్తము శీతోష్ణముల సంయోగముల గలిగించుచుండును- సుఖదుఃఖంబులు వీనిచే తనేగలుగు చుండును- ఇవి శాశ్వతములు కావు- శీతోష్ణముల

చందమున ప్రాప్తములగుచుండును- కనుకవానిని యోర్చు కొనుము- విషయేంద్రియ సంయోగముచేయగలుగు సుఖదుఃఖ ములు యోగనిష్ఠయందు సుషుప్తియందునగోచరములుఆత్మ జ్ఞానమువలన వీనినియోర్చుట శక్యము- సుఖదుఃఖములందు వ్యాకులత్వముజెందక నెవ్వఁడు నిశ్చలుఁడై యుండునో యా మహాత్ముఁడే మోక్షమును బొంద నర్హుఁడగుచున్నాఁడు- నాశనమును బొందెడి దేహమునకు స్థిరత్వములేదు- నిత్య మైన యాత్మకు నాశనములేదు- ఈ విషయమింతకుముందే చెప్పియున్నానుగదా! పరబ్రహ్మమను పదార్థమును దెలిసి కొన్న తత్వజ్ఞులు*ఆత్మదేహంబుల రెండిఁటియొక్క యదార్థ మును దెలిసికొందురు- ఏపరబ్రహ్మ స్వరూపముచే నీ సర్వ జగము వ్యాపింపఁబడి యుండెనో ఆబ్రహ్మమెన్నఁడును వినా శము కాదని గ్రహించుము- ఈ బ్రహ్మ పదార్థము నెవ్వరును నాశనము చేయఁజాలరు - నాశనరహితమగు బ్రహ్మము విశ్వమంతయు నిండియున్న చందమున దేహమం తయు నాయక్షరమైన యాత్మపదార్థముతో నిండి ప్రకాశిం చుచున్నది. ఆత్మ నాశనములేనిది, అప్రమేయమైనది- అది ధరించు గోచరమానమగు సమస్తదేహములు నాశనమగు నవియే- కావున నీవు యజ్ఞానభావ రహితుఁడవై యుద్ధము చేయుము, లెమ్ము- ఇట్లువినుము, ఈయాత్మను చచ్చెడిదాని గాను, చంపెడిదానిగాను యెవ్వరు తలంచుచున్నారో వారు

*సదత్స్వరూపాత్మకంబులైన ద్వివిధంబులగు ఆత్మదేహంబులయొక్క

మూఢులని భావించును—ఈయాత్మచాలను, చంచలమైన అద్దమునందలి ప్రతిబింబముపోలె *ఉపాధుల ననుసరించి జీవరూపమున గాన్పించును– అద్దములేకుండినపుడును బింబమున్నది– తద్విధముగానే *ఉపాధులు తొలఁగినను ఆత్మ నిత్యముగానేయున్నది– ఆత్మ చావుపుట్టుకలు లేనిది– సదా సుస్థిర రూపముగలది– అవ్యయమైనది, షడ్భావ వికార శూన్యమైనది– నిశ్చలమైనది– ఆద్యంతములేనిది– అప్రమేయమైనది అనాదియైనది– హతమగునది శరీరమేకాని ఆత్మ యెన్నఁడును హతము కాదని యెఱుంగుము ఈరహస్యంబు నెఱిఁగినవాఁడు ఎవ్వని సంహరించును? ఎవ్విధి సంహరించ గలఁడు? ఎట్లుసంహరింపఁబడును? ♦మానవుఁడు జీర్ణవస్త్రము లను విడిచి క్రొత్తవస్త్రముల నెట్లు ధరించునో యవ్విధము గానే ఆత్మయు శిథిల శరీరంబులఁ బాసి నూతన శరీరములఁ బొందుచుండును– మార్పుజెందునది శరీరముతే కాని, ఆత్మ యేమాత్రము మార్పుజెందదు–

ఈయాత్మ నెవ్వఁడును "నైనంఛిన్దన్తి శస్త్రాణి నైనమ్ న్యాపోనశోషయతి మారుతః॥", అనుసటులఖడ్గముచే ఖండింపఁజాలఁడు, అగ్నిచేఁదగులఁబెట్టలేఁడు, నీటిచేఁ దడుప

---

♦ ఇచ్చట నీశ్లోకార్థము గ్రహింపుఁడు= "వాసాంసి జీర్ణాని యథావిహాయనవాగృహ్ణాతినరోఽపరాణి । తథా శరీరాణి విహాయజీర్ణాన్యన్యాని సంయాతినవాని దేహీ॥"

*ఆధారములు.

లేదు, గాలిచే శోషింపచేయలేదు, కావున "అచ్ఛేద్యో౽యమదాహ్యో౽యమక్లేద్యో౽ శోష్యఏవచ। నిత్యః సర్వగతః స్థాణుచలో౽యమ్సనాతనః" అనగా, నఱుకఁబడదు, కాలదు, నానదు, ఎండదు–అవ్యయమై, అచలమై, అనాదియై విశ్వవ్యాపియై సదా యొకేరీతిగా నొప్పుచుండును. ఇది నశింపచేయుట కేరికిని సాధ్యముకానిది. ఇంద్రియముల కగోచరమైనది. మనస్సుచే నూహింప శక్యముకానిదియునై యున్నది. నీవాత్మపరిజ్ఞానము గలిగిన వాఁడవేని యిట్లు దుఃఖింపకుందువు. ఇంతియేగాక ఈ యాత్మఘనస్వనః బుట్టుచుండునదిగాను నశించునదిగాను దలంచినప్పటికినీవుదుఃఖింపబనిలేదు. నీవీదేహమే యాత్మగా భావించినను చింతింపనగత్యములేదు. కారణమేమన:–

ప్రపంచమున బుట్టినవానికి మరణ మెప్పుడో యొకప్పుడు తప్పనిదే, మరణించినవానికి మరల పుట్టుకయుఁదప్పనిదే–సమస్త జీవజంతువులకు నీ రెండును నిశ్చయములు. కావున నీవిందులఁగూర్చి దుఃఖించుటతగదు. పంచ భూతాత్మకమైన యీశరీరంబులు ప్రధానతత్వంబే స్వరూపముగా గలవియు, నగుపడుచున్న జననమరణాది సుఖంబులే మధ్యకాలమందు గలవియు, ప్రధానతత్యంబునందే లీనము కాగలవియు నగునట్టి తనువులకొఱకై విచారించుట నీవంటివానికి తగనిపని– జన్మకుముందు జీవులెన్నికలవో–మరణించినపిమ్మట నివియేమగుచున్నవో తెలియఁబడదు. జీవితకాలమందు మా

త్రిమా వీనివిషయము కొంత గుర్తింపఁ గలుగుచున్నాము. దీనికై నీవింత పరితపించుచుండవలెనా? ఒకఁడీ యాత్మను మహాశ్చర్యకరమైన వస్తువుగా జూచుచున్నాఁడు. దీనినే యింకొకఁడు మహానందకరమగు వస్తువువలె నాలకించుచున్నాఁడు. వేఱొకఁడు ఎన్నఁడు కనివిని యెఱుఁగనట్టి అద్భుతవస్తువుగా ప్రకటించుచున్నాఁడు. కాని, వీరిలో నెవ్వఁడును ఈ యాత్మనుచూచిగాని, పలుకరించిగాని యెఱుఁగఁడు. సర్వజీవరాసుల శరీరమందుండెడి జీవాత్మ యెన్నఁడును చంపబడునది కాదు. కనుక నీవు భీష్మద్రోణాదిబంధుజనులయొక్క-మరణమును గూర్చి దుఃఖింపజనదు.

అర్జునా! నీవుత్తమక్షత్రియసంజాతుఁడవు. నీకులధర్మమునుబట్టి చూచినను సమరమన్న నీవింతగా జింతింప పాడిగాదు. క్షత్రియుఁడగు వానికి యుద్ధమే యుత్తమ ధర్మము. స్వధర్మకృత్యముకంటె నీకు శ్రేయంబగు యితరకృత్యంబేమి కలదు? కావున నీవు స్వకులధర్మమునను వర్తింపుము. యుద్ధము సేయుము. అప్రయత్నముగ వీరస్వర్గము నలంకరించు నీ యుద్ధవీరులెంతయు సుఖవంతులుకదా! అదియుంగాక-క్షత్రియోచితంబయిన నీవీ ధర్మయుద్ధమును జేయకుంటివేని యిదివరకు నీవు గైకొన్న వీరప్రసూతకీర్తి కాంతను గోల్పోవుటయే గాక గలుషమును బొందగలవు. లోకంబు నీయపకీర్తిని పలువిధములుగా వాకొని నిందించును. ప్రపంచమున నిదిశాశ్వతముగా నిలిచియుండును. గౌరవనీయుఁడపకీర్తిపాలగుటకంటె

మరణమే మంచిదికదా? అర్జునుఁడు మహాశౌర్య ధైర్యములు గలమేటివీరుండని నీగుణాధిక్యాది వీరత్వముల నింతవఱకుఁ గొనియాడుచున్న కర్ణదుర్యోధనాదులు సమరమునకు భయ పడి వెడలిపోవుచున్నాఁడని నిన్నధిక్షేపింతురు. పిఱికివానిగా నెంచి నిన్నెంతయుఁ జులకనగఁ దిలకింతురు. నీపరాక్రమ మును నిందింపుచు బలుదీతులుగా దూషింతురు. నీవు ధను ర్విద్యాప్రవీణుఁడవనియు, మహా వీరుఁడవనియు, ధీరుఁడ వనియు సద్గుణాఢ్యుఁడవనియు నిన్నింతవఱకు నుతియించు చున్న భీష్మద్రోణాది మహావీరాగ్రేసరులగు గురుజనంబులు నిన్నునిఁక గడు తేలికగ నీక్షింతురు. ఈగారణంబుననీశత్రువు లయిన కౌరవులు పలువిధములుగా హేళన జేతురు. ఇంత కంటె నీకు నధికదుఃఖమేమికలదు? గావున నీవు యపకీర్తి పాలుగాక దుఃఖమును విడిచి యుద్ధము చేయుము. యుద్ధ మందు నీవు శత్రువులచే సంహరింపఁబడితివా! నీగస్వర్గమును బొందుదువు. నీవే శత్రువులను జయించితివా! జయశ్రీరాజ్య శ్రీలను గైకొని పాలనముచేయుచు నిరంతరభోగభాగ్యసుఖం బుల నొందుచు జగద్విఖ్యాతిగాంచెదవు. కావుననీవుసంశయ విరహితమనస్కుఁడవై సమరము సేయ నిశ్చయించుకొని గాండీవమును గైకొనుము, లెమ్ము-యుద్ధముచేసి శత్రువులను జయించుము. అనుమానించకుము. నీ మనంబున గలఁత నొందక సుఖదుఃఖములను సమానముగా జూచుచు వాని వలన గలిగెడి జయాపజయములను లాభనష్టములను సమాన

ములుగా నెంచి సమరమునకు సంసిద్ధుండవైన శాస్త్రవిహితమును
చెండాడుము. అందువలన నీవెట్టి పాపములను బొందవు.

అర్జునా! ఇంతవఱకు నీకు 'సాంఖ్యయోగమును, ఆత్మ
తత్త్వమునుగూర్చి వివరించియున్నాను. ఇంకముందు దానికి
సాధనభూతమగు 'కర్మయోగము'ను చెప్పెదను. ఇందుబుద్ధి
యొక్క విధమును వివరముగా చెప్పఁబడును. కర్మచేగలిగిన
సంసారబంధమును మానవుఁడేబుద్ధితో విడువనలయునో విపు
లముగా దెల్పునదియే కర్మయోగము. దానినే నీకిప్పుడు
చెప్పెద శ్రద్ధతో నాలకింపుము. ఈయోగము నాసక్తితో
నాచరించువాఁడు సంసారబంధమునుండి విముక్తుఁ డగును.
ఈ కర్మయోగాచరణమందుయారంభనాశనముగాని, ప్రత్య
వాయదోషముగాని లేదు. ఇది యారంభించినంత మాత్రము
ననే ఘోర సంసారాబ్ధిని తరింపఁజేయును. యోగానుష్ఠానము
వలన జ్ఞానముదయించును. తద్జ్ఞానమువలనసర్వపాపబంధ
విమోచనమగును. ఇది ఫలవిరహితకర్మయోగముగా నుండ
వలెను. సాంఖ్యకర్మయోగములందు చెప్పఁబడు రెండింటికి
ధర్మములను దెల్పెడి నిశ్చయాత్మకమైన బుద్ధి యొక్కటియే
ప్రధానమని భావింపనగును. కాని, కర్మయోగాచరణవిరహి
తులగు వారి బుద్ధి పెక్కురకములుగ నుండును. ఇయ్యది
చంచలత్వమై గణనాతీతమై శాఖోపశాఖలంబోలె విస్తీర్ణ
ములై బరఁగు చుండును. నిత్యము వేద పారాయణము
చేయుచు వేదార్థ సారములను బాగుగా గ్రహించినవారును

అర్థవాదాసక్తులై తర్క వితర్క వాదములు చేయుటలో ప్రసిద్ధి
గాంచిన పండితమాన్యులు సైతము వేదార్థతత్త్వ నిగూఢ
రహస్యంబు నెఱుంగజాలక నపార్థములు గల్పించి స్వర్గఫల
ప్రాప్తియే పరమపురుషార్థంబనియు దీనికంటెనితర మోక్షంబు
గాని యీశ్వరుఁడుగాని లేఁడనియు వితండవాదములు చేయు
చున్నారు. * విషయాసక్తులు "యీషణత్రయము"లవిడువ
జాలక నిహసుఖభోగాదైశ్వర్యంబులేయుత్తమపురుషార్థముగ
భావించి కామ్యకర్మాసక్తులై స్వర్గఫలానంతరమందు జన్మ
మును కర్మములనెడి ఫలితంబొసఁగునట్టి భోగైశ్వర్య గతుల
యొక్క ప్రాప్తిని ప్రచురపఱచుచు ఫలవిశేషపుష్ప శోభి
తములైన "బంతి, చంద్రకాంత, మొదలగు చెట్లచందమున
మనసున కాహ్లాదకరమగునట్లు కర్మవిశేష మహిమంబులఁ
గీర్తించుచు చిత్తమునుప్పొంగించు మాటలచే మోసగించు
చున్నారు. ఇట్టివారలకు ఫలాభిలాషరహితమగు కర్మవిషయ
నిశ్చయజ్ఞానము చిత్తసుస్థిరబుద్ధి ఎన్నఁడును గలుగదు. కోరి
కలంజిక్కి యాచరించు కర్మలు బాహ్యకర్మాధీనమగుటచే
చిత్తభ్రమకలిగించి యాత్మజ్ఞానము నంతరింపఁ జేయును.
నాలుగు వేదములును సత్వరజస్తమోగుణ ప్రధానములై
సంసారకారణములగు మాయాకర్మలను బోధించును. కావున
నీవు మాయా మోహమున జిక్కక సత్వగుణశాశ్వతుండవై

---

* సంసారమునందు కోరిక కలవారు.

"ఈషణత్రయము"=1 ధనీషణ, 2 దారీషణ, 3 పుత్రీషణ
అనగా ధనమునందును భార్యాపుత్రాదులందును మోహము.

యోగక్షేమాసక్తి శూన్యుండవు, ద్వంద్వ విరహితుఁడవు, ఆత్మజ్ఞానయుక్తుఁడవు, త్రిగుణాతీతుఁడవునుఅగుము. స్వల్పాధికంబుగల నూతులును, జలపరిపూర్ణములై యొప్పు గొప్ప తటాకాది నదులును గూడ స్నానపానాదులకెట్లు సమానముగా నుపయోగపడుచున్నవో యటులవలెనే సమస్త వేద వేదాంగ యుక్తకర్మానుష్ఠానమువలన పొందుఫలము మహోత్కృష్టమైన జ్ఞాన సాధనముచే లభించుచున్నది. కావుననీవు జ్ఞానఫలములో నంతర్భాగమగు కర్మఫలంబులను లక్షించక కర్మములను జేయుచుండవలయునేగాని మానగూడదు. కర్మఫల కారణభూతుఁడవు మాత్రముగాకుండుము. కర్మ ఫలముల భగవదార్పణమొనర్పుము. విధ్యుక్తకర్మములనాచరింపుము అవి బంధకరములుకాఁజాలవు. ఫలాపేక్షతోఁ జేయఁబడుకర్మ నిష్కామబుద్ధితోఁ జేయఁబడు కర్మకంటె నీచమైనది. కావున నీవు కోరికలు లేనివాఁడవై వారువీరను విభేదబుద్ధిమానికష్ట సుఖములందు చిత్త చాంచల్యమునొందక బంధశూన్యంబగు నిత్యకర్మకు అంగమైన జ్ఞానకర్మనేయాశ్రయింపుము. జ్ఞాన బ్రహ్మమే దీనశరణ్యంబగు. భాగ్యభోగ్యాది కామ్యకాంక్షతో కర్మలొనర్చు మూఢులు పాపపాశ బద్ధులగుదు రే కాని ముక్తసంగులు కానేరరు. వారికి జననమరణాది సంసారసుఖ దుఃఖములు దప్పవు. కావున నీవు జ్ఞానకర్మకే యాచరించుటకు బ్రయత్నించుము. అదియేయుత్తమమైనది. సర్వశ్రేయోదాయకమగునదియు, సర్వకర్మములందు కుశలత్వముకలుగుము

ద్వంద్వవిరహితమైనదియునగు రాగద్వేషరాహిత్యమైన సమ త్వబుద్ధియే యోగమనఁబడును. ఆత్మానాత్మ జ్ఞానము కల వారు కర్మ లనుష్ఠించువారయ్యును తత్ఫలాభిలాషులు కా కుందురు. కావున కర్మజనితంబగు ధనంబును విడిచి జన్మ మనెడి బంధమునుకూడ త్యజించినవారై దుఃఖ రహితమైన మోక్షమును బొందుచున్నారు. ఎవ్వఁడు సమత్వభావముతో స్వధర్మముల నరుష్ఠించుచున్నాఁడో— దేహాభిమాన మనెడి కలుషత్వమును విడిచి వర్తించుచున్నాఁడో వాఁడే జీవన్ము క్తుఁడై దేహపాతముకానిదే సంచిత పుణ్య పాపములనుండి విముక్తుఁడగుచున్నాఁడు. జ్ఞానకర్మఫలాధిక్యముచే ప్రారబ్ధ కర్మ నశించి శరీరపాతముతో ప్రారబ్ధమంతరించును. పునర్జ న్మగారణంబగు కర్మంబెల్ల నశించుటచే నిహపరానందమైన బ్రహ్మలోకప్రాప్తి కలుగును.

అర్జునా! కోరికలయందాశ విడిచి నీబుద్ధి యెప్పుడు యజ్ఞానకాలుష్యశూన్యమై నిలచునో అప్పుడు యిదివఱకాల కించినదియు నాలకింపఁదలఁచినదియు నంతయు నిష్ఫలంబని తోఁచును. వేదమందు చెప్పఁబడినసత్యము గోచరమగును. ఇఁక వినదగినదిమఱియొకటి లేదను భావముస్ఫురించును. మనస్సు నిష్కలుషమై నిస్సంగతమైనిశ్చలమైనతోడనే ప్రకృతిపూర్ణ ముగావదలిపోయి జ్ఞానోదయమగును. దానంజేసి నీవుతరింపఁ గలవు. నానావిధకర్మఫలంబులకాసించి నీమనస్సుపరుగులిడక యెప్పుడుస్థిరముగా నిలిచియుండునో అప్పుడునీవుజ్ఞానసిద్ధిఁబడ

యగలవు. అంతదనుక నీవుకర్మయోగము ననుష్ఠింపుము. బుద్ధి యాత్మసంయోగమైశూన్యవిక్షేపస్థితమైయుండుటయేసమాధి దీనినేజీవాత్మపరమాత్మల సమతావస్థయందురు. వికల్పరాహిత్యబుద్ధిని నిశ్చలప్రజ్ఞయందురు. కావున నీవు నే జెప్పినట్లు చేయుము. నీకన్నివిధముల మేలగును. అర్జునా! నా హిత వాక్యములందు ఎవ్వఁడు విముఖుఁడగుచున్నాఁడో వాఁడు నష్టాత్ముఁడగుటయేగాక నరకప్రాప్తిఁబొందుచున్నాఁడు.

ఇట్లు వచించు వాసుదేవునకు వాసవాత్మజుఁ డిట్లని యెను–మాధవా! సమాధియందున్న నిశ్చల ప్రజ్ఞావంతుని లక్షణములెట్టివి? వాఁడేమేమి వచించును?ఎట్లుకూర్చుండును? ఎట్లు చరించును? వాని మనప్రవృత్తి యెట్లుండును!

అర్జునా! మానవుఁడెప్పుడును ప్రత్యగాత్మ స్వరూప మందే సంతోషించుచున్నవాఁడై చిత్తసంజనితమగు విష యవాంఛల నెప్పుడు నిగ్రహించగలుగునో అప్పుడే నిశ్చల ప్రజ్ఞావంతుఁడని చెప్పవచ్చును. అధ్యాత్మికాదిదుఃఖ సంభవ మందు గలఁత జెందనివాఁడు. సుఖములందు వాంఛ లేని వాఁడు, రాగద్వేషములు లేనివాఁడు. భయభ్రాంతులు లేని వాఁడు మిత్రులు శత్రులు అను విభేదము లేక సర్వత్రా సమత్వబుద్ధితో సంచరించువాఁడు నిశ్చల ప్రజ్ఞావంతుఁడన బరఁగును. ఎవ్వఁడు సర్వసమత్వబుద్ధికలవాఁడై 'అహం' నే నను అభిమాన మమకారముల విడిచి సుఖ దుఃఖములందు సంతోష విచారములు లేక మసలుచుండునో వాఁడే స్థిర

వికల్పరాహిత్యము=భ్రాంతిని విడనాడుట.

చిత్తుఁడవఁబడును. "సమస్తావయవముల తాఁబేలు తనలో ముకుళీకృత మొనర్చుకొను చందంబున" విషయములనుండి యింద్రియముల నెవ్వఁడు మరల్చుకొనఁ గలఁడో వాఁడే నిశ్చలప్రజ్ఞావంతుఁడు.

దేహాభిమానముగల మూఢునకు ఉపవాసము మొద లగు వ్రతానుష్ఠానములవలన శబ్దాదివిషయములు నివర్తింప వచ్చును. కాని, విషయవాంఛ మాత్రము వదలకుండును. సుస్థిరజ్ఞానదృష్టితో పరమాత్మను జూచునపుడే మానవుని విషయవాంఛలు పూర్తిగా నశించును. సంపూర్ణపరమాత్మ జ్ఞానము కలుగును. దానివలన నింద్రియ నిగ్రహము, విష యాఘ్రాణ నివృత్తియు గలుగును. ఇంద్రియములుమహత్తర శక్తివంతములు. మహాయోగనిద్రయందున్న మహేశ్వరుఁడు సైతము యింద్రియలోలుఁడయ్యెను. పరబ్రహ్మ పథప్రాప్తి కొఱకు వాయుభక్షకులై ఘోరతపంబొనర్చు విశ్వామిత్రాది మహాఋషులనే చలింపఁజేసినవి. కనుక సమస్తేంద్రియముల నెవ్వఁడు స్వాధీనమొనర్చుకొని నాయం దనురాగయుక్తుఁడై చిత్తము నాయందే లగ్నముచేసి వర్తించుచున్నాఁడో వాని బుద్ధి పరబ్రహ్మరూపమగు ప్రకృతియందు నిశ్చలమైనదని చెప్పనగును. సర్వదా విషయచింతన కలవానికి వానియం దాసక్తి కలుగును. దానివలన కోరిక పుట్టుచున్నది. కోరిక విఫలమగునప్పుడు క్రోధము కలుగుచున్నది. క్రోధమువలన జ్ఞాననాశనము, దానివలన గురు ప్రబోధితమైన నీతిమార్గాను

వర్తన బుద్ధివికాసముకూడ నశించుచున్నది. బుద్ధినశించుట తోడనే సర్వనాశనమైనట్లుండి కామక్రోధములు విజృంభించి మతిభ్రష్టుండై మానవుండెన్నియో యకార్యములాచరించు వాండై మిగుల చెడిపోవుచున్నాండు. రాగద్వేషము (కామ క్రోధము) లను రెంటిని విడిచినవాండై యింద్రియములచే దేహయాత్రకొఱకు కవసరమగు విషయములందు మెలంగు చున్నను నిష్కాముండగుటవలన యామానవుండు మిగుల నిర్మల చిత్తుండగును. నిర్మలచిత్తుండగు యోగికి సమస్త దుఃఖములు నశించును.

నిర్మలమైన చిత్తప్రశాంతి కలుగగానే నాయనుభవ యాకాశమునందంతటను నిండియుండు విధమున బుద్ధిసంపూ ర్ణమై స్థిరత్వమొందుచున్నది. అంతయు బ్రహ్మమే యను సర్వాత్మభావము కలుగును. అహంకార మమకారములు నశించును. నేను, నావారు, వాండు, వీండు. యనువిభేదభావ మంతరించును. ఇంద్రియలోలునకు నాత్మవిషయికజ్ఞానముదు యించదు. వానికి ఆత్మస్వరూపభావనయైనను యుండదు. చిదానందము చేకూరదు. మనశ్శాంతి లేని వానికి సుఖమను నది శూన్యము. విషయంబుల ననుసరించివిజృంభించి విచ్చల విడిగా సంచరించు మనస్సు నదిలోపోవునావ ననుగాలిలోఁ క్రమమార్గానుసరణిగాక గాలినిబట్టి పోవునట్టునావలె మనస్సును వక్రమార్గములవంకకు మరల్చి పలువిధముల సంక్షోభింపఁ జేయును. విషయములకుఁజిక్కక యింద్రియముల నవ్యాహ

వశపఱచుకొనఁగలుగుచున్నాఁడో వానిబుద్ధి నిశ్చలమై ఆత్మా నాత్మవివేకజ్ఞానముకలదగును. ఆత్మవిషయికమైనబుద్ధి పామరులకు చీకటివలె ప్రసరించును. జ్ఞానియాచీకటిలోనేయాత్మావలోకనము చేయుచున్నాఁడు. సర్వజీవులకేది రాత్రియో నిశ్చలప్రజ్ఞావంతునకది పట్టపగలు; సమస్తజీవులకేదిపగలుగనుండునో ఆత్మప్రసన్నతనొందిన నిశ్చలప్రజ్ఞావంతునకది రాత్రి; దృశ్యాదృశ్యజగత్తంతయు వానికంధకారముగ గనుపట్టును. సర్వప్రాణులీప్రపంచమును సత్యమనితలంచును. నిశ్చలప్రజ్ఞావంతుఁడిది కల్లయనియు నాత్మమాత్రమే నిక్కమనియునెంచి ప్రపంచమందు విరక్తుఁడై యుండును. పిపీలికాది సర్వజీవరాసులకు పగటియందువలె గోచరించుసర్వజగత్తు నిశ్చలప్రజ్ఞావంతునకు రాత్రియందువలె నగోచరంబగును. సర్వజీవులకు రాత్రియందువలె బ్రహ్మజ్ఞానముగోచరంబని చెప్పియుంటినిగదా! నిశ్చలప్రజ్ఞావంతుఁ డీయగోచరబ్రహ్మజ్ఞానమునం దుత్సహించి యత్మానందమున నోలలాడుచు పగటియందువలె వ్యవహరించుచు జ్ఞాననిష్ఠతో నానందించుచున్నాఁడు. సమస్తవాహినీ జలంబులు తన్ను జేరుచున్నను నించుకంతయుఁ బొంగని సముద్రంబున సర్వనదులెట్లు చేరుచున్నవియో యారీతిగానే శబ్దాదిసర్వవిషయంబులును యింద్రియనిగ్రహుఁడగు పురుషుని జేరుచున్నను నతఁడించుకేనియుఁజలింపక కేవలబ్రహ్మమున నైక్యమగుచున్నాఁడు. సర్వకామ్యవిరహితుఁడై శాంతినిగాంచు

చున్నాఁడు. దీనినే బ్రహ్మభావమని చెప్పఁబడును.

ఏమానవుఁడు 'ఈషణత్రయము'ను విడిచి ఆత్మా భిమానము దెగించి, కామక్రోధాది వికారములనోంచి అహంకారమమకారాది సకలేంద్రియ వ్యాపారక్రియారహితుఁడై మసలుచున్నాఁడో ఆపురుషుఁడే 'బ్రహ్మభావ'ము నంది సర్వసంసారదుఃఖోపశమనమగు శాంతిని బొందుచున్నాఁడు. ఈ స్థితిఁబొందినవానికి పునర్జన్మ లేదు (జన్మరాహిత్యుఁడగుచున్నాఁడు) మరణకాలమందైనను అజ్ఞానము నశించినవాఁడు 'బ్రహ్మస్థితి'నంది తప్పక మోక్షమును బొందుచున్నాఁడు. అతనికి మోక్ష మర చేతిలోనిదని యెఱుంగుము. ఎట్టి విషమావస్థలు సంభవిల్లినను చలింపక చిత్తము నీశ్వరాయత్తముచేసిన వానికి సకలసంశయార్థములు నివారణమైయాత్మ ప్రబోధము కలుగుచున్నది, నిష్కామకర్మయోగమనగా నిదియే. దీని నాచరించుటయే యుత్తమ పరమార్థము.

అర్జునా! మానవునకు నింద్రియములు ప్రబల శత్రువులు. ఈ యింద్రియముల జయించినవాఁడే నిశ్చల ప్రజ్ఞావంతుడు. ఇందువాని లక్షణాలక్షణసుఖస్వభావాదులను విశదీకరించియున్నాను. సర్వకామ్యరాహిత్యమే బుద్ధినిశ్చలత్వమునకు కారణము. కావున శాంతినాకాంక్షించువాఁడు విషయచింతనము వర్జించినవాఁడై సమస్తమును బ్రహ్మముగ భావించును. అదియే శాంతి. సర్వకర్మలు జ్ఞానమందు [illegible] నొందిననేగాని బ్రహ్మస్థితి కలిగి శాంతి చేకూరనేరదు.

విశేషము॥ ఈస్థితి కలుగుటకు విరోధకములైన, "శ్లో॥ వాసనా యస్తదావహ్నె ఋణవ్యాధి ద్విషామపి । స్నేహ వైరవిషాణామ్చ శేషఃసల్పో౽పిబాధతే" అనగా:- విషయ వాసన, అగ్ని, అప్పు, వ్యాధి, శత్రువు, పుత్ర కళత్రాదుల యందుప్రేమ, యితరులయందు విరోధము, విషము యివి కించిత్తైన మిగిలియున్నచో క్రమముగా వృద్ధిచెంది మిక్కిలి బాధించును. కావున, మొదటవీనిని నిశ్శేషముగ నశింప చేసేలాగున చూడవలయును. అని వాసిష్ఠమున చెప్పఁబడిన ప్రకారమే శ్రీకృష్ణుఁడిందు యర్జునునకు బోధించెను. అనగా శత్రువులను నిశ్శేషముగా దెగటార్చుట ధర్మమేయని బోధించెనని విజ్ఞులు గ్రహింతురుగాక.

---

బ్రహ్మము=ప్రకాశము, వెలుఁగు.

ద్వితీయ భాగము సాంఖ్యయోగము

సమాప్తము.



ఓమ్.

# శ్రీమదాంధ్ర భగవద్గీత,

## తృతీయ భాగము.

## కర్మయోగము

శ్రీకంఠ జటా ధృత మం
దాకిని భవకారణ ప్ర । ధాన పదతలా
లోకన లాలస పరిజన
లోకోద్ధరణ ప్రమేయ ॥ లోకభిరామా! ॥

ఇట్లు వచించిన శ్రీకృష్ణునిగాంచి అర్జునుఁడిట్లనెను — మధుసూదనా! కర్మకంటె జ్ఞానము పరమోత్తమంబగునదని వచించితివి కదా! అట్టి నన్ను ఘోరమైన యుద్ధకర్మయందేల ప్రవేశింపుమని పురికొల్పుచున్నావు! నీవు యొకమారు కర్మగొప్పదనియు నొకమారు జ్ఞానము గొప్పదనియుఁ జెప్పితివి. ఇందేది యుక్తమో నాకు యథార్థముగాఁ దెలియ శక్యముగాక యున్నది. నీవు సందిగ్ధార్థములగు మాటలచేత బుద్ధిని భ్రమింపఁ జేసెడువానిగా నిన్ను నే భావించుచున్నాను ఇపుడు. దేనినాచరించిన మోక్షము సులభప్రాప్యమో, ఏది శ్రేష్ఠమో నిర్ణయించి స్పష్టముగా తెలియఁజెప్పుము! అనిన యర్జునునకు శ్రీకృష్ణుఁడిట్లు చెప్పసాగెను.

ధనంజయా! ఈలోకమునందు ఆత్మానాత్మ వివేక జ్ఞానులకు జ్ఞానయోగంబును, పరిశుద్ధమానసయోగులకు నిష్కామకర్మయోగంబును అనుష్ఠేయంబులని యీద్వివిధనిష్ఠలు నిదివఱకే వచించియుంటిని. మానవుఁడు కర్మవర్జితుఁడై నంత మాత్రముననే ఆత్మపరిశుద్ధుఁడు కాఁజాలడు. కర్మపరిపక్వము కానేరదు, పాపవినాశము నొందదు. జ్ఞాన ముదయించదు. కర్మమునాచరింపకపోవుటకంటె నాచరించుటయే శ్రేష్ఠము యాగాదికర్మలు విడచుటవలన జ్ఞానసిద్ధికలుగనేరదు. ప్రతి మానవుఁడును యేదోయొక కర్మనుజేయక క్షణమైననుండుట దుస్సాధ్యము. కారణమేమన ప్రకృతిస్వభావమైన రజసత్వ తమోగుణములే వానిచేఁగర్మలనాచరింపఁజేయును. కర్మము మనోవాక్కాయములను మూడువిధములు. సుషుప్తి స్వప్న జాగ్రతావస్థలలోఁ గడపటియవస్థాయుగంలో మూడుకర్మల యం దేదోయొకదానినైనను మానవుఁడు విధిగా జేయుచుం డును. కర్మేంద్రియాది వాగ్వ్యాపారముల నరికట్టి చిత్తమున శబ్దాది విషయంబుల చింతనము చేయుచుండునట్టి జ్ఞానహీ నుఁడు కపటయోగి యనఁబడును. వీనికంటె జ్ఞానేంద్రియము లను మనస్సుచే నిగ్రహించుటకై ఫలాపేక్ష లేనివాఁడై కర్మేంద్రియములచేత కర్మయోగంబు నెవ్వఁ డనుష్ఠించుచు న్నాఁడో వాఁడేయుత్తముఁడు. కర్మము నాచరింపకుండుట కంటె నాచరించుటయే యుత్తమపురుషార్థము. కావుననీవు స్వకులాచారధర్మమగు కర్మమును సతతమాచరింపుము. ఎవ

రికేది నిష్కామకర్మమో ఆకర్మను వారు తప్పక చేయవల
యును. అట్లుచేయనివానికి దేహయాత్రజరుగుట కష్టము.
భగవదార్పణబుద్ధితో నాచరింపని కర్మలెల్లను మోక్షప్ర
బంధకములు. కావున ఫలాపేక్షమాని యజ్ఞార్థమై కర్మలాచ
రింపుము. తొల్లి బ్రహ్మదేవుఁడు జగత్సృష్టి జేయునపుడు
యజ్ఞములతోఁగూడిన ప్రజలను సృజించి యీ విధముగా
నుడివెను—

ఈ యజ్ఞములచేతమీరు వృద్ధిఁబొందుదురు. తప్పక
యజ్ఞములను జేయుఁడు. మీయభీష్టములు నెఱవేరునని వచిం
చెను. మీరు యాగాదికర్మలవలన నింద్రాదిదేవతలనుతృప్తి
నొందింపుడు. వర్షాదులనొసంగి వారలుమిమ్ములను బరితృప్తు
లగావించి సంతోషపఱచెదరు. ఇట్లుయొకరిచేనొకరు తృప్తి
బడసినవారలై తన్మూలమున జ్ఞానమును, దానివలన మోక్షము
బును బొందుదురు. మీరలాచరించినయజ్ఞముల వలన దేవ
తలు సంతోషించి మీకు గోగణంబులు, పాడి పంటలు,
పుత్రసంతతి, కాంతాకనకాదిసమస్తభాగ్యభోగ్యములనొసం
గుదురు. తదాదేవతాప్రసాదితమైన భాగ్యాది భోగములను
ఏమాత్రమును దేవతలకొఱకు వినియోగింపక నెవ్వఁడనుభ
వించునో వాఁడుచోరుఁడై దైన్యావస్థ ననుభవించు వాఁడ
గును, పంచయజ్ఞములుచేయునపుడు మిగిలిన పాయసమును
భుజించెడివారు సర్వపాపవిముక్తులై యిష్టకామ్యార్థసిద్ధి
బడయుచున్నారు. ఎవ్వరుతమయుదరపోషణార్థముమాత్రము

వండుకొని భుజించుచున్నారో వారెంతయు పాపులు. అట్టి వారు పాపమునే భక్షింతురు. కర్మవలనయజ్ఞము, యజ్ఞము వలనవర్షాదియోగంబు కలుగుచున్నది. వర్షమువలన నన్నము, నన్నమువలన ప్రాణులు పుట్టుచున్నవి. అన్నముయమృతజని తముగావున "అన్నముపరబ్రహ్మస్వరూపము" కర్మబ్రహ్మ వేదములవలనజనించెనని గ్రహించుము. ఆవేదములు 'పర మాత్మ' వలన నుత్పన్నమైనవి. అందుచే సర్వమునకు పర మాత్మయే కారణభూతము. కాబట్టి సర్వకారణమగు పర మాత్మ సర్వాంతర్యామియై సర్వదాయజ్ఞమునందు బ్రతిష్ఠిత మైయున్నది. ఈవిధముగా ఈశ్వర నియమితమైన యీభూత ధాత్రినసుసరించి యెవ్వఁడుచరింపఁడో వాఁడింద్రియ లోలుఁ డై పాప కృత్యములకుఁ బాల్పడి వ్యర్థజీవుఁడై బ్రతుకు చున్నాఁడు. నిత్యమైనపరమాత్మ జగత్తంతయునిండి భూత జానపధరూపమున వెలయుచున్నది. పరబ్రహ్మమునుండియే సమస్తము నుద్భవించుచున్నది.

"యస్మాదుద్భూతమ్ తత్తుత త్రైవలీయతే,, =ఎక్కడ నుండి పుట్టినదో అది అక్కడనే లయించుచున్నది. అని శాస్త్రములు దెల్పుచున్నవి. అనగా సమస్తభూతసముదా యము పరమాత్మనుండియే పుట్టి పరమాత్మయందే లీనమగు చున్నది. జన్మాజన్మలకు యజ్ఞమే సాధనము (జన్మకు, జన్మ రాహిత్యమునకు) ఇంద్రియలోలుర యజ్ఞములు ఆశాపాశ బంధకములు, జన్మహేతువులు, ఆత్మజ్ఞానుల యజ్ఞములు

జన్మరాహిత్య హేతువులు. ముక్తిప్రదాయకంబులు. కా
బట్టి కర్మ కోరికతోఁ గూడినదైనచో దేహాభిమానమునను,
బంధమునకు, దుఃఖమునకు, సంసారాభివృద్ధికి గారణము.
ఆకర్మము నిష్కామమైనదగుచో ఆత్మాభిమానమునను,
సుఖమునకు, మోక్షమునకు సంసారవిచ్ఛిన్నమునకుఁ గార
ణము. విషయములత్యజించి, ఆత్మానురాగియు అన్నపా
నాదులందు దృష్టివిడనాడి, బాహ్యార్థలాభంబుల నాకాంక్షిం
చక, ఆత్మయందే పరితృప్తిగాంచుచు, ఆత్మయందే సం
తుష్టిబొందుచు నెవ్వఁడానందించుచుండునో అట్టి యాత్మ
జ్ఞాని యాచరించవలసిన కర్మమేమియు లేనిదానిగా తెలి
యుము. దేహము నిలుపుటకుమాత్రమునలయు భిక్షాదులు
తప్ప ఆత్మజ్ఞాని యితర కర్మములు విడిచిపెట్టవచ్చును. ఆజ్ఞా
నికర్మలొనర్చుటచేగాని, యొనర్పకుండుటచేగాని కలుగు
లాభనష్టము లేమియు లేవు. భూతములద్వారా యొకఁడు
పొందెడి లాభమించుకయు గానరాదు. కావున సర్వకామ
రాహిత్యమే బుద్ధినిశ్చలత్వమునకుఁ గారణము. నీవు తప్పక
సర్వకామ్యవిరహితుఁడవుగమ్ము దీనినే చిత్తశుద్ధియందురు.
ఇదియే మోక్షసాధనము—ధర్మరక్షణార్థము కర్మలాచరించ
వచ్చును. ఆకర్మలు కోరికలులేని మనస్సుతో జేయవలెను.
దోషములేదు—అట్లుచేయువాఁడు సర్వగుణ పరిపూర్ణుఁడై ము
క్తినిగాంచుచున్నాఁడు. 'జనక చక్రవర్తి, అశ్వపతి, మొదల
గు రాజపురుషులు కోరికలులేనట్టి కర్మచేతనే [illegible]

లైరి. నీవును వారలంబోలెచిత్తశుద్ధిద్వారా మోక్షమున కును, లోకసంగ్రహార్థమునకు విహితకర్మరొనర్చుటకుం దగుదువు-ఎందుకన "యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదేవేతరో జనః సయత్ప్రమాణమ్ కురుతేలోకస్ తదనువర్తతే,, యుక్తముఁడు చేయుపద్ధతినే సామాన్యజనులుకూడ అనుకరింతురు. వివేకవంతునియాచరణ జూచియే లోకులునుఅద్దానినే యాచరింతురు. అతఁడేమ్మార్గమును ప్రమాణముగా నంగీకరించి వర్తించునో పామరజనాది లోకముగూడ దానినే యనుసరించును. నేను చేయవలసిన పని మూఁడు లోకములం దేదియులేదు. చేయకుండునదియులేదు. నేను పొందదగిన దియులేదు. అయినప్పటికిని నేను కర్మలాచరించుచునే యున్నాను-కాని, కర్మలేనివానిగానున్నాను. ఒకప్పుడైనను నేనుకర్మచేయకయుందునేని లోకమన్నివిధముల నన్నే యనుకరించి వర్తించును. నేనుకర్మరహితుఁడ నగుదునేని సమస్తము నశించును. లోకవిహితధర్మములను జెడఁగొట్టి ప్రజలను పాడుజేసిన వాఁడనగుదును. కావున మానవుఁడు నిష్కాముఁడై విహితకర్మల నాచరింపుచు లోకులకు మార్గదర్శియై వారు తన్నుయనుకరించునట్లు మెలఁగవలయును. యిట్టి పవిత్రధర్మము ఋషిపారంపర్యముగా అనుష్ఠింపఁబడు చువచ్చుచున్నది. కావున "జ్ఞానియగువాఁడు కర్మాసక్తులైన యజ్ఞానులకు కర్మచేయఁగూడదనిచెప్పి చిత్తచాంచల్యము నొందింపరాదు. అట్లుచేయుటచే కృతఘ్నత్వ దోషమాపా

దించును. తానుమిగులభక్తిశ్రద్ధలతో నుచితకర్మలాచరిం చుచున్నవాఁడై వారిచేగూడ నాచరింపఁజేయవలయును. అవి వేకులతో వివేకిచేరియున్నపుడు వారివలెఁదానను కర్మలఁగావు పార్థా! లోకధర్మము-ప్రకృతిజనితంబగు మాయాగుణ ములచే మానవుఁడనేక కర్మలొనర్చుచు వానినన్నిటిని దానే జేయుచుంటినని తలఁచుచుగర్వముతో చరించుచు న్నాఁడు. గుణత్రయస్వభావిక కర్మధర్మములు సత్యములుగా గ్రహించినవాఁడు విషయానువర్తనములై యింద్రియములు ప్రవర్తించుచున్నవనియు నిర్వికారుఁడైన తనకింక నేమియు వానితో నిమిత్తములేదనియు భావించుచున్నాఁడు. ఎవ్వరు మాయామమకారాది వికారములచే నపారమోహాసక్తులై ఫలాభిలాషులై కర్మలు చేయుచుందురో అట్టి అల్పజ్ఞాను లను ఆత్మజ్ఞాని నిరుత్సాహపఱచి కలవరపెట్టరాదు. అది పాపహేతువగును. కనుక నీవు ఆత్మానాత్మవివేకముగలవాఁ డవై సమస్తకర్మలనునాకర్పణము గావించి కోరికలు లేనివాఁ డవై మమకారవిచారములవీడి యుద్ధముచేయుము. ఇట్లువిని శ్రీకృష్ణునకు అర్జునుండిట్లనెను—

శ్రీకృష్ణా! మానవుఁడు తాను పాపకర్మంబులఁ జేయ నిష్టము లేనివాఁడైనను బలాత్కారముగా ప్రోత్సహింపఁబడిన వాఁడై పాపఫలంబులను జేయుచున్నాఁడు. ఇట్లుప్రోత్సహిం చునదియేది? అందులకు శ్రీకృష్ణుఁడిట్లు పలికెను. అర్జునా! చెప్పుచున్నాను వినుము -

నీవడిగినదానికి కారణభూతము రజోగుణము వలన గలిగినకామము. ఈకామమునఫలముకానప్పుడు క్రోధరూపము దాల్చుచున్నది. దీనికి మితిలేదు, ఇది సాహసించి యెంతటి ఘోరకృత్యమునైను చేయించును—మానవునకిదిగో ప్రబల శత్రువని భావించుము. ధూమముచేనగ్నియు, మురికిచే దర్పణమును, మావిచేగర్భస్థపిండమును గప్పంబడినట్లుజ్ఞాన మతృప్తిలేని కామముచేఁ గప్పఁబడును. మనోబుద్ధీంద్రియ ములు కామమునకాశ్రియస్థానములు—ఇవిచెలరేగి జ్ఞానమును గప్పివైచి మానవుని బెక్కురీతులుగా భ్రమింపఁజేయును: కావున నీవు యింద్రియముల నిగ్రహించి యజ్ఞాన సంభవ కామముపరిత్యజించి వ్యవహరించుము – దేహము కంటె నింద్రియములు, ఇంద్రియములకంటెమనస్సు మనస్సు కంటెనిశ్చయాత్మకమైనబుద్ధి శ్రేష్టములనియెఱుంగుము—అట్టి వంటిబుద్ధికంటె బుద్ధిసాక్షిత్వముగు పరమాత్మనిగుల గొప్ప దని తెలియుము—పరమాత్మ ప్రసన్నము నాకాంక్షించువారికి విషయచింతలంతరింపవలెను. వీని నణగద్రొక్కుటకు నింద్రి యనిగ్రహమే యుత్తమసాధనము—అట్లయిననేగాని పరమా త్మప్రసన్నము కలుగనేరదు. కావుననీవు బుద్ధికతీతమగు ఆత్మను దెలిసికొన్నవాఁడవై చిత్తంబును స్వాధీనపఱచు కొని నిర్జింపశక్యముకాని దుఃఖభాజమగు కామమును శత్రువు నుదెగటార్చుము. అర్జునా! ఎవ్వరు శ్రద్ధాభక్తియుతులై, అసహనములేక సేవచించినవిధమున కర్మముచేయుచుందురో

వారు పుణ్యపాపరూపమగు కర్మపాశబంధమునుండి విముక్తి నొందెదరు. నాయందసూయగలవారలై ఎవ్వరునేచెప్పినట్లాచరింపకుందురో వారన్నివిధముల జ్ఞానహీనులు, బుద్ధిమాంద్యులు, వినాశమానసులని యెఱుంగుము. అట్టివారు తప్పక యిడుమల పాలగుదురు. నీవుపదేపదే కర్మ, కర్మయని యేల ప్రస్తావించెదవు? పంచభూతాత్మకంబైనయీశరీరముకర్మచేత నేపుట్టికర్మచేతనే పెరిగికర్మచేతనే నశించుచున్నది. బ్రహ్మసృష్టియేకర్మజనితము.కర్మమేబ్రహ్మము.ప్రపంచమంతయుకర్మమునందే ప్రతిష్ఠితమై ప్రకాశించుచున్నది. విశ్వవ్యాపారమంతయు కర్మయుతమే. కర్మలేనిదెద్దియులేదు. కావుననీవు సంశయంబువిడిచి సమస్తకర్మలను నాకర్పణముచేసి నిష్కాముఁడవై సమరముచేయుము. నిన్నేదోషంబులు నంటవు. పరిపూర్ణకర్మయోగమనగా నిదియే. ఇది పరమ రహస్యంబగు సులభసాధ్యమైన యోగము.

---

విశే॥ కర్మలు త్రివిధము—

(1) కామ్యకర్మలు:—ఇహలోకమునగాని, పరలోకమునగాని సుఖములుబడయునుద్దేశముతో చేయఁబడుకర్మలు

(2) నిష్కామకర్మలు:—సాధనచతుష్టయసంపత్తి నిబడయుటకై చేయఁబడు కర్మలు.

(3) లోకసంగ్రహకర్మలు:—ఇహపర సుఖములకొఱకు నుచిత్తశుద్ధి కొరకునుగాక కేవలములోకులకు సన్మార్గదర్శకులుగనుండుటకై చేయఁబడు కర్మలు.

లోకసంగ్రహాకర్మాచరణులలో శ్రీకృష్ణుఁడు జనక మహారాజు, అశ్వపతి మొదలగువారు యగ్రగణ్యులనివిజ్ఞులు వచించుచున్నారు.

## తృతీయ భాగము కర్మయోగము
## సమాప్తము.



ఓమ్.

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# శ్రీమదాంధ్ర భగవద్గీత

---

## చతుర్థ భాగము.

## జ్ఞాన యోగము

శ్రీకర! భక్తవశీకర!
లోకావన శీలమహాని । లోలసుచేలా!
పాకారి రిపువిపాలా!
ప్రాకట కరుణాలవాల । రామనృపాలా!॥

శ్రీకృష్ణపరమాత్ముఁడర్జునునితో నిట్లు చెప్పఁబూనెను—

అర్జునా! ఎప్పటికిని నాశనములేని ఈ యోగంబును పూర్వము నేను సూర్యునకుఁ జెప్పి యున్నాను. సూర్యుఁడు తన కుమారుఁడైన వైవస్వతమనువునకుఁ జెప్పె, ఆ వైవస్వత మనువు ఇక్ష్వాకునకు విశదపఱచెను. ఈ ప్రకారమీయోగము నొకరినుండి యొకరు తెలిసికొనుచు నిమిమొదలగు రాజర్షులును క్రమముగాదీనిని గ్రహించిరి. బహుపురాతనమగుటంగ జేసి యిప్పుడాయోగము నశించినది. నీవు నాకుఁ బ్రియమిత్రుఁడవు, నాభక్తులలో ముఖ్యుఁడవు కనుక పరమోత్తమమైనదియుమిగులరహస్యమైనదియు నగు నీయోగమును నీకుఁ జెప్పితిని. "అనిన శ్రీకృష్ణునకు యర్జునుఁడిట్లనియె."

శ్రీకృష్ణా! సూర్యుఁడు పూర్వమెప్పుడో పుట్టినవాఁడు ఆయన పుట్టినవెనుక నెన్నియో యుగంబులు గతించినవి. నీవు పుట్టిన దీమధ్యనేకదా! నీకంటె నెంతయోముందు బుట్టిన సూర్యునకు నీవీయోగము నుపదేశించితివనునది నేనెట్లు విశ్వసింపగలుగుదును? ఇదియెంతయు నసమంజసము. అనిన విని శ్రీకృష్ణుఁడిట్లనెను:—

అర్జునా! నీకును నాకును నిదియే మొదటిజన్మకాదు. ఇదివఱకనేక జన్మంబు లతిక్రమించినవి. నాజన్మంబులనన్నిఁటిని నేనెఱుంగుదును. నీజన్మములసంగతి నీవెఱుంగవు. నేను పుట్టుకలేనివాఁడనై వికారశూన్యుఁడనయి నాశనరహితంబగు స్వభావము కలవాడనయి బ్రహ్మాదిసర్వభూతాత్మకుండనయి నిర్గుణతనయి నాప్రకృతిమాయను స్వాధీనపఱచుకొన్నవాఁడనయి నామాయచేతనే నేనుపుట్టుచున్నాను. నేను మాయామానవ స్వరూపుఁడనేగాని పాంచ భౌతాత్మిక శరీరుడనుగాను. లోకమునందేయేకాలంబున ధర్మంబునశించియధర్మంబు ప్రబలుచున్నదో, ఆశ్రమవాసులకు హాని ఘటిల్లుచున్నదో ఆయాకాలంబులందు నే నవతరించు చున్నాను. శిష్టజనరక్షణము, దుష్టజన శిక్షణము, అధర్మ నాశనము, ధర్మసంస్థాపనముకొఱకునై ప్రతి యుగమందున నేను తగిన యవతారము దాల్చుచున్నాఁడను. సాధుసంత్రాణము, పాప సంహారము, పుణ్యరక్షణార్థమే నా యవతార కారణములు. నేదాల్చు రూపము మదీయ మాయామేయ విలసిత

గర్తనుగానివానిగా దెలియుము. నన్నేకర్మంబులు నంటవు. కర్మఫలంబులందు నాకభిలాషలేదు. ఈరీతిగా నాయొక్కయ దార్థతత్వమునెవఁడు కనుఁగొనుచున్నాఁడో వాఁడు కర్మము లచేఁగట్టఁబడఁడు. కర్మఫలాపేక్షలేని కర్మయోగులు కర్మ బాధితశూన్యులు. ఈయదార్థమును దెలుసుకొనిన మోక్ష కాములును పురాతనులునగు జనక చక్రవర్తి, యశ్వపతి మొదలగు రాజఋషు లాచరించిన విధముగానీవును విహిత కర్మలఁజేయుము. కర్మయనగానెట్టిది? అకర్మయనగా నెటు వంటిది? ఈకర్మజ్ఞానవిషయమున శాస్త్రివేత్తలుకూడ విభ్ర మమును జెందుచున్నారు.

ఎంతజ్ఞానియైనను దనపూర్వకర్మపరిపాకముచేప్రాప్తం బయిన దేహేంద్రియమనోబుద్ధుల కనుగుణ్యముగా వ్యవహ రించును. సమస్తభూతములు నిశ్లేతమతమ సంస్కారసంయుత మైనప్రకృతి ననుసరించి సంసార వ్యామోహమును జెందు చుండును. సంసార బంధమునుండినీవెట్లువిముక్తినొందగలవో యాకర్మాకర్మలనుగూర్చి నీకిపుడు చెప్పుచున్నానువినుము. శాస్త్రి విహిత కర్మముయొక్కయు, శాస్త్రినిసిద్ధ కర్మము యొక్కయు కర్మరాహిత్యభావము యొక్కయు సత్యమును చక్కగా గ్రహించుము. దీనిని బాగుగా దెలిసికొందువేని సుఖదుఃఖ సంయుతమగుసంసారాబ్ధినుండితరించగలవు. కర్మా కర్మవికర్మల యదార్థస్థితినెఱుంగుట కష్టసాధ్యము.

ఎవ్వఁడు కర్మయందకర్మను, అకర్మయందు కర్మను

దెలియఁగల్గు మనుష్యుఁడో వాఁడే సర్వకర్మలను నాచరించిన వాఁడును, సకలధర్మానువర్తియు మహాయోగియు నగు చున్నాఁడు. కర్మయనఁగా నిచట నామరూపాదులచే నెంచిన ప్రపంచము. అకర్మయనగా దద్వ్యతిరిక్తమగు నిశ్చలమైన ఆత్మ. కర్మయందకర్మను దెలియుటనగా సమస్తప్రపంచము వాగారంభణమాత్రమనియు, ఆకారశూన్యమనియు, “రజ్జు సర్పమువలెఁ” బరిణమించిన ఆత్మయనియుఁ దెలిసికొనుట; మఱి అకర్మయందు కర్మను గ్రహించుటనగా సృష్టికిముందుండ గల సత్పదార్థము. “ఇదియే ఆత్మస్వరూప మగునాత్మ” మిక్కిలిగా వ్యాపించెదనని యత్నించి ప్రకృతి సహాయమున జగద్రూపముగా బరిణామమొందుట. కర్మయందు వికర్మను గాంచుటయనగా చేతనాచేతనప్రపంచమందలి వస్తువులనాత్మగను వీక్షించుట; వికర్మయందు కర్మను వీక్షించుట యనగా సర్వ జగత్తును ఆత్మయందుఁజూచుట; ఇట్టిజ్ఞానసంపన్నుఁడే పరిశుద్ధాంతఃకరణ కలవాఁడు. మానవుని జీవయాత్రకొఱకుఁ జేయఁబడు వ్యాపారసంబంధమగు కర్మయందుకర్మలేనిదిగా నెఱుంగును. ఎవ్వఁడేకర్మఁ జేయుటకును దానుకర్తనుగానని కర్తృత్వ కర్మ ఫలానుభవములు తనవిగానట్లుగాదలఁచి, కర్మఫలాపేక్షవిడిచి పరాత్మతృప్తుఁడై విషయముల విసర్జించినవాఁడై లోకానుగ్రహార్థమై కర్మలఁ జేయుచున్నను వాఁడు కర్మ నంటనివాఁడగు చున్నాఁడు. దేనియందు కోరికలేనివాఁడును, జ్ఞానాగ్నిదగ్ధకర్ముఁడును గలవాఁడు, శాస్త్రానుసారముగ విహరించువాఁడై కేవలము

శరీరపోషణకొఱకుమాత్రమే కర్మలొనర్చువాఁడెట్టిపాపంబును బొందఁడు. అట్టివాఁడు సంసారసంబంధమగు నేవిధమైనకర్మ జేసినను కొంచెమేనియు కర్మచేయనివాఁడగుచున్నాఁడు.

అయాచితముగ లభించినదానితో సంతృప్తి నొందు వాఁడు, శీతోష్ణాది ద్వంద్వరూపంబగు సుఖదుఃఖంబులందు గలఁతజెందనివాఁడు, ద్వేషభావములేనివాఁడు, ప్రాప్తాప్రాప్త వేళలందు నొకేభావముతో నుండువాఁడుకర్మములనాచరించి నను సంసారంబనియెడి కర్మపాశములచేఁ గట్టఁబడఁడు. ఆశ లేనివాఁడై పరమేశ్వర ప్రీత్యర్థమై కర్మలనాచరించు నాని కర్మ సమస్తము శీఘ్రముగా నశించును. ఇట్టివాఁడు ఆశా విరహితుఁడు గనుక బ్రహ్మజ్ఞానలగ్నచిత్తుఁడై హోమసాధన ములగు ఋక్కువాదులు, యజ్ఞపాత్రలు బ్రహ్మమనియు, నేయి, మోదుగసమిధలు, యవలు మొదలుగాగల హోమ ద్రవ్యము బ్రహ్మమనియు, అగ్నియే బ్రహ్మమని యజ్ఞ కర్తయనే బ్రహ్మంబుచేఁ జేయఁబడు హోమకర్మంబనేహవన క్రియ బ్రహ్మమనియు, ఆ బ్రహ్మరూపకర్మంబునందు నిశ్చల జ్ఞానముచే పొందబడు ఫలము బ్రహ్మమేయనియు నెవ్వఁడు తెలిసికొనుచున్నాఁడో వానికికర్మంబు లేదు. కర్మయోగు లైనవారు దేవతాయజన సాధనంబయిన యజ్ఞమనే ఫలము నాశించి యజ్ఞములు సేయుచున్నారు. జ్ఞానులు కొందఱు ఆజ్యము మొదలగు హోమ ద్రవ్యములచే పరమార్థంబుతోఁ గూడిన ఆత్మపదార్థమను బ్రహ్మమనెడు యజ్ఞకర్మ రూప

కాగ్నియందు హోమమొనర్చుచున్నారు. మఱికొందఱు కొందఱు *శబ్దరూపాదివిషయ పంచకమును ఇంద్రియములనెడి అనలంబున హోమముఁ జేయుచున్నారు. ఇంకను కొందఱు •శ్రోత్రఘ్రాణపానాది సమస్తేంద్రియ ప్రాణసంచారగమనాది కర్మలను మనోనిగ్రహమును అగ్నిహోత్రమందు హోమము జేయుచున్నారు. కొందఱు విషయరూపాన్నంబును [illegible] యాగ్నులందు వ్రేల్చుచున్నారు. కొందఱు [illegible] ప్రాణాదిదశవాయువుల బహిర్గమనాదికర్మలను జ్ఞానదీప్తిచే పరిశుద్ధికాబడిన యింద్రియ నిగ్రహంబనెడి అగ్నియందు హోమంబు జేయుచున్నారు. కొందఱు [illegible] ద్రవ్యదానము, జపతపములు చేయుచున్నారు. కొందఱు పరమనిష్ఠాత్ములై వ్రతములాచరించుచున్నారు. కొందఱు పూరకరేచక కుంభకాదులయొక్క రూపంబగు ప్రాణాయామంబే ప్రాప్తిగాగలవారలు ప్రాణాపానవాయుగమనములను నిగ్రహించి శారీరసంబంధమగు సమస్త [illegible] తములోనే నాశనమొనర్చుకొని ప్రాణసంయోగమునందే [illegible] అగ్నియందు హోమంబు జేయుచున్నారు.

కొందఱు అష్టాంగయోగాభ్యాసము, మఱికొందఱు వేదపారాయణము, వేదవేదాంగాది శాస్త్రములంజేసి [illegible]

---

*ఇచ్చట ఇంద్రియ యింద్రియనిగ్రహము [illegible] యందు లీనము చేసుకొనుచున్నారని ముఖ్యతాత్పర్యము [illegible] ద్రియాది ప్రాణపంచకము యొక్క ప్రవర్తనములను నిరోధించుటకు మనస్సును నాశనము చేయుచున్నారని భావము.

పరిజ్ఞానము మొదలగు తత్త్వంబుల నెడి యజ్ఞములు సలుపు చున్నారు. జితేంద్రియులయినవారును, మహాపుణ్య వ్రతా చరణులును యిట్టిపలు విధములయినవారందఱును యజ్ఞవిధు లను దెలిసినవారే. యజ్ఞములవలన వారిపాపములు నశించి నట్టివారే: యజ్ఞములందు మిగిలిన యమృతమును భుజించిన వారు తప్పక శాశ్వతమైన బ్రహ్మ పదార్థమును బొందు చున్నారు. ఈయజ్ఞములలో నొకదానినైనను సేయని వారి కిహలోకమందును పరలోకమందునుగూడ సౌఖ్యము లేదు సరిగదా! రెంటియందును కష్టము లెంతమాత్రము తప్పవు. ఇట్లు పెక్కుయజ్ఞములు వేదమునందు చెప్పఁబడినవి. ఈ సమస్తయజ్ఞములును కర్మలేనిదే కలుగుచుండ లేదుగదా! ప్రతికార్యము నేదోయొకరీతిగ 'కర్మ'తో సంబంధము కలిగి యున్నది. కావున నీవుయిట్టిదని కర్మస్వభావమును దెలిసి కొన్నవాఁడవేని సంసారబంధమునుండి విడువఁబడిన వాఁడ వగుదువు. ద్రవ్యాది సాధనవిశేషములతోఁ జేయఁబడు యజ్ఞ ములకంటె జ్ఞానయజ్ఞము మిగుల శ్రేష్ఠమయినది. కర్మసమ స్తంబును వినాశంబులేనిదై బ్రహ్మపదార్థము విశిష్టంబగు జ్ఞానమందు అంతర్భూతంబయినిండి ప్రకాశించుచున్నయది. కావున నీవు తత్త్వవేత్తలైన జ్ఞానయోగులకు నమస్కార మొనర్చి సపర్యలాచరించి నీకుఁదెలియనివిషయంబుల వారల నుండి యుపదేశమంది తెలుసుకొనుము. అప్పుడు నీకు జ్ఞానముకలుగును. జ్ఞానము వలన మోహము నశించును. సమస్త ప్రాణిసమూహమును పరబ్రహ్మాత్మకుండ నగు నా

యందును, ప్రత్యగాత్మనైన నీయందును నీవు జూడఁగలవు. దుష్కృతులలో మహాదుష్కృతుఁడవైనను జ్ఞానమను నావ తెప్ప వలన పాపమహాసముద్రమును దాటఁగలవు. బాగుగా మండుచున్న యగ్ని కట్టెలను దహించి భస్మము చేయు విధముగా జ్ఞానాగ్ని సమస్తకర్మంబులను దహించినాశనముగావించును. జ్ఞానముతో సమానమయినది పవిత్రమయినది యీ లోకంబున మఱియొకటి లేదు.

శ్లో॥ "దృగాత్మనిదృశమ్ముక్త్వాత్యక్త్వాఽసౌ బాహ్యసంభవమ్
విందత్యేవన సందేహః పరమాత్మానమవ్యయమ్॥"

దృక్కగు ఆత్మయందు దృష్టినుంచిన జ్ఞానయోగి ఆత్మకు బాహ్యమగు దృశ్యమునంతను వదలి పరమాత్మను తెలియుచున్నాఁడు; సందేహము లేదు. ఇట్లని బ్రహ్మవిద్యాశాస్త్రము చెప్పుచున్నది..."

యోగసిద్ధినొందినవాఁడు కాలక్రమంబున తనయందే జ్ఞానమును పొందుచున్నాఁడు. జ్ఞానమును పొందినతోడనే గొప్పదైన చిత్తోపరతిని గాంచుచున్నాఁడు. ఇదియే బ్రహ్మనిర్వాణము. (మోక్షము) జ్ఞానశూన్యుఁడు, సంశయచిత్తుఁడు చెడిపోవుదురు. సంశయచిత్తున కిహపరసుఖములు రెండును దూరములే. అవజ్ఞాని విజ్ఞానిదైనప్పుడు అశ్రద్ధ గలవాఁడు శ్రద్ధగలవాఁడైన పిమ్మటను ప్రాభవమందవచ్చును గాని సంశయమనస్కుఁడగువాని కట్టిసదవకాశము లేదు. కావున నిశ్చలజ్ఞానము ముఖ్యము. పరబ్రహ్మ సందర్శన రూపమగు జ్ఞానయోగముచే కర్మరాహిత్యుఁడైనవాఁడు, [illegible]

జ్ఞానమువలన సందేహనిర్ముక్తుఁడయిన ఆత్మజ్ఞాని నెట్టికర్మలు సంశ్లేషింపనేరవు. కనుకనీవు సకల సంశయములను విడనాడి నిశ్చలజ్ఞానచిత్తుఁడవై జ్ఞానఖడ్గముతో ముఖ్యమైన *శత్రు షట్కమును దెగటార్చుము. లెమ్ము, నిష్కామబుద్ధితో స్వధర్మమైన యుద్ధముచేయుము. జయాపజయములు నాయధీనములు. వానితోనీకు నిమిత్తములేదు. నిన్నేదోషంబులును పొందనేరవు. కావున జ్ఞానయజ్ఞమునే సేయుము. శాంతిని జేకొనుము. ప్రకృతకర్మనిన్ను బాయదుగనుక యుద్ధముచేయుట నీకవశ్యకర్తవ్యము. తప్పదు లెమ్ము.

వి॥ ఇది జ్ఞానయోగమైనను కర్మయోగమిందు విపులముగా చర్చింపఁబడినది. భగవదవతారయాథార్థ్యము, ఆయన నిష్పక్షపాత్యము వ్యక్తపఱుపఁబడినవి. కర్మయోగము జ్ఞానయోగమునకు సన్నిహితమై యొప్పుచున్నది.

---

*ఇచ్చట 37 పుటలో:-

(1) కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములను నవియాఱును మానవుని ప్రబలశత్రువులనుట-

(2) దుర్యోధనాదులలో మొదటిముగ్గురును కర్ణుఁడు శకుని, సైంధవుఁడునని యుత్తరభావము గ్రహింపనగును. అనగా నీయార్వురును పాండవులకు ముఖ్యశత్రువులని సమన్వయము భగవానుఁడీభావముననే యిట్లు వచించి యుండెనని విజ్ఞులు గ్రహింతురుగాక.

చతుర్థభాగము—జ్ఞానయోగము
సమాప్తము.

ఓమ్.

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# శ్రీమదాంధ్ర భగవద్గీత

## పంచమ భాగము.

## కర్మసన్న్యాస యోగము

శ్రీమద్భక్త జనావనా నిపుణతా । శ్రీ జానకీ సేవితా
కామక్రోధవిమోహలోభరహితా । కళ్యాణగాత్రా[illegible]
యోగామోఘావ్యయలోలమానసహితా । యజ్ఞోపవిద్యాన్వితా
కామధ్వంస భవామరేంద్రవిహితా । సంశోభితా [illegible] ॥

శ్రీకృష్ణభగవానుని యర్జునుండిట్లనియెను:- "ఓ కృష్ణా! నీవాక్యములు నాకు సందిగ్ధములుగా దోచుచున్నవి. ఒకప్పుడు కర్మపరిత్యాగము చేయుమనియు మరియొకప్పుడు కర్మతప్పక నాచరింపవలసినదనియుం జెప్పుచున్నావు. నా మనంబున కేదిచేయుటకు దోచకున్నది. దేని నాచరించిన శుభప్రదమో తెలియుటలేదు. కావున కర్మసన్న్యాస కర్మ యోగములలో నేది శ్రేయదాయకమో దానిని నిశ్చయముగా నిర్ణయించి విశదముగా దెలియజెప్పుము" అనిన యర్జునునకు శ్రీకృష్ణుండిట్లు సెలవిచ్చెను.

అర్జునా! కర్మను విడిచిపెట్టుటయు, కర్మను చేయుటయు అనునీ రెండును మోక్షదాయకములైన యోగములే. ఈ రెండింటిధర్మములు కర్మచేయకుండుటకంటె కర్మచేయుటయే శ్రేష్ఠమని శాస్త్రములు నొక్కివక్కాణించుచున్నవి. కావున జ్ఞానవిరహిత కర్మపరిత్యాగముకంటె కర్మయోగమే చాల మంచిదని నానిశ్చితాభిప్రాయము. ఎవ్వఁడు, అనురాగ విరోధములు అనునీ రెండును విడిచి చరించుచున్నాఁడో వాఁడేసంసారబంధమునుండి విడువఁబడినవాఁడై నిజమైన సన్యాసియగుచున్నాఁడు. ఆచరించు కర్మగలవాఁడై తత్కర్మజనితంబగు రాగ ద్వేషములచే వికలఁత జెందనివాఁడు సన్యాసియనఁబరఁగును. కర్మాచరణశూన్యుఁడయి హృదయ వాంఛలువీడనివాఁడు సన్యాసికానేరఁడు. జ్ఞానసంయుతమగు కర్మసన్యాసము 'సాంఖ్యము, ఆత్మపరిశుద్ధి నొందించుచు దన్మూలమున జ్ఞానసాధన మైనది కర్మయోగము. కనుక *సాంఖ్యకర్మయోగముల రెండింటియొక్క ఫలంబు నొక్కటియే. కాని, అజ్ఞానులు సాంఖ్యకర్మయోగములు భిన్నములుగా భావించెదరు. జ్ఞానులావిధమున బల్కరు. ఈ రెండింటిలో దేనినాచరించినను రెండింటియొక్కఫలమునులభించును. ఈరహస్యము నెవ్వఁడు తెలుసుకొను చున్నాఁడో వాఁడే జ్ఞాని. పరమాత్మజ్ఞానముచేత సన్యాసి యెట్టి మోక్షమును

*ఇచట ఫలము:- 1. కర్మాచరణము, 2. ఆత్మపరిశుద్ధి, 3. జ్ఞానము, 4. మోక్షము అనునవి.

బొందుచున్నాఁడో అట్టిమోక్షమునే నిష్కామకర్మ చేయ చుండెడు కర్మయోగియుఁ బొందుచున్నాఁడు. కర్మరహితముగు సన్న్యాసము స్వీకరించుట చాలకష్టము. నిష్కామకర్మమును భగవదర్పణబుద్ధితో జేయుకర్మయోగి పరబ్రహ్మస్వరూపమును త్వరితముగ పొందగలుగుచున్నాఁడు. కనుకనే కర్మయోగము మిగులప్రశస్తమని చెప్పఁబడినది. కర్మయోగి పరిశుద్ధమానసుఁడై *జితేంద్రియుఁడై "సర్వాత్మభావము" కలిగి తన్నుతాను దెలిసికొని కర్మలఁ జేయుచున్నవాఁడయ్యును ఆయాకర్మఫలముల నంటఁబడక †శాశ్వతబ్రహ్మపదము నలంకరించుచున్నాఁడు.

సర్వాత్మభావాలోకనగల ఆత్మయోగి ఆలోకించుచు ఆలకించుచు, అంటుచు, ఆఘ్రాణించుచు, భుజించుచు, నడ

---

*సకలాంతరేంద్రియ బాహ్యేంద్రియములను జయించినవాఁడు. అనగా సమస్తేంద్రియ వ్యాపారములను జయించినవాఁడు.

"సర్వాత్మభావము" అనగా, అంతయు బ్రహ్మమేను తనకన్న వేరొకటిలేదు, మానవాదిసమస్తభూత హృదయాంతరాళములందు వెలుగొందుచున్న చైతన్యము కాని, పరిపూర్ణబ్రహ్మమొకటియే స్వీయప్రకాశమానమై జ్ఞానరూపమై ఆనందమయమై యున్నదని గ్రహించుట.

†పునర్జన్మలేని మోక్షము; అనగా జన్మరాహిత్యమును బొందుచున్నాఁడనుట.

చుచు, నిద్రించుచు, శ్వాసలనువిడుచుచు, పలుకుచు, గ్రహించుచు, ఆత్మజలముల విడిచిపెట్టుచు, నేత్రంబులఁదెఱచుచు మూయుచు ఉన్నవాఁడైనను ఇంద్రియములు విషయంబులందు ప్రవర్తించుచున్నవని తెలిసినవాఁడై తానించుకేనియు జేయుట లేదనియు, క్రియా రహితుఁడ ననియు దలంచుచుండును. ఎవ్వఁడు ఫలాసక్తినివిడిచి సమస్తకర్మముల పరమేశ్వర ప్రీత్యర్థం బాచరించుచున్నాఁడో వాఁడు 'తామరాకును నీరుఅంటని చందమున, ఎట్టిపాపములచేత నంటఁబడఁడు.

ఫలాపేక్షలేని కర్మ యోగులు మనశ్శుద్ధి కొఱకు స్నానాది శారీరక శుచికర్మలను, ధ్యానాది మానసికకర్మంబులను, నిశ్చయాదిబుద్ధికర్మలను వినుటమొదలగు సమస్తేంద్రియ వ్యాపారకర్మలను జేయుచున్నారు. పరమాత్మజ్ఞాన సమీక్షణులు కర్మలాచరించుచున్నను వానిసీశ్వర సమర్పిత బుద్ధితో జేయుచుందురు. కావున, ఆత్మశుద్ధి—జ్ఞానము—శాంతి క్రమముగా బొందుచున్నారు. అజ్ఞుఁడు కామముచేఁ బ్రేరేపింపఁబడినవాఁడై కర్మలనాచరించి కర్మఫలపాశములచే బంధింపఁబడుచున్నాఁడు. ఇంద్రియనిగ్రహుఁడగుయోగినవద్వారయుతమయిన నగరివంటి యీశరీరమందు మనోవాక్కాయ సంబంధమైన సర్వకర్మపరిత్యాగియై, తానెట్టికర్మను జేయక ఇతరులచేఁజేయింపక క్రియారహితుఁడై *బ్రహ్మభావమును బొంది శాశ్వతసుఖమును బడయుచున్నాఁడు.

---

*చిత్తోపరతి—సర్వాత్మభావము;

శ్లో॥ "యోఽన్తస్సుఖోఽన్తరారామస్తథాన్తర్జ్యోతిరేవయః
సయోగీబ్రహ్మనిర్వాణమ్ బ్రహ్మభూతోఽధిగచ్ఛతి॥"

సుఖస్వరూపమగు పరబ్రహ్మమందు రమించువాఁడైన
అంతర్జ్యోతి రూపుఁడైన యోగి బ్రహ్మమై నిర్వాణమును
పొందుచున్నాఁడు. అనగా అఖండపరిపూర్ణ బ్రహ్మమై
నిరవధికానందముతో సర్వాధారుఁడై యున్నవాఁడగుచున్నాఁడు.

ఆత్మజ్ఞానశూన్యుఁడు దేహము ఆత్మయని, నేను,
నాది, తానేకర్త, భోక్తయును*అహంకారమమకారగమాన
ములుగలిగి శాంతినిగాంచలేఁడు. సృజనకర్త యగు పరమేశ్వ
రుఁడు మానవునియొక్క కర్తృత్వంబును గలుగఁజేయఁడు. వాని
యొక్క కర్మలను గల్పింపఁడు. మనుజునికి కర్మచేత గలుగు
ఫలమునందలి అభిలాషను బుట్టింపఁడు. ఇయ్యవి స్వభావ
కూడ †మాయవలననే గలుగుచున్నవి. సద్గురుని యు
పదేశమువలన ఎవ్వానియజ్ఞానము ఉపాసనముచే
అనగా నశించుచున్నదో, ఇంతవరకు మాయచే మేఘా
వృతమై ఉన్నదో వానియొక్క మనోగోళమున జ్ఞానము
మేఘమునుండి వెలువడిన సూర్యునివలెను పరమాత్మస్వరూప
బును ప్రకాశింపఁజేయుచున్నది. అజ్ఞానము నిశ్శేషముగా
నశించుటచేత సకలపాపనిర్ముక్తులై జ్ఞానులు పరబ్రహ్మ
మందే ఆత్మనిల్పి, ఆత్మయే బ్రహ్మమని తెలుసుకొని, అట్టివారు

* నేను, నాది, అభిమానము. † ప్రకృతి, అవిద్య, అజ్ఞా
నము, చీకటి.

నుందే అభినివేశంబుగలిగి, బ్రహ్మమే నిత్యమని గ్రహించిన వారై *పునరావృత్తి లేని మోక్షంబును బొంది పరబ్రహ్మమం దైక్యమగుచున్నారు.

♦ విద్యా వినయాగుణ ప్రపూర్ణుండగు బ్రాహ్మణుని యందు, మాంసాహారులగు చండాలాది మానవులందు, ధేనువులందు, కుంజరములందు, అశ్వములందు, సింహము, పులి ఖడ్గమృగాది క్రూరజంతువులందు, పిల్లి, కుక్క, కోడి, కాకి, ఘూక, బకరాబందాది పశుపక్షిమృగ సమస్త భూతములయందు నేకైకదృష్టిగలవాడై సమత్వభావముతో నెవ్వడు వర్తించునో, సర్వభూతములందు సమముగా వ్యాపించియున్న బ్రహ్మపదార్థమును నెవ్వడు తెలుసుకొనునో వాడే జీవన్ముక్తుడు. (బ్రతికియుండగనే ముక్తినొందినవాడు) అట్టిసర్వ సమత్వభావముగలవాడే బ్రహ్మనిర్వాణపదమునం దాసీనుండగుచున్నాడు. (మోక్షమును బొందుచున్నాడు) అట్లు

*తిరుగ జన్మంబు లేకుండుట;

♦ బుద్ధిచేత బ్రాహ్మణుడయినవాడనియు, ప్రవర్తనచే చండాలురనియు నవుభావము గ్రహింపనగు, నంతియే గాని కులముప్రధానముకానేరదు. ఇది పండితాభిప్రాయము. ఇట్లు వ్యవహరింపబడుటకు మానవుని యుత్తమ గుణాదిక నైచ్యములే కారణములనుట నిక్కము. బ్రాహ్మణకులమున బుట్టినను మాంసాహారమధుపానాది వ్యసనములజిక్కిన వాడు చండాలుడని చెప్పబడును.

సమస్తకర్మలను ఫలాసక్తి విడిచి యాచరించునదియే కర్మ సన్న్యాసమని చెప్పఁబడును. కర్మఫల త్యాగ మొనర్చిన యోగులు దేహేంద్రియప్రాణమనో బుద్ధులచేత ఆత్మశుద్ధి కొఱకు కర్మలాచరించుచున్నను ఉడికినవిత్తనములు మొలక లెత్తనిచందమున సంసారవాంఛా బీజము లంకురింపనేరవు. ప్రకృతియే సంసారమునకు, బంధమునకు, విచ్ఛిత్తికిఁ గారణము. కావున ప్రకృతిని(అజ్ఞానమును) మొదలంట ఛేదించిన వాఁడు బ్రహ్మభావమును బొంది బ్రహ్మపద సుఖాసీనుఁ డగు చున్నాఁడు. కర్మఫలత్యాగమే బ్రహ్మనిర్వాణమునకుయుత్తమ సాధనము. బాహ్యేంద్రియములనుండి ఆత్మను విముఖత్వ మొనర్చి యంతర్ముఖముగావించుటయే యోగము. ఇదియే యాత్మజ్ఞానమునకుముఖ్యసాధనము. ఆత్మయోగమన, సర్వత్ర ఆత్మనుగాంచుట, సర్వమునాత్మయందు జూచుట, ఆత్మ యోగి తాననుష్టింపఁదగుముఖ్యధర్మములు, బ్రహ్మ విద్యాధి నేతయై నిర్వాణముబొందగల పద్ధతియు నిందు వివరింపఁ బడినది.

పంచమభాగము - కర్మసన్న్యాసయోగము

సమాప్తము.

— o —

ఓమ్.

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# శ్రీమదాంధ్ర భగవద్గీత

## షష్ఠమ భాగము.

## ఆత్మసంయమ యోగము

శ్రీ జనకాత్మజ హృత్సర
సీజపరభృత శుభకర ! శృంగారపదాం
భోజా! కరుణాజలధీ
రాజితగిరి సదనవినుత ! రమ్య చరిత్రా!॥

శ్రీకృష్ణ భగవానుఁడర్జునునితో నిట్లు చెప్పసాగెను—

అర్జునా! ప్రతిఫలాపేక్షలేని కర్మలను కర్తవ్యమను వేద విహితముగా జేయుచున్నాఁడో వాఁడే కర్మసంన్యాసియు చిత్తశుద్ధియుగల యోగి. యాతఁడే సమస్తరీతుల సన్యాసి యనఁబడును. అగ్నిహోత్రాదికర్మలను విడిచినంత మాత్రమున సన్యాసి కాఁజాలఁడు. దేనిని సన్యాసమని వచింతురో అదియే యోగమని గ్రహించుము. దీనినే కర్మయోగమని చెప్పెదరు. సంకల్పవికల్పకంబగు చిత్తమును నిగ్రహింపఁజాలనివాఁడు యోగికానేరఁడు. ఫలవిరహిత కర్మాచరణమే కర్మయోగిముఖ్యాశయము. సర్వసంకల్పరాహిత్యమే సన్యాసి

కర్తవ్యము. సంకల్పరాహిత్యము, ఫలత్యాగము రెండును మనస్సును జయించిననేగాని సాధ్యముకానివి. ఈరహస్యము నెఱిగిన కర్మయోగియు సన్న్యాసమును స్వీకరించుచున్నాఁడు. నిష్కామమువలన జ్ఞానమును, జ్ఞానమువలన సర్వకర్మసన్న్యాసమును బొందవచ్చును. వానివలన చిత్తోపరతి గలుగును. కావున మానవుఁడు ప్రయత్నించి జ్ఞానదృష్టిచేఁ దన్నుఁదా నుద్ధరించుకొనవలయును. ప్రకృతిమోహమునకు ఆత్మను అధోగతిపాలుగావించఁగూడదు. * దేహాత్మనుఁ దానేబంధువు తానేశత్రువు: తనకు స్వాధీనమైనచిత్తమే పరమబంధువు, స్వాధీనముకాని చిత్తమే ప్రబలశత్రువు. కావున చిత్తోపరతి కలవాఁడు శీతోష్ణములందు, సుఖదుఃఖములందు మానావమానములందు మనోవికలతఁజెందక నిర్వికారుఁడై చరించుచున్నాఁడు. జ్ఞానవిజ్ఞానములచే పరిశుద్ధమానసుఁడై శత్రుఁడిని పుత్రుఁడిని నొకేవిధమున వీక్షించువాఁడు, అవస్థాభేదములందు ఉచ్ఛనీచము లెంచనివాఁడు, మనోవేగము నడంచినవాఁడును, న్యాయాన్యాయపరిశీలనచిత్తుఁడును యోగియనఁ

* ప్రారబ్ధకర్మసంభవమైన పాపమెంత బలీయమైనను దగిన పురుషప్రయత్నముచేత దాని బారినుండి కొంతవఱకు దప్పించుకొనవచ్చుననియు, ప్రతిమానవునకు నిండుకర్తృత్వము కొంతవఱకు గలదనియు మిత్రశత్రుత్వములకు దనకుఁదానే కారణముగాని యొరులెవ్వరుఁగారనియు "శ్రీకృష్ణభగవానుని యుద్దేశమైనట్లీ గీతమునందు భావార్థము స్ఫురించుచున్నది.

జయించినవాఁడు. లోకోపకారార్థమై కామ్యకర్మఫలత్యాగి యై నిష్కామకర్మలనాచరించువాఁడును, ప్రశాంతుఁడు, జితేంద్రియుఁడు, తృప్తుఁడు, నాశరహితుఁడు, స్థిరుఁడు, ద్వంద్వాతీతుఁడు, ఎక్కువ తక్కువ లనుచు విక్షే పములేని సంకల్పరహితుఁడై సమత్వభావముతో సంచరిం చుచు ప్రపంచవిషయ భోగవిరాగియై సంకల్ప వికల్ప ములన్నియు పరిత్యజించువాఁడును♦యోగారూఢుఁడని చెప్పఁబడు చున్నాఁడు.

యోగియైనవాఁడు మనస్సును చింతనముచేత నిర్జన ప్రదేశ మందు ఏకాకిగానుండి ఆశాపాశములను త్రెంచి మన స్సును స్వాధీనపరచుకొని, దేనియందును అపేక్షలేనివాఁడయి సమాధిస్థుఁడై పరిశుభ్ర ప్రదేశంబున నాసనంబును దానిపై కృష్ణాజినంబును దానిమీఁదపరిశుభ్రవస్త్రమును పఱచి దానిపై నాసనాసీనుఁడై నిశ్చల మనస్కుఁడై యింద్రియములను జయించి ఆత్మసంశుద్ధికొఱకు యోగము నభ్యసింపవలయును. దేహము, తల, మెడ మొదలగునవి కదలకుండ నిలిపి దిక్కులు పరికింపక భ్రూయుగమధ్యమునందే తననాసికా గ్రమును యేకాగ్రదృష్టితో వీక్షించుచు శాంత విభీతుఁడై బ్రహ్మచర్యమునాచరించుచు స్థిరచిత్తముతో నన్నెవ్వఁడు ధ్యానించుచున్నాఁడో ఆ మహాయోగి నావలననే మోక్ష మును, అనగా చిత్తశాంతిని బొందుచున్నాఁడు. అపరిమితా హారభోక్తకు, నిరాహారవ్రతాచరణునకు, నిరతము నిద్రిం

♦ సర్వకర్మపరిత్యాగియగు జ్ఞాని.

చువానికి, సదానిద్రమూని చరించువాని కీయోగము వశ్యము కాదు. మితాహారవిహారము-విహితకర్మానుష్ఠానము. సుషుప్తి జాగ్రతావస్థలు (నిద్రయు మెలకువయు) సమానముగాగల వానికి; తగినంత విశ్రాంతి కలవానికీయోగమువశ్యమై సర్వ దుఃఖోపశమనము గావించును. చిత్తము చలింపనిదై పర మానందరూపమైన స్వస్వరూపాను సంధానమందు యెప్పుడు నిలిచియుండునో, దేహాత్మభావమంతరించి సమస్త కోరికలు నశించుటం జేసి ఎప్పుడు ప్రపంచదృశ్యప్రతీతివిస్ఫురణలేనిదై *సామాన్యవిశేషభావరహితమగు అఖండవిజ్ఞానరూప పర మాత్మ ప్రసన్నమై, స్వయంప్రకాశమానమై నిరావరణమై తేజరిల్లుచు అవిద్యాంధకార ప్రయుక్త సంకల్ప వికల్ప దోష ములు నశించునో అప్పుడా యోగి పరిపూర్ణ అపరోక్ష జ్ఞాన మును బొందినవాడై సదా పరబ్రహ్మానందసుఖము ననుభ వించుచున్నాడు.

---

విశేషము॥ *సామాన్యవిశేషభావరహితపరమాత్మ—

సామాన్యమనగా ఈసమస్త ప్రపంచము: విశేష మనగా ప్రపంచబాధకము; సామాన్యమగు దృశ్య ప్రతీతి, విశేషరూప పరమాత్మజ్ఞానముచే నశించుచున్నది. ఇట్టిది సామాన్యవిశేషభావము విచారించిన పరమాత్మ బాధ్య బాధక భావములేనిదగుటచేతను, అద్వితీయ మగుటచేతను, స్వయంపకాశముతో వెలుగొందుచుండుటచేతను, నిర్విశేష మైయున్నది. శేషమనగా "ప్రపంచము" శేషియనగా "పర

మాత్మ" ఇట్టి శేషశేషిభావములేనిది పరమాత్మ అద్వితీ
యము, అఖండస్వరూపము, ఆనందఘనమునై యున్నది.
అందుచే సకల బుద్ధిదోషములు నశించి సర్వకల్పనలు నిశ్శే
షముగా విలయమొంది సమస్తము బ్రహ్మస్వరూపమే యని
దృఢమగుచున్నది.

అప్పుడు *కాచపాత్రయందుంచిన దీపము వాయు
వుచేఁ జలింపఁబడక వెలుఁగుచున్నట్లుగా జ్ఞానముచే నావరింపఁ
బడిన యోగి ఆత్మజ్యోతి రజస్తమోగుణ మేఘ వాయువుల
కించుకయుఁ జలింపక సత్త్వగుణప్రవృద్ధమై అచలమై ప్రకా
శించును. యోగశక్తిచే వశీకరచిత్తముకలవాఁడై యెవ్వాడు
యుపరతిఁబొందునో, ఎప్పుడు పవిత్రాత్మయందు స్వస్వ
రూపపరమాత్మను జూచుచుఁదనలో నానందించుచున్నాఁ
డో-ఇంద్రియముల కగోచరమై బుద్ధికిమాత్రము గోచరించు
అనంతసుఖమెప్పుడు పొందగలుగునో అప్పుడా యోగి జితేం
ద్రియుఁడై, చిదానంద స్వరూపుఁడై అచల బ్రహ్మమై
స్వస్వరూపానందసాగరమున నోలలాడుచుండును. ఇట్టి
శమాదిషట్కసంపత్తిగల యత్నశీలుఁడగు యోగి, దీనికంటె
నెక్కుడైన యానందము నభిలషింపఁడు. మహాకష్టములెన్ని
సంభవించినను కలఁతనొందఁడు. కావున యోగమనగా సర్వ
చింతల నోదార్చి సుఖముల నొందించునదిగా నెంచుము.

*గాజుచిప్ప అనగాఁ లాంతరు మొదలగు అద్దా
లతో గూడిన దీపపుబుడికెలు.

దృఢచిత్తముతో నమ్మి యాచరింపఁ దగినది యోగము. సంకల్ప సంభవములైన సర్వకామములనుండి సమస్తేంద్రియములకు మూలమైన మనస్సును మఱలించి నిశ్చలమైన బుద్ధిచే మెల్ల మెల్లగా నుపరతిని బొందించి స్వస్వరూప పరమాత్మయందైక్యముగావించియేమాత్రము నన్య విషయాలోచనబారిఁబడనీయక ననిశ్చల మైనదియు, సుస్థిరంబుగానట్టియు మనస్సునువిషయాసక్తము గాకుండునట్లు యోగబలముచే బంధించి స్వాధీనము జేసికొని స్వస్వరూప చిదాత్మయందే నిలుపవలయును. ఈవిధముగా చిత్త శాంతి కలవాఁడై, కామక్రోధాది వికారములనెవఁడుసహింపశక్తుఁడై నశించిన రజోగుణము కలవాఁడై జితేంద్రియుడగుచున్నాడో వాఁడే ఘోర పాపవిముక్తుఁడై నటువంటి యోగియై అత్యంత బ్రహ్మానంద సుఖమును బొందుచున్నాఁడు. ఇట్టి ఆత్మయోగి నిరవధికానందము ను సర్వదా సునాయాసముగ బొందుచు సర్వాత్మభావముతో *నిర్విశేషబ్రహ్మము నెల్లెడలఁ గాంచుచున్న వాఁడగుచు మోక్షంబు నొందుచున్నాఁడు. కావున, ♦పంచభూతాత్మకంబయిన సమస్త భూతముల యందును తనను, సమస్త భూతములను దన యందును జూచుచున్నాఁడు.

---

* శేషమనగా 'ప్రపంచము' శేషియనగా 'పరమాత్మ:-నిర్ అనగా శూన్యము; ఇట్టిశేష శేషిభావము లేనిది అఖండపరిపూర్ణబ్రహ్మమనుట-

ఎవ్వఁడు సమస్తభూతనివహమునందుఁగూడ నన్నుఁ గాంచుచున్నాఁడో, స్థావరజంగమాది సర్వభూత సంభృతమగు విశ్వంబును నాయందును, విశ్వమంతటను నన్నును నెవఁడు కాంచగలుగుచున్నాఁడో వానికి నేనును నాకు వాఁడును ప్రత్యక్షరూపము కలవారముగా నుందుమనుట నిక్కము. ఇదియే జీవాత్మ పరమాత్మల సంధానము. (జీవబ్రహ్మైక్యము) ఈ రహస్యము నెఱింగిన యాత్మయోగి సమస్తభూతములయందుండునది నాస్వరూపముగా నెంచి నన్నే పూజించును. అతఁడు నిరంతరమెట్లు వర్తించుచున్నను సర్వవిధముల నాయందే చిత్తముంచి ప్రవర్తించుచున్నవాఁడగుచు జీవన్ముక్తుఁడై కడను నాసాయుజ్యము నే పొందుచున్నాఁడు. ఎవ్వఁడు సమస్త ప్రాణిసముదాయముల సుఖదుఃఖములు తనవిగా భావించి, ఎవ్వరిని-ఏప్రాణిని హింసింపక సమత్వభావాలోకనగలవాఁడై వర్తించుచున్నాఁడో యతఁడే మిగుల శ్రేష్ఠుఁడనియు మహాజ్ఞానియనియు నా యభిమతము: ఇట్టివాఁడే స్థితప్రజ్ఞుఁడనఁబడును. అనినకృష్ణుని వాక్యములకు అర్జునుఁడిట్లనయెను.

వాసుదేవా! నేను చంచల చిత్తుఁడనగుటచే నీచే నిప్పుడు యేసామ్యయోగము ప్రబోధింపఁబడెనో అద్దాని

---

♦పృథివ్యాపస్తేజో వాయురాకాశంబులు: అనగా భూమి, జలము, అగ్ని, గాలి, ఆకాశము యివి పంచభూతములు.

నాచపంచుటకు వశక్యముగా దోచుచున్నది. దీని యథార్థ స్థితి నరయఁజాలకున్నాను. చిత్తముమిక్కిలి చంచలమైన దియును సంక్షోభమొనర్చునదియును, ప్రబలమైనదియు వశముచేసుకొనుట కసాధ్యమైనదియును; కావున వాయువు నరికట్టుటయనగా నెటువంటిదో మనస్సు నరికట్టుట అంత కష్టసాధ్యముగదా! అట్టి మనస్సును నేనెట్లు స్వాధీనము చేసుకొనఁగలను? అందులకు శ్రీకృష్ణుఁడిట్లనెను.

అర్జునా! అవును మనస్సు స్థిరము లేనిదగుట నిశ్చయమే. ఈమాటలలో అబద్ధములేదు. కాని, ధ్యానము చేతను అభ్యాసముచేతను వైరాగ్యము చేతను స్వాధీన పఱచుకొనవచ్చును. ఇవిలేనివానికిది దుస్సాధ్య మనియే చెప్పనగును. అయినను స్వాధీనచిత్తముగలవానికి ఉపాయ ప్రయత్నములవలన నీయోగమును పొందుటకు సమర్థత కలుగుననియే నా యభిప్రాయము. ఇది విని యర్జునుఁ డిట్లనియె:—

శ్రీకృష్ణా! యోగమునందెంత శ్రద్ధ వహించినను నియమములేని యాస్తికబుద్ధికలవానికి చంచలమానసునకు యోగఫలము చేకూరదు. సరికదా! అందుచే మోక్షము నకును జెడినవాఁడగుచున్నాఁడు. ఇందునిమిత్తమై యిహ పరలోకసుఖముల నొసంగు కర్మలు విడునఁబడెను. ఈ యోగిగతియేమి? పరమాత్మయందు బుద్ధినిల్పలేని మూఢా త్ముఁడు కర్మజ్ఞాన మార్గములకు రెండింటికి మారుఁడు

కాఁబడి భ్రష్టుఁడై మేఘమండలమునుండి వాయు పీడనచే చెదరిపోయిన మేఘమువలె చెడిపోకయుండునా? యని నా సంశయము. కావున, ఈసందియమును దొలఁగింప బసల వలనగాదు. నీవేసమర్థుఁడవగుటఁ దెలియఁజెప్పుమని ప్రార్థించుచున్నవాఁడ ననిన "శ్రీకృష్ణ పరమాత్మఁ"డిట్లు ప్రతి వచనంబిచ్చెను.

అర్జునా! యోగభ్రష్టుఁడైన వాని కేలోకమునందు గూడ నాశనము లేదుతండ్రీ! సత్కార్యము లొనర్చునాఁ డెప్పుడు దుర్గతిపాలుగాఁడుసుమా! యోగభ్రష్టుఁడైనవాఁడు పుణ్యాత్ములు పొందునట్టి లోకమునుపొంది యనంతరము సదాచారసంపన్నులైన భాగ్యవంతుల యిండ్ల జననంబు నొందుచున్నాఁడు. అట్లుకానియెడ మహా బుద్ధిమంతులైన మహాసీయులుజన్మించిన వంశంబున బుట్టుచున్నాఁడు. అది యుంగానిచో మహాయోగులకులమందు జనించి పూర్వజన్మ వాసననుబట్టి జ్ఞానముగలవాఁడై యోగసిద్ధికై ప్రయత్నించి మనస్సుస్వాధీనము గాకపోయినప్పటికిని పూర్వజన్మానుభవ పూర్వకంబగు అభ్యాసముచేతనే విషయంబులనుండి మనస్సును మఱలించినవాఁడై వేదోక్త కర్మానుష్ఠాన ఫలము కంటె మహాఫలప్రాప్తి గలవాఁడై అనేకజన్మములందుసంపాదితమైన జ్ఞానసిద్ధిఁబడసినవాఁడై ముక్తనుగతియగుమోక్షమును బొందుచున్నాఁడు. యోగ జిజ్ఞాసువు నెన్నఁడును అధోగతిఁబొందఁడు.. మహానిష్ఠాగరిష్ఠులగు తాపసోత్తముల

కంటెను, వేదవేదాంగాది శాస్త్రవేదుల కంటెను యోగి యుత్తముడుగా పరిగణింపఁబడును. కావున నోయర్జునా! నీవుతప్పక యోగము నవలంబించుము. ఏమానవుఁడు నాయందు భక్తివిశ్వాసములుగలవాఁడై నన్నే యాశ్రయించి సర్వమునన్నుగాభావించి, పరిశుద్ధాంతఃకరణము గలవాఁడై మనఃపూర్వకంబుగా సేవించుచున్నాఁడో వాఁడే యోగశ్రేష్ఠులలో మిక్కిలియుత్తముఁడని నేను గ్రహించుచున్నాను. వానిని నేనాంతఃరంగిక భక్తుఁడుగా నమ్ముచున్నాను. అట్టి భక్తుల *యోగక్షేమములను నేనేవహించెదను.

వి॥ ఈయోగమునకు ధ్యానయోగమనిఅపరనామము కలదు. ఇందు గ్రహించవలసిన ముఖ్యవిషయము లెవ్వి యనఁగా సమస్తవాసనలనుండి మనస్సునుమరలించినవాఁడు కేవలవిశుద్ధ సత్వగుణ ప్రపూర్ణమానసుఁడగుటంజేసి కర్మసన్యాసమొనర్ప సమర్థుఁడుగావచ్చును. యోగారూఢుఁడని, యిట్టివానినే జెప్పుదురు. కర్మఫలసన్యాసమొనర్చుటచేజ్ఞానోపార్జన కర్తులైనవారిని నారుబుక్షువులందురు. ఈపేర్కొనబడిన యిరువురిలో నెవరికైనను మనోజయము ముఖ్యముగా గావలసినదనుట నిక్కము. మనోనిగ్రహమునకు వైరాగ్య యోగధ్యానములే ముఖ్యసాధనములని యిందు నిరూపింపఁ

*యోగక్షేమములు:-అనగా, అప్రాప్యమైనదానిని ప్రాపింపజేయుటయోగమనియు, ప్రాపించినదానినిసంరక్షించుటక్షేమమనియు, గ్రహింపనగును,

జనించినది. కావున నారోగ్యమునకౌషధము సేవించుటలో ననుపాన పథ్యాపథ్యాదిమార్పులు ముఖ్యములుకదా! దానిం జేసియే శరీరవ్యగ్రత లడఁగును. తద్విధముగనే మనోవ్యగ్రత లడఁగుటకు యోగాభ్యాసమే దివ్యౌషధమనుట సందేహమావంతయు లేదు. ఇచ్చట ఆహారవిషయ మాలోచింపఁదగినది. మనుజుఁడేది భుజించినను మనస్సే ప్రధానమని వచించువారి సిద్ధాంతమును విజ్ఞులు తెలిసికొనవచ్చును. కావున నాహారమును మార్పుచేసుకొనినమాత్రమే మనస్సుమార్పు గల్గునని విజ్ఞులు గ్రహించెదరుగాక.

(ఆహారమునందలి) 1. పృథ్వీతత్త్వము! అహంకారముగాను, 2. జలతత్త్వము చిత్తముగాను, 3. అగ్నితత్త్వము బుద్ధిగాను, 4 వాయుతత్త్వము మనస్సుగాను 5. ఆకాశతత్త్వము అంతఃకరణముగాను మారుచుండును అని ఆయుర్వేద మెంతదీర్ఘాలోచనతోఁ దెల్పెనో గ్రహించుడు. కావున యోగాభ్యాసము చేయువాఁడు అన్నపానాదియాహారవిషయమున గొంతమార్పునియమము పాటించి భుజించుటవసరము. మిక్కిలిగా భుజింపరాదు, ఉపవాసదీక్ష పూనరాదు. ఇదియే యోగియొక్క ముఖ్యకర్తవ్యము. కనుకనిందు వివరింపఁబడిన ధర్మములను గమనించి యోగ మభ్యసించువారికిఁ దప్పక ఫలసిద్ధికలుగును. ఒకానొకవేళ నీ జన్మలో గలుగకపోయినను మరుచటిజన్మలందు మిక్కిలిదీక్షవహించి కృషిసల్పినవారైయోగ సిద్ధిరూపమగు ముక్తినిబొందుదురు.

షష్ఠమభాగము—సమాప్తము.

ఓమ్.

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# శ్రీమదాంధ్ర భగవద్గీత

## సప్తమ భాగము.

## విజ్ఞానయోగము

శ్రీమహిజాతా హృదీరమ
ణా మహితగుణానిగమ గ । ణాభరణా స
ర్వామరసన్నుతచరణా
కోమల మునిహృదయసదన । కుధరోద్ధరణా!॥

శ్రీకృష్ణ పరమాత్ముఁడు అర్జునునితో నిట్లు చెప్పఁ బూనెను— అర్జునా! సదానాయందేలగ్నమొనర్చిన మనస్సు గలవాఁడవై యోగాభ్యాసము చేయుచు నన్నే యాశ్రయముగా నమ్మియున్ననీవు సకలైశ్వర్య సత్వగుణ ప్రపూర్ణుఁడనైన నన్నునీవు సందేహములేక నెట్లు తెలియఁగలవో విశదీకరించెద సావధానచిత్తుఁడవై వినుము:— శాస్త్రపరిజ్ఞానమును యనుభవజ్ఞానమును సమన్వయించి వివరించెదను. దీనిని సాంతముగాఁ దెలిసికొందువేని నీకిఁక దెలియఁదగినవిషయము యింకొకటేదియు లేదు. వేలాదిజనులలో నెవ్వఁడో యొకానొకఁడు మాత్రము నన్ను నాత్మజ్ఞానముచేఁ దెలిసికొనఁ బ్రయత్నించుచున్నాఁడు. అట్లు ప్రయత్నించినవారలలో వేయి మందికొకఁడు కృతార్థుఁడగుచున్నాఁడు. ఆకృతార్థు లయిన

నిశ్చలచిత్తము, సద్గుణులందు ధర్మనీతి, భూపతుల యందు న్యాయాన్యాయ పరిశీలనము, వీరులయందు విక్రమము, సకలభూతకోటికి సనాతనబీజము, ఆశానురాగ యుతమైన బలవంతుల బలవైభవము, న్యాయవిరుద్ధమైన కామము, సర్వకర్మాకర్మలు నేనేయని గ్రహించుము. సత్వగుణప్రధాన మైన శమదమాదులు, రజోగుణప్రధానమగు దర్ప హర్షా దులు, తమోగుణప్రధానమైన శోకమోహములు. మొద లగు భావములన్నియు నాచేత ప్రభవించుచున్నవి. కాని యవి నన్నాశ్రయించి లేవు. నేనువాటి నాశ్రయించియులేను. ఆత్మగుణములకెన్నడు లోబడునది కాదు. గుణము లాత్మ నించుకయుఁ జేరఁజాలవు. కాని, గుణత్రయముచే జనించిన భావములెల్లను ఆత్మాశ్రితములగుచున్నవి. విశ్వమంతయుఁ త్రిగుణవికార మయమై సమస్తప్రాణిసమూహము నీమూడు గుణములచే మోహితాత్మకంబై గుణభావములకంటె విలక్ష ణుఁడను యవినాశనుఁడనునైన నన్నునెఱుఁగఁజాలకున్నది. జగము షడ్భావవికార సంయుతము. ఆత్మనిర్వికల్పనిరంజన నిర్వికారము. నిత్యశుద్ధముక్త జ్ఞానరూపము. అఖిలభూతకోటి యు దేహాభిమానముంజేసి ఆత్మనుగాంచుటలేదు. ఈశ్వర సంబంధమగు త్రిగుణాత్మకంబైన నామాయ దాట నెవరికిని సాధ్యముకాదు. నన్నెవరుశరణము బొందుచున్నారో వార లీ మాయనుండి తరించగలుగు చున్నారు. సర్వాత్మ భావ ముచే నీమాయ నశించును. దుర్జనులు, యజ్ఞానులు మూఢ

మనులు, మిత్రద్రోహులు, నమ్మినవారిని జెరుపు కుటిలాత్ములు మొదలగు పాపకర్మాచరణులు నామాయా ప్రభావముచే యుక్తాయుక్తము లరయ నేరక రాక్షసత్వముగలవారై క్రూరహింసాది దుష్కృత్యము లాచరించు మానవాధములు నన్ను బొందజాలరు. నన్ను సేవించు పుణ్యాత్ములు నాలుగు తెగలుగనున్నారు. వారెవ్వరన:—ఆర్తులు, జిజ్ఞాసులు, అర్థార్థులు, జ్ఞానులు, అనువారలు, అనగా:—

1. ఆర్తులు:—దొంగలు, క్రూరజంతువులు, శత్రువులు, భయంకరవ్యాధులు మున్నగువానిచే బీడింపఁబడినవారు.

2. జిజ్ఞాసువులు:— బ్రహ్మతత్వముఁ దెలిసికొన నభిలషించువారు.

3. అర్థార్థులు:—ఈషణత్రయమునం దాసక్తిగలవారు. అనగా—"ధనేషణ, దారేషణ, పుత్త్రైషణ" యను ధనమునందు భార్యాపుత్త్రాదులయందు మమకారముగలవారు.

4. జ్ఞానులు:—బ్రహ్మవేత్తలు; అనగా పరబ్రహ్మసందర్శనాసక్తులు—వారిలో సదాభ్యాసనాసక్తులు; అసమాన భక్తితో స్వస్వరూప సందిగ్ధులగు జ్ఞానులు శ్రేష్ఠులు. ఆజ్ఞానులకు నేను మిగుల యిష్టముకలవాఁడను. నాకా జ్ఞానులు మిగుల యిష్టముగలవారు. ఈ నాలుగు విధములగు వారలును మహాత్ములే, కాని వారిలో 'నుత్తమజ్ఞాని సర్వాత్మభావముకలవాఁడై నేనే శ్రేష్ఠమైన ప్రాప్యస్థానముగా నమ్మియున్నవాఁడగుచున్నాఁడు. ఆమానవుఁడుజ్ఞానసముపార్జనగల

బహుజన్మంబు లెత్తినపిమ్మట సంపూర్ణజ్ఞానము కలవాఁడై సమస్తము వాసుదేవ, మయమని తెలిసికొని సదా నన్నే పూజించువాఁడై నన్నుబొందుచున్నాఁడు. ఈరీతిగ స్వస్వరూపమును దెలుసుకొన్న మహాత్ముఁడు మిగుల దుర్లభుఁడగు వాఁడు. తమతమ పూర్వజన్మకర్మవాసనల ననుసరించి మానవులు కామాసక్తతచే వివేకహీనులై ఆయాయిష్ట దేవతా పూజాది వ్రతాచరణులై వారల మనోగతాభీష్టసిద్ధి కొఱకు నన్యదేవతల నారాధించుచున్నారు. ఎవరు యేయే యభీష్టములుగలవారలై యవిసిద్ధించుకొఱకు దీక్షమూనినవారై యేయే దేవతామూర్తులయందు దృష్టినిలిపినిశ్చలభక్తితో నారాధించుచున్నారో వారలకాయాదేవతలందు దృఢమైన భక్తిశ్రద్ధలను నేను కలిగించుచున్నాను. నన్ను యే స్వరూపము గలవానిగా దలఁచి స్మరించుచున్నారో వారలకు నేనట్టి స్వరూపముతోనే గోచరించుచున్నాను. కాని నామాయచే నావరింపఁబడి మానవులు మరపుజెందినవారై నన్నుఁ గానలేక పోవుచున్నారు. ఎవరు యేవాంఛితార్థులై ఆయా దేవతా విగ్రహముల నారాధించు చున్నారో, వారలు నా వలన నాయాదేవతలద్వారా ప్రసాదింపఁబడిన కామితార్థములను పొందుచు తద్దాదైవతములను చేరుచున్నారు. నీచబుద్ధిగల వారి వాంఛిత ఫలములు స్వప్నఫలములై వినాశము లగుచున్నవి. నన్ను ప్రీతిపూర్వకముగా భజించునట్టి భక్తులు నన్నుఁబొందుచున్నారు. అవజ్ఞానస గోచరమై, అవ్యయమై,

అవ్యక్తమై, నిరతిశయమై, అఖండ తేజోమయమై వెలుగొందు
చున్న నా పరమాత్మ స్వరూపమును తెలియలేక తమ్ము తామె
మఱచి సంసారవియోగసాగరమున నోలలాడుచు మూఢులు
నన్ను దృగ్గోచరమైన శరీరధారిగా భావించుచున్నారు.
అజ్ఞానులు శాశ్వతమైన నా చిదాత్మస్వరూపమును గుర్తింప
నేరక నాది యశాశ్వతమైన శరీరముగా భావించుచున్నారు.
అజ్ఞానజన్యమైన మోహజన్యము యోగమాయచే పరివృత
మైన దగుటచే మోహాత్మకమై నా నిజస్వరూపమును తెలియక
నన్ను జననమరణములు గలవానిగా దలచుచున్నయది.
స్వయంభువుడనని యెఱుంగదు. నేను ఇదివఱకు గడచి
పోయినట్టియు, ఇప్పుడున్నటువంటియు, ఇంక రాబోవునట్టియు
భూతముల నన్నింటిని నేనెఱుంగుదును. కాని, నాయం
దొక్కటియు నన్నెఱుంగజాలదు. జన్మముతోడనే కామ
క్రోధములు తత్సంభూతమైన సుఖదుఃఖాది ద్వంద్వములు
ప్రాప్తములగుచున్నవి. సమస్తభూతములు సుఖదుఃఖాది
ద్వంద్వములకు మూలకారణమైన మోహమును బొందు
చున్నవి. పుణ్యకర్మనాచరించిన వారలు సమస్తపాపములు నిశ్శే
షముగ నశించినవారై “[illegible]” సకలద్వంద్వ విమో
చనులై దృఢనిష్ఠతో నన్ను సేవించుచున్నారు. ఎవ్వరు జనన
మరణముల కారణమై సుఖదుఃఖములతో గూడిన సంసార
మునుండి తరించి జననమరణ రాహిత్యముకై నన్నాశ్ర
యించి ప్రయత్నించుచున్నారో వారు పరమాత్మను, నా

యొక్క బ్రహ్మపదార్థమును సంపూర్ణప్రత్యగాత్మ విషయ పదార్థములను సకలకర్మస్వభావమును దెలిసికొనగలుగుదురు. ఎవ్వరునన్ను అధిదైవాధి భూతములతోను అధియజ్ఞము తోను గూడియున్నవాఁడనని తెలుసుకొనుచున్నారో వారు అచంచల దృష్టిగలవారలై యవసానకాలమందుగూడనన్ను గాంచినవారలై నాసాయుజ్యమును బొందుచున్నారు.

విశే॥ ఈయోగమందు స్వానుభవజ్ఞానమును గూర్చి బోధింపఁబడెను. దీననే "విజ్ఞాన" మందురు. దీనిని మనో బుద్ధీంద్రియాదులచేతఁగూడ దెలిసికొనన శక్యము. లోకమం దలి నీవు, నేను, అది, ఇది అనుభేదవ్యవహారము బుద్ధికల్పి తము. బుద్ధియే దేహాదులనన్నిఁటిని గల్పించుచున్నది అదియే దేహేంద్రియాదులందు ఆత్మత్వబుద్ధిని అనగా ననాత్మభావ మును గలుగజేయుచున్నది. అందుచే భేదప్రపంచము ప్రతీయ మానమగుచున్నది. బుద్ధియనగా జీవునకుపాధి అగును. ఇదియే జీవత్వమునకు గారణమగుచున్నది. ఈబుద్ధి పరమాత్మయగు తనను ఆచ్ఛాదించుచున్నయది. కావున బుద్ధియనగా అవిద్య (అజ్ఞానము) అగును. ఈకారణముచేతనే అజ్ఞానము దొలఁ గినజీవుఁడు పరమాత్మయే యగుచున్నాఁడు. బుద్ధి యొక్క నైజదోష మేమనగా ఆత్మనుమరుగుబుచ్చి స్వస్వరూప స్థితి లేకుండ జేయుటయే; తానెవఁడో అని తెలియకుండ జేయుటయే నేను, నాది అను అహంకారమమకారములు బుద్ధికల్పితమే. ఇదియే మూలాధ్యాస- సర్వాజ్ఞానబీజము. ఇదియేప్రకృతి.

దీనినుండియే సమస్తప్రపంచము నుత్పత్తి యగుచున్నది. ప్రకృతిదృష్టాంతరరూపమున విజ్ఞానము బోధింపఁబడినది. సృష్టిసర్వస్వము బ్రహ్మమయము. బ్రహ్మవిద్యచే సాధింపఁదగిన సర్వాత్మస్వరూపజ్ఞానమే 'విజ్ఞానము'. చరాచర స్థూలసూక్ష్మాది సకలపదార్థములు పరబ్రహ్మచైతన్యమే, దీనిరహస్యము నెఱుంగుటయసాధ్యము. సమస్తేంద్రియాతీతము.

ఇందు సృష్టితత్త్వముఁగూర్చి కొంతవఱకువివరీకరింపబడినది. పరమాత్మస్వరూపమును దెలియవలెనన్నచో. దృశ్యమాన మగుచున్న సకలప్రపంచము భగవానుని పరాపర ప్రకృతి సంయోగవియోగములచే సృష్టిలయములు గలుగుచున్నవని గ్రహించునది. సర్వజగత్తు మాయచేఁగప్పఁబడినదగుటచే సాధారణముగా మానవులు భగవద్రూపమును గాంచలేకపోవుచున్నారు. కావున నిందుముఖ్యముగాగ్రహించవలసిన విషయమేదన? గుణవికార రహితమగు పరమాత్మనుమాయ ఆవరించుటచేత నీశ్వర జీవభావములు రెండును గలుగుచున్నవి. ఈద్వివిధభావసంయుతమే సంసారము. ఈ జీవేశ్వరయైక్యజ్ఞానమే ముక్తిమార్గము. కావున ముక్తినాకాంక్షించు 'జిజ్ఞాసువులు' సాధారణముగా నీయైక్యజ్ఞాన సంపాదనకే ప్రయత్నింతురు.

జడాజడ సమస్తపదార్థములందును బ్రహ్మమునిండియున్నది. బ్రహ్మముప్రకృతిదోషరహితమైనదగుటవలన మనుజుఁడు జీవించియున్నప్పుడే ప్రకృతిని జయించినవాఁడగుచో బ్రహ్మైక

జ్ఞానముకలిగి ముక్తాత్ముఁడగుచున్నాఁడు. పరమాత్మ పరిశుద్ధ స్వరూపమని చెప్పఁబడెనుగదా! జీవునకుగూడ అంతఃకరణ శుద్ధతకలిగినప్పుడేజీవేశ్వరుల యైక్యము సిద్ధించును. జీవుఁడు నిత్యశుద్ధజ్ఞాన స్వరూపుఁడనియే వేదాంతము పరిశీలించు చున్నది. ప్రకృతిదోషములన్నియు నంతఃకరణ ధర్మములే. అట్లుగాక జీవునకు ప్రకృతిగుణములు స్వాభావములని [illegible] నెవరైన వచించుచో, వడ్లయందు పుట్టుకతోఁ బొట్టు, మాసు కలిగియుండినను దంచుటవలన వదలిపోయిబియ్యమెట్లు శుద్ధ మైయొప్పునో; స్ఫుటముచేత రాగియొక్క చిలుము నశించి సువర్ణమగు చున్నదో అట్లే యోగముచేతను, విజ్ఞానము చేతను జీవునియొక్క అజ్ఞానరూపమగు మలినము నశించు చున్నది. "అనివాసిద్ధము" కావున మానవ ప్రయత్నము సర్వకార్యసాధనమని యిందు నిరూపింపఁబడినది.

సప్తమభాగము—విజ్ఞానయోగము

సమాప్తము.



ఓమ్.

శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః

# శ్రీమదాంధ్ర భగవద్గీత



## అష్టమభాగము

## అక్షరపరబ్రహ్మ యోగము

శ్రీరా మాంగీకృత శ్రీం
గౌర కలితవక్షు నవ వి । కసిత విలస
న్నీరేజేక్షణా రఘుకుల
వీరా భువిజా కళత్ర । విశ్వాకారా!॥

శ్రీకృష్ణునిగాంచి అర్జునుఁ డిట్లనుచున్నాఁడు:-

శ్రీకృష్ణా! బ్రహ్మమనుయేది? అధ్యాత్మమనగా నెట్టిది? కర్మమన నెటువంటిది? దేనిని అధిభూతమందురు? దేనినిఅధి దైవతమని వచింతురు? అధియజ్ఞమనగా నేమి? దేహాంత కాలంబున నిశ్చలచిత్తులు నిన్నెట్లు తెలుసుకొనగలుగు చున్నారు? తెలియఁజెప్పుమనిన యర్జునునకు శ్రీకృష్ణ పర మాత్ముఁడిట్లు ప్రతివచించెను:-

అర్జునా! అతిశయసూక్ష్మమై నాశనరహితమగు "పర

మాత్మ"యే బ్రహ్మము. సర్వశరీరములయందుండు 'జీవుడు' తన ఆత్మస్వరూపమే; జీవాత్మయే పరమాత్మ, అనగా జీవుండే పరబ్రహ్మమను స్వస్వసర్వాత్మ భావమే అధ్యాత్మమనబడు చున్నయది. అధ్యాత్మంబు కూడ బ్రహ్మరూపమునే నిరూపించుచున్నది. ప్రాణికోటియొక్క శరీరములను పుట్టించుటను పెంచుటను చేయంబడు త్యాగము కర్మయని చెప్పంబడును. నశించుపుట్టుకగల ప్రాణిసముదాయమెల్లను తుద నుండు. అధిభూతమనగా నిదియే. హిరణ్యగర్భుడు సూర్యమండలాంతర్వర్తియై దేవతలకధినేతయగుటవలన అధిదైవతమని చెప్పంబడును. ఇతనేనే పురుషుండందురు. పురుషుండనంగా క్షేత్రజ్ఞుండు. ఈదృశ్యమానమగు శరీరమందు అంతర్యామియై సకలభూతహృదయాంతరాళములందు ప్రకాశించుచున్న అధియజ్ఞుండనునేనే. యజ్ఞములయందభిరుచిగల విష్ణువు నేనే. మరణకాలమందైనను నన్నెవండు స్మరించుచు శరీరమును బాయుచున్నాండో వాండు తప్పక నాస్వరూపమును బొందుచున్నాండు. అనగా బ్రహ్మభావమును బొందుచున్నాండు. ఇందులకేమాత్రము సంశయములేదు.

ఏమానవుండవసాన కాలమున నేయే యభిరుచి గల వాండై ఏయేభావముల జింతించుచు నేయే దేవతల స్మరించుచు శరీరము వీడుచున్నాండో వాండాయభిమతభావములనే మరలబొందుచు నాయా దేవతా స్వరూపములనే గాంచుచున్నాండు. కావున నీవు సర్వదా నాయందు మనస్సు

లగ్నముజేసి, నానామంబునే జపించుచు సమరముచేయుము. నీవునాయందే మనోబుద్ధులు లగ్నముచేసిఅన్యతలంపులులేక యుందువేని సందేహములేకనీవునన్నేపొందగలవు. ఎవ్వఁడు సర్వజ్ఞుఁడై, పురాణపురుషుఁడై సర్వలోకైక రక్షకుఁడై, సూక్ష్మాతిసూక్ష్మరూపుఁడై, నిఖిలకర్మసంచయఫల విధాత యైసర్వప్రాణిసమూహములకు కర్తయై, జగచ్చిత్రకారుఁడై మనస్సుచే నూహించుటకును కన్నులతో జూచుటకును శక్యముకానివాఁడై, సూర్యునివంటి నిత్యచైతన్యప్రకాశమానుఁడై వెల్గొందుచున్న మోహాంధకారవిధ్వంసిద్దయైన పురుషుని అవసానకాలంబున నిశ్చలమనస్సుతో యోగబలము వలన కనుబొమల మధ్యమందు ప్రాణవాయువును లెస్సగా నిలిపి యంతఃకరణమందు భజించునో, (అంతర్యాగము) మానసపూజనెవఁడు చేయునో యతఁడు హిరణ్యగర్భుఁడను దివ్యపురుషుని బొందుచున్నాఁడు.

వేదవిజ్ఞులు దేనిని నాశరహితమని వచింతురో! సర్వమోహ వివర్జితులై జితేంద్రియులైన యోగులుయక్షరమైన యే సదనంబును బొందుచున్నవారో! దేనినభిలషించినవారై బ్రహ్మచర్యవ్రతంబు నాచరించుచుందురో యట్టియుత్తమ పథంబునుగూర్చి సంగ్రహముగా నీకువివరించెదనాలకింపుము.

అర్జునా! సమస్తేంద్రియములను స్వాధీనముచేసికొనినవాఁడై హృదయంబున మనస్సును ప్రతిష్ఠించి సహస్రారమందు ప్రాణమును జేర్చి పరబ్రహ్మవాచకంబగు "ఓమ్"

అనెడి ముఖ్యాక్షరముగా గల 'ఓంకారము' నుచ్చారణ
జేయుచు, ఓంకార వాచ్యుఁడనగు నన్నుఁదలంచుచు నెవ్వఁడు
దేహమును విడుచుచున్నాఁడో యామహాత్ముఁడు మహాఘన
మైన ముక్తిని బడయుచున్నాఁడు. ఎవ్వఁడు యితర చింతలు
లేనివాఁడై అనుదినము బ్రతికియున్నంతకాలము సదా యేకా
గ్రచిత్తముతో నన్ను స్మరించుచుండునో అట్టి మహాయోగి
సునాయాసముగ నన్ను జేరును. యోగనిష్ఠచే మహాత్ములై
మోక్షమును బొందినవారలు బ్రహ్మభావమును బొందిన
వారగుటచే నశాశ్వతమైనదియు, జననమరణాది బహుదుఃఖ
ముల కాస్పదమైనదియునగు పునర్జన్మంబుఁగాంచరు. బ్రహ్మ
లోకాది పుణ్యలోకములవఱకుఁగల లోకంబులఁబొందినవారు
మఱలజన్మంబులను బొందుచుందురు. కాని పుణ్యలోకముఁ
గాంచి నన్నుఁజేరినవారు పునర్జన్మంబు నొందరు. [బ్రహ్మ
భావమైన మోక్షమును బొందినవారు తిరుగఁజన్మించరు.]

నాలుగుయుగములు గడచిన కాలమును ఒక మహా
యుగమందురు ఇట్టి మహాయుగములొక వేయిగడచిన బ్రహ్మ
కొక పగలు. ఇంకొక వేయిమహాయుగములొక బ్రహ్మరాత్రి
ఈమహారాత్రుల పరిమితి దెలిసినవారే సర్వజ్ఞులు. బ్రహ్మ
పగటిమొదటి సమయంబున దెలియరాని ప్రకృతిలో నుండి
తెలియఁబడు స్థావరజంగమాత్మకంబయిన సమస్తభూత గణ
ములు పుట్టుచున్నవి. బ్రహ్మరాత్రి మొదటికాలమురాఁగానే
యా తెలియరాని ప్రకృతియందే సర్వభూత గణములు

మగుచున్నవి. ఆసమయమునకున్న భూతగణము రాత్ర్యాం
త్యమున నశించి పగలువచ్చినప్పుడెల్ల కర్మ స్వాధీనములై
వశములేక మరల మరలఁ బుట్టుచు మరల మరల నశించు
చున్నవి. ఈ చెప్పఁబడిన సర్వభూతములకును కారణభూతుడ
యిన బ్రహ్మదేవునికంటె విలక్షణమై, నాశనము లేనిదై,
మనోవాక్కాది సమస్తేంద్రియముల కగోచరమై, సనాతనమై
అఖండస్వరూపమై తేజరిల్లు పరబ్రహ్మము కలదు. సమస్త
లోకములు నశించినను పరబ్రహ్మము నశింపదు. ప్రళయ
కాలమందును అచలమై; అవ్యయమై, అద్వితీయమై
పరంజ్యోతి స్వరూపమై ప్రకాశించుచున్న నాచే [illegible]
జెప్పఁబడినదియే యుత్తమగతియని పెద్దలు చెప్పుచున్నారు.
అదియే పరమ పదంబను నాయొక్క దివ్యస్థానము. దీనిని
బొందినవారు తిరుగజన్మంబు నెత్తరు. అనగా పునర్జన్మ
లేనివారగుచున్నారు. ఇది 'ఓమిత్యేకాక్షరంబ్రహ్మ' వలననే
సాధ్యమగునుగాని వేరొక సాధనముచే సాధ్యము కాఁజాలదు-
ఏమహాపురుషునియందు సమస్తభూతజాలము నంతర్భూతమై
యొప్పుచున్నదో ఎవ్వఁడు ప్రకృతికంటెపరుఁడో! ఎవ్వనిచేనఖిల
ప్రపంచమువ్యాపితమై ప్రభలు దీపించుచున్నదో యాతనిని
అన్యాసక్తిలేని నిశ్చలమైన భక్తిజ్ఞానముచే పొందవచ్చును.
ఇంతకంటెవేరొక సాధనములేదు.

అర్జునా! ఏకాలమందు చనిపోయినయోగులు పున
ర్జన్మలేనివారగుదురో! ఏకాలమందు మృతిఁబొందినయోగులు

మఱలజన్మించుటతో యాకాలమును వివరించి చెప్పెను. అగ్ని, తేజస్సు, పగలు, శుక్లపక్షము, షణ్మాసాత్మకమగు ఉత్తరాయణముగల కాలమున మృతినొందిన బ్రహ్మోపాసకులు 'ఆర్చిరాదిగతి'నంది జ్వాలనప్రకాశాదిజ్యోతిర్మయ మార్గముల ననుసరించి పోయి బ్రహ్మలోకము జేరుదురు. అచ్చట బ్రహ్మ ప్రళయము వఱకు నున్నవారై ప్రళయమందు బ్రహ్మైక్యము బొందుచున్నారు. తిరిగి మఱలజన్మింపరు. ధూమము (పొగ) రాత్రి కృష్ణపక్షము దక్షిణాయనము యాఱుమాసములుగల కాలమందు మృతినొందినయోగులు ధూమాదిగతినొంది చీకటి మార్గముల ననుసరించిపోయి చంద్రలోకముజేరి కర్మఫలమంతరించువఱకు చంద్రునితోఁగలిసియుండి తత్ఫలమంతరించగనే మనుష్యలోకంబున మఱల జన్మంబు గాంచెదరు.

వి॥ చంద్రలోకము జేరినదాది వరుసగా గగన, వాయు జలరూపమ్మై, జలధరమ్మై వర్షరూపమును వడసి దేహానాకా ర్థవహా ధాన్యాది కాయధాన్యములై ఉద్భిజము లగుచుఁ గట్టికడకు స్థావరజంగమాదులగు తరుపాషాణ నగ ఖగమృగ పశుపక్ష్యాది క్రిమికీటకములై పుట్టిగిట్టి యనంతనంబులగు జన్మంబుగాంచుచున్నారు.

ఈచెప్పఁబడిన శుక్లకృష్ణగతులు రెండును జ్ఞాన-కర్మ యోగులకేర్పాటయిన మార్గములు. జ్ఞానముతోఁ గూడిన శుక్లమార్గము పునర్జన్మలేనిది. అనగా జన్మరాహిత్యము గలది. కర్మముతోఁగూడిన కృష్ణమార్గము భావిజన్మకారణ

సమస్తపాపములు నశించినవాఁడై, పాప బంధములనుండి విముక్తిఁబొందినవాఁడై మహాత్ముఁడై జనించును. కనుక భగవన్నామము స్మరించినంతమాత్రముననే మహాత్ముఁడై జనించునని ధృవంబగుచున్నదికదా! అట్టిచో సర్వకాల సర్వావస్థల యందు సర్వాత్మభావముతోఁదిలకించు ఆత్మజ్ఞానులెంత పవిత్రులో యోజింపుఁడు. తప్పక పవిత్రులేయగుదురనుటసత్యము కాని, యీస్థితిఁబొందుటకుఁగొంత సాధకముముఖ్యావసరము ఏకార్యమునైనను జేయుటకు, చేసినకృతార్థులగుటకుఁగొంత కాలవిలంబనమగుట నిక్కము. కావున, కొంత కాలమైనను 'ఓమ్' శబ్దబ్రహ్మోచ్చారణ చేసిననేగాని యంత్యకాలంబున తదా బ్రహ్మసంస్మరణము కలుగుటయరుదు. ఇది యాత్మయోగియే పొందగలుగును. కనుకఆత్మయోగియగుటకు నొల్త కావలసినది బ్రహ్మవిద్య. ఈవిద్యనభ్యసింపవలెనన్న మొదట అజ్ఞానము నశింపవలెను. ఇదియోగసాధనమువల్లనే సాధింపనగును. కాని మఱియేయితర సాధనమువల్లను సాధింప నశక్యము. కనుకనే భగవానుఁడెట్లుపదేశించెనో గ్రహింపుఁడు.

'సర్వభూతస్థితమ్ యోమామ్ భజత్యేకత్వమాస్థితః ।
సర్వథావర్తమానోఽపిసయోగీమయివర్తతే।' అనగా:

సర్వభూతాంతరాత్ముఁడనగు నన్ను ఎవఁడు అభేద బుద్ధిగలవాఁడై ఒకేఆత్మగాదెలిసినవాఁడై భజించుచున్నాఁడో అట్టిఆత్మయోగినానావిధములఁబ్రవర్తించువాఁడైనను వాఁడు నాయందుంటున్నవాఁడగుచున్నాఁడు. "సర్వథావర్తమానో

ఉపి" యనుటవల్ల—బ్రహ్మచర్య, గార్హస్థ్య, వనస్థ—ఇత్యాది ఏయాశ్రమవాసులైనను, లేక కర్మ, భక్తియోగ జ్ఞానములలో దేనియందుండువాడైనను, మౌనముగా నుండినను-మాట్లాడినను, ఏకాంతముగానుండినను, జానపదములలోనుండినను అవరోధములేదనియు గ్రహించవలయును. ఇదియే దీని ముఖ్యార్థమేగాని, విధినిషేధములులేక ప్రవర్తించినను విరోధములేదనిమాత్రముకాదనివిజ్ఞులెల్లరు గ్రహింతురుగాక.

"బ్రహ్మచర్య"మనగా సంసారము త్యజించి కేవల 'సన్యాసము' స్వీకరించుటకాదు. యుక్తవయస్సుగల స్త్రీపురుషులు వివాహమాడి సంసారమునందుండుట యనుచితముగాదు. వివాహము సంతానమును గాంచుటకే యగునుగాని కామము దీర్చుకొనుటకై కాదు. గృహస్థుడు తనభార్యతో ఋతుకాలములందు భోగించుట బ్రహ్మచర్యమే యగునని యార్యవచనము. కాని, యింద్రియ నియమము పాటించుట ధర్మము. మానవుడు సంతానముకలిగి వారలకు సద్విద్యలు నేర్పి వివాహముజేసి యుద్యోగముచేతగాని, వ్యవసాయాది కర్షకవృత్తి వ్యాపారములచేగాని. యేదోయొకవిధముగ స్వాయముగ జీవితము గడుపుకొను స్థితి బిడ్డలకుగలుగునంత వఱకే మమత్వము గలిగియుండవలెను. అట్లుండినచో ఈజీవికెంతేని శాంతిసౌఖ్యములు చేకూరును.

తమబిడ్డలు స్వయముగ జీవితముగడుపు స్థితి కలుగునప్పుడు గృహస్థాశ్రమములో నుండినను పరమార్థచింత కల

దేని జన్మసాఫల్యమును బొందవచ్చును. కర్మబంధవిముక్తుం డగు ఆత్మయోగి సునాయాసముగ బ్రహ్మభావమైన మోక్షమునుబొందుచున్నాఁడు. జీవితకాలమునసదా బ్రహ్మవిద్యోపాసనమాచరించినవానికి దేహపాతకాలమందు బ్రహ్మసంస్మరణ వలుగుననుట నిజము. మహాత్ములు వచించిన యీక్రింది శ్లోకార్థమును దిలకించి ఆత్మజ్ఞానమెంత శ్రేష్ఠమైనదో తెలుసుకొనుడు.

"సంసారార్ణవ మగ్నానామ్ జన్తూనామ వివేకినామ్।
అగతీనామ్ గతిస్సాత్మజ్ఞానమేవహి కేవలమ్।" అనగా:-

జననమరణరూపమగు భవార్ణవమున మునిఁగిన వారికిన్ని- అవివేకులగు మానవులకున్నూ-ఏసహాయము లేనివారికిన్ని కేవలమాత్మజ్ఞాన మొక్కటియే గతియగును. అనగా నిదియొకటియే సంసారసాగరమునుండి తరింపఁజేయును. కావున నాత్మజ్ఞానము కలవారు తప్పకముక్తిని బడయుదురనుట నిశ్చయము.

అష్టమభాగము-అక్షరపరబ్రహ్మయోగము
సర్వము సంపూర్ణము.



ఓమ్.

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# శ్రీమదాంధ్ర భగవద్గీత



## నవమోభాగము.

## రాజవిద్యారాజగుహ్య యోగము

శ్రీ ధర్మాంబరధారా
శోభిత శృంగారగాత్ర । శుభగుణసాంద్రా!
ప్రాభవకీర్తి విభాకర
భూభరభవహరరామ । భువనోద్ధారా!॥

అర్జునా! సుఖదుఃఖములకాకరమైనట్టియు, ద్రెంచలేని యాశానురాగపాశములచే గట్టబడునట్టియు సంసారమునుండి తరించి నీవెట్లుమోక్షమును బొందగలవో యా జ్ఞానమును విజ్ఞానసంయుతంబుగ నీకుం జెప్పుచున్నాను. అసూయలేని అంతఃకరణముగలవాడవై యాలకించుము. నేనుచెప్పబోవు నిది యధ్యాత్మవిద్య. ఇది విద్యలన్నింటిలో మిగుల శ్రేష్ఠమైనది. పరమపవిత్రమైనది. అతి రహస్యమైనది. ప్రత్యక్షముగ సుబోధకమైనది. ధర్మసంయుత మైనది. అవినాశన

మైనది. అభ్యసించుటకు సుఖకరమైనదియునై యున్నది. ఇందు వచింపఁబడిన ఆత్మజ్ఞానముతోఁ గూడిన ధర్మమందు నమ్మకములేక దేహాత్మభావముతో జరించునాస్తిక వాదులు నన్నుఁ బొందనేరక సంసార నాటకరంగమున జననమరణ రూపకపాత్రధారులై నటియించుచున్నారు. ఈ దృశ్యమాన ప్రపంచమంతయు వాఙ్మానసేంద్రియములాది సమస్తేంద్రియములకు గోచరించని నాస్వరూపముచే నిండి వగలుచున్నది. బ్రహ్మాది పరమాణువునరకుఁగల స్థావరజంగమాది సర్వభూతములు- నదీవదనగతరుపాషాణాదిసమస్తవస్తు సంచయములు వాటికినేనాత్మనగుటవలన నాలోనున్నవి. వాటికినేను యధిష్ఠానమగుటంబట్టి యజ్ఞానులునేను వాటియందున్న వానిగా భావింతురు. కాని, వాటియందు నేను యథార్థముగ లేను. "ఘటోదకన్యాయముగ" అనగా నీటికికడవ యాధారముగాని కడవకునీరు యాధారముగాదు. నీరు, ఆధారమగును కడవ నంటకఁ దోఁచుచున్నది, అప్పుడాకడవ జలపూర్ణముగా నొప్పుచున్నది. అటులనే బ్రహ్మాది సమస్త భూతచయములు నాయందున్నవి. అయినప్పటికిని యవినన్నంటి లేవు. ఈశ్వర సంబంధమైన నాప్రభావమును దిలకింపుము. నేనుభూతముల సృష్టి యభివృద్ధులకు హేతువైనప్పటికిని నేనా భూతములకు సంబంధించియున్నవాడనుగాను. అఖిలభూతసృష్టిస్థితిలయము లకుకారణమై, భూతములచే స్మరింపఁబడు పరమాత్మనేభూతముల కాధారముకాదు; ఆధేయమునుగాదు- "జలజపత్ర

జలకణ”విధమున- అనగా నీటియందున్న తామరాకును నీటి
బిందువు అంటకుండునట్లు సంశ్లేషరహితమై యున్నది. ఈ
దృష్టాంతరముచే నాత్మస్థిరమనియు నాత్మయోగము గొప్ప
దనియు స్పష్టమగుచున్నది. విశ్వమంతటను వ్యాపించియున్న
వాయువు యాకాశము నంటకుండగ యున్నదో ఆ విధముగా
నాతో నేమాత్రము సంశ్లేషము లేక సర్వభూతములు నాలో
నున్నవి. గాలి యాకాశమందుండి యాకాశము మీదనే
యెట్లాధారపడియున్నదో యటువలెనే సమస్తేంద్రియములు
ఆత్మనాశ్రయించియుండి యాత్మ మీదనే యాధారపడి
యున్నవి.

అర్జునా! ప్రళయకాలమందు సమస్త ప్రాణి సమూ
హములు నా త్రిగుణాత్మకమైన మాయలో లయమగుచున్నవి
-సృష్టికాలమందు మరల నే నా భూతములను సృజించు
చున్నాను- నామాయాశక్తియగు ప్రకృతిప్రభావమున నే
ప్రాణిసమూహములను పెక్కుసార్లు మాటిమాటికిఁబుట్టించు
చున్నాను. సర్వజీవులు ప్రకృతికిఁజిక్కి అస్వాతంత్ర్యములు
గానున్నయవి. ఈసృష్టిస్థితి లయకర్మలయందు నాకపేక్ష
యును ఉపేక్షయును లేదు- కావునకర్మలు నన్నెమాత్రమును
బంధింపనేరవు. ఇందువలన ఫలాసక్తి లేని కర్మములు బంధ
రహితములని తెల్లమయ్యెనుగదా! ఈచరాచర సర్వప్రపంచ
మును నా ప్రకృతిమూలముననే బుట్టుచున్నది, సాగుచున్నది. నేను
నిమిత్తమాత్రమే ; సకలభూతశాసనాదక్షుండనగు నాఘన
మైన 'పరమాత్మ' తత్వమును మూఢులు తెలియనేరక నన్ను

సామాన్యమానవునిగా భావించి జరాసంధ శిశుపాలాదుల
వలె నన్ను నిర్లక్షించుచున్నారు. దేహాత్మ భావనలుగల
యజ్ఞానులు దురాశా పిశాచ గ్రస్తులగుటచే కోరికల నాశించి
దుష్టస్వభావులై పరహింసాచరులై క్రూరకర్మల నాచరించి
దుర్మదావేశులై, మాయామోహితులై, అక్రమప్రవర్తను
లై, కాంతాకనకాపహారులై, బుద్ధిహీనులై యనేకపాపకార్య
ములొనర్చినవారై, అధమాధములై నన్ను లక్ష్యము సేయ
కున్నారు. మహాత్ములు దేవతాత్మకంబగు స్వరూపంబు
నాశ్రయించిన వారై, సత్వగుణ ప్రధానులై, అచలచిత్తులై
భూతములకుఁగారణమై యవ్యయుఁడైన నా యథార్థ తత్వంబు
నెరింగినవారలై నన్నే సేవించుచున్నారు. నాయందుభక్తిగ
లమానవులు సదానిష్ఠాగరిష్ఠులై నా నామములు జపించుచు
యింద్రియనిగ్రహులై, పరిశుద్ధాంతఃకరణములుగలవారై నన్నే
స్మరించుచు, పూజించుచు, వందనములర్పించుచుఁగొందఱు
నన్ను ఉపాసనచేయుచున్నారు. ఇంకాకొందఱు భగవద్విష
యక జ్ఞానంబునే యజ్ఞంబుగా భావించి నన్ను సేవించు
చున్నారు. మఱియుకొందరువిశ్వముఖునిగానెంచి పూజించుచు
న్నారు - యింకను కొందఱు మహేంద్రాది దేవతలలో
వ్యష్టిభావమునెంచక నారాధించుచున్నారు. కొంతమంది
భర్గుఁడని, భానుఁడని, యింద్రుఁడని, చంద్రుఁడని, వరు
ణుఁడని, వాయువని, అగ్నియని వ్యష్టిభావమున వేర్వేరు
నామరూపభేదములతో నన్నారాధించుచున్నారు. నేనుజ్యోతి
ష్టోమంబు మొదలగు క్రతుస్వరూపుఁడను, యజ్ఞరూపుఁడను,

పైతృకయజ్ఞము, ఓషధులు, మంత్రబీజములు, ఆజ్యాదికము అగ్నిహోత్రము, హోమద్రవ్యము, హోమకర్మము మొదలగు శ్రౌత స్మార్త సమస్త కర్మలు నేనే— ఈయావత్ప్రపంచమునకు తండ్రిని, తల్లిని, తాతను, కర్మఫలప్రదాతను, బ్రహ్మ, ప్రజాపతి, కర్త, కర్మ, క్రియలు, ఓంకారము, ఋగ్సామ యజుర్వేదములు నేనే; జ్ఞానము; జ్ఞేయము నేనే— జగత్పోషకుఁడను, నిర్ణేతను, సాక్షిత్వము, అధివాసము, శరణ్యము, సౌహార్ద్దము, దాక్షిణ్యము, ప్రపంచసృష్టి స్థితి సంహారకారణము, నిశ్చలము, నిక్షేపము, ప్రతిఫలాపేక్ష లేని పరోపకార పారీణము ♦ సనాతనమగు అవ్యయ బీజము, సోమపానము, సమస్తము నేనే;

మిత్రరూపమున ప్రపంచమును ప్రకాశింపఁజేయుచున్నాను. మార్తాండరూపమున విశ్వమును దహింపఁజేయుచున్నాను— వృష్టి అనావృష్టులకు నేనే కారణము— అమృతాంశురూపమున జగంబును శీతల ప్రకాశముచే సర్వౌషధీ వృక్ష సస్యకోమలముఁగావించుచున్నాను అమృతస్వరూపుఁడను, మృత్యుస్వరూపుఁడను సత్పదార్థము (స్థూలము) అసత్పదార్థము (సూక్ష్మము) కృత్యాకృత్యకారణములు నేనే యని తలంచి పృథక్భావాది జ్ఞానవచో యుక్తముగా నన్నెవరు భజించుచున్నారో వారు, వారివారి చిత్తసంస్కారము ననుసరించి నన్నుఁబొందుచున్నారు. బ్రహ్మావిధులు ఏమూఁడు వేదములరీత్యా క్రతువులొనర్చి నన్నుపూజించి సోమపానము

♦ పరమాత్మ

చేసి స్వర్గలోకప్రాప్తి నభిలషించుచున్నారో వారు మిగుల సంత
మున పుణ్యాకరంబగు యింద్రలోకమును బొంది యపూర్వ
దివ్యభోగములననుభవించి పుణ్యకర్మఫలంబంతయు నశింపు
టతోఁడనె తిరుగ మర్త్యలోకంబున జనించుచున్నారు. ఈ
విధముగా వేదోక్తధర్మానుసరణిని కర్మలొనర్చెడి కర్మఫలా
సక్తులు లబ్ధకాములై స్వర్గభూలోకములను వచ్చుచుబోవుచు
నుందురు.

ఓయర్జునా! ఎవ్వరు నాయందమితభక్తివిశ్వాసములు
గలిగి, నన్నే తమయాత్మస్వరూపముగా నెంచి, ఇతర చింతలు
లేనివారై, సతతమాత్మానుసంధానసక్తులైన నన్నే శరణుపొంది
చిత్తము నాయందాయత్తపఱచి ధ్యానించెదరో! అట్టి అచం
చల నిష్ఠగల నాభక్తులయోగక్షేమములను నేనిర్వహించెదను.
అనన్యభక్తితత్పరులై అన్యదేవతారాధనలుచేయువారుగూడ
నజ్ఞానభావమున నన్నే పూజించినవారగుచున్నారు. సమస్త
యజ్ఞకర్మఫలముల ననుభవించువాఁడను ప్రభువును నేనగు నా
నన్ను తెలియలేనివారు సంసారబంధమునుండి విముక్తిఁగాంచ
నేరకున్నారు. ఏ మానవులు వారివారి యిష్టదైవముల
నింద్రుఁడు మొదలగు దేవతల నుపాసించుచున్నారో వార
లాయా దేవతలను బొందుచున్నారు. సదా నన్ను ధ్యానించు
భక్తులు నన్నే పొందుచున్నారు. ఎవ్వఁడు విశుద్ధ భక్తితో
పత్రము, పుష్పము, ఫలము, తోయము వీనిలో నేయొక్కటిని
గాని నాకుసమర్పించినను వాటిని ప్రియపూర్వకముగా స్వీక
రించుచున్నాను. నీవు యేకర్మలాచరించుచున్నావో! ఏపదా

ర్థము భుజించుచున్నావో! దేనినిహోమంబుచేయుచున్నావో
ఏవస్తువును దానమొసంగుచున్నావో! ఏతపమొనర్చుచున్నా
వోవాటియొక్క సమస్త కర్మఫలమును నాకు సమర్పణ
చేయుము. అట్లునాకర్పణసేయుటవలన నాయీకర్మ సంభవ
ములైన పుణ్యపాప ఫలబంధములనుండి విముక్తిఁగాంచెదవు.
కర్మఫలత్యాగమువలన నాత్మజ్ఞానముకలుగును. ఆత్మజ్ఞానము
వలన మరణాంతరము నన్నుబొందగలవు. నేను సర్వజీవుల
యందు సమత్వబుద్ధికలవాఁడను. నాకు హితుఁడు విరోధియను
విభేదములేదు. ఎవరునన్ననన్యభక్తితో సేవించెదరో యా
భక్తులు నాయందుందురు. నేను వారి యందుందును. ఎట్టి
దురాచారుఁడైనను యసమానభక్తితో నన్ను పూజించిన
వాఁడగుచో సదాచారుఁడై సర్వసమత్వభావముగల సాధు
వగును. చిత్తశుద్ధిగలిగినవాఁడు సదా ధర్మదీక్ష కలవాఁడై
శాంతిని బొందుచున్నాఁడు. నాభక్తుఁడెన్నఁడును నశింపఁ
డని నీవు ప్రతినబూనుము. నీచజన్మలయిన స్త్రీలు,వైశ్యులు
శూద్రులు నన్ను మహాభక్తితో సేవించినచో ఘనమైన
సద్గతి నొందుచున్నారు. పవిత్రజన్మనయి యోగనిష్ఠులైన
బ్రాహ్మణులు, రాజఋషులును ముక్తిని బడయుదురని వేరే
చెప్పవలయునా? అశాశ్వతము, సుఖవిహీనమునయిన యిహ
లోకమున దుర్లభమగు మానవజన్మయందు 'పురుషార్థసాధ
నమగు, పురుషుఁడనై పుట్టినందుకు తప్పకనన్ను సేవింపుము.
ముక్తినిగాంచెదవు. ఎప్పుడునీవు నాయందే మనస్సు నిల్పి,
నాకేభక్తుఁడవై, నన్నేపూజించుచు, నాకేనమస్కరింపుచు,

నాయందే యాత్మను లగ్నముచేసి తన్మయత్వము బొందగ నుకో అప్పుడే నీవు నన్నుఁబొందగలుగుదువు. ఇది నిశ్చయము.

వి॥ ఈ యోగమందు చెప్పబడిన దేవుని మాహాత్మ్యతత్త్వమునుగూర్చి కొంతవఱకు విశదీకరింపఁబడినది. పరమాత్మ ప్రపంచమును సంబంధించి యుండెనా? ప్రపంచమే పరమాత్మను సంబంధించియుండెనా యనువిషయ మాలోచింప "రజ్జుసర్పభ్రాంతి చందమని" విజ్ఞులయభిప్రాయము. అనగా త్రాడును పాముగాభావించునట్టుల పరమాత్మయే ప్రపంచముగా నూహింపఁబడుచున్నది. యదార్థముగా నది త్రాడే. పాముచిత్తభ్రమ. ఆవిధముగనే సృష్టికి పూర్వమందున్నది పరమాత్మ గోచరమగు ప్రపంచముభ్రమ. పరమాత్మయనా తనబీజము. ఇదినాశనము లేనిది. మహోత్కృష్టమైనది. ప్రపంచము ప్రళయకాలంబున ప్రకృతియందు లయమగు చున్నది. మఱల ప్రకృతినుండియే పుట్టుచున్నది. మాయయే ప్రపంచోత్పత్తికి మూలహేతువు. పరమాత్మ నిర్వికారనిరంజనుఁడు. తానుపరమాత్మనని యెఱుఁగనివాఁడు- సర్వాంతర్యామి. ఆదిమధ్యాంతములు లేనివాఁడు. ఆయనయభిలషించునది భక్తియొక్కటే. అసమానభక్తితో పూజించు మనుజుడెంతపాతకుఁడైనను సకలపాపవిముక్తుఁడై మోక్షమునుబొందుటకుఁదగినవాఁడగుచున్నాఁడు. భక్తుఁడెన్నఁడును అధమగతిపాలుగాఁడు, ఇదిసత్యము.

నవమోభాగము—రాజవిద్యారాజగుహ్యయోగము

సమాప్తము

ఓమ్.

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# శ్రీమదాంధ్ర భగవద్గీత



## దశమోభాగము.

## వి భూ తి యో గ ము.

శ్రీ సీతాహృచ్చోరా!
దాసావన దీక్షసార। ధర్మవిచారా!
దోసాపనయ సుధీరా!
భాసుర శుభగాత్రరామ। భద్రనగేంద్రా! ॥

శ్రీకృష్ణ భగవానుఁడు యర్జునునితో మఱియు నిట్లు చెప్పఁబూనెను—

అర్జునా! ఇంతదనుక నేవచించినది సర్వంబునుమిగుల నాసక్తితో నాలకించి యున్నాఁడవు—ఇంతకంటె శ్రేష్ఠమైన దియు మహదానంద కరమైనదియు నగు మఱియొక గొప్ప విషయమును నీమేలుగోరి చెప్పుచున్నాను శ్రద్ధతోవినుము—

సురేంద్రాది సమస్త దేవతలు. భృగ్వాంగీర సాది మహాఋషులు గౌతమగార్గేయ వశిష్ఠ వాల్మీక నారదాది మహామునులు, నామహిమ నెఱుఁగజాలరు— బ్రహ్మేంద్రాది దేవతలకును, మహర్షులకును నేనే మూలకారణము— జనన మరణములులేనివాఁడననియు (ఆద్యంత శూన్యుఁడననియు) సర్వతోముఖుఁడననియు, జగన్నియామకుఁడననియు నెవ్వరు

నన్ను దెలుసుకొను చున్నారో వారుయజ్ఞాన జనకమైన మోహంబును విడిచినవారై సమస్తపాపములనుండి విముక్తి నొందుచున్నారు.

బుద్ధి, జ్ఞానము, నిర్మోహము, ఓర్పు, సత్యము. శమము, దమము, సౌఖ్యము, సంతాపము, పుట్టుక, నాశనము, భయాభయములు, ధర్మాధర్మములు, సత్యాసత్యములు, కలిమిలేములు, భూతదయ, ప్రాణహింస, సమ్యాసమత్వము, సంతోషము, తపస్సు, దానము, నిదానము, పుణ్యము, పాపము, కీర్తి, అపకీర్తి మున్నగునవన్నియు నావల్లనే సంభవమగు చున్నవి. స్థావర జంగమాత్మకంబయిన నీసర్వప్రపంచము నకును మూలకారణులైన సమస్త మహాఋషులు, స్వాయంభవు మొదలగు చతుర్దశమనువులు, సనత్సనకుడు మొదలగు ఋషిపుంగవులు మరియు భావసంజనితులైన నామానసపుత్రులు— వారివలన నీచరాచర రూపమగు సర్వప్రపంచము ననురూపముతో నడిపించుచున్నాను— ఈజగత్సృష్టి స్థితి లయములకు కారణభూతమయినవాడను నేనే—ఈనామహిమను. విభూతి (ఐశ్వర్యము) నెవ్వడు నిజముగా గ్రహించుచున్నాడో వానికి నచలరూపగు సమ్యగ్దర్శనము లభించును— ఈవిధంబు నెఱింగియే పండితులు పరమార్థచింతనులై నన్నే సేవించు చున్నారు. చిత్తము నాయందే లగ్నముచేసి యింద్రియముల నిగ్రహించి పరస్పరము సంభోధించు కొనుచుసదానాకథామృతంబును కర్ణపుటంబుల

నాస్వాదించుచు నమందానందముతో కాలము గడుపుచు నియమప్రకారము యోగమభ్యసింపుచు భక్తివిశ్వాసములతో నన్నెవ్వారు భజియించు చున్నారో వారల ననుగ్రహించుటకొఱకు మాత్రమే వారియంతఃకరణ మందున్నవాఁడనై నన్నుఁబొందుటకుఁదగిన బుద్ధియోగమును బ్రసాదించి వారియొక్క అజ్ఞాన సంభవమైన మోహాంధ కారమును వెలుగుచున్న జ్ఞానమనెడి దీపముచేతఁబోగొట్టి వారలనుద్ధరించుచున్నానను ఇదివిని యర్జునుఁడు శ్రీకృష్ణునిట్లు ప్రార్థించెను.

శ్రీకృష్ణా! నీవు పరబ్రహ్మస్వరూపుఁడవు. గొప్ప తేజస్వరూపుఁడవు— పరమపవిత్రుఁడవు— పురాణపురుషుఁడవు— అనంతుఁడవు— స్వప్రకాశుఁడవు— ఆదినారాయణుఁడవు— పుట్టుకలేనివాఁడవు— చిన్మయుఁడవు—విశ్వనాథుఁడవు— పరంధాముఁడవు— కరుణాకరుఁడవు—దీనపోషకుఁడవు— భక్తపరాధీనుఁడవు. భువనైకసమ్రాట్టుఁడవు అని సర్వమునీంద్రులు, దేవఋషియగు నారదుఁడు, అసితుఁడు. దేవలుఁడు, వ్యాస మహర్షి చెప్పుచుందురు— నీవుగూడ నదేవిధముగా నిప్పుడు చెప్పియున్నావు— హా! నారాయణా! వాసుదేవా! శ్రీకృష్ణ పరమాత్మా! నీవువచించినదంతయు యదార్థంబని నాకెంతయునమ్మకముకలిగినది. బ్రహ్మేంద్రాదిసురాసురులునైతము నీప్రభావము నెఱుంగజాలరు. అట్టిచో జ్ఞానకర్మేంద్రియములాత్మబ్రహ్మమునెట్లు తెలియఁగలుగును? హే! దేవదేవా! జగన్నాథా! పురుషోత్తమా! భూతభావన! భూతేశా! జగద్రక్షకా! నీవు సహజవిద్యావిశారదుఁడవు. అన్యులకెఱుక

పడని నీప్రభావము నీయంతనీవే తెలియఁగలవాఁడవు నగు భవదీయమహాత్మ్యవిస్తారములెల్ల లోకములందు వ్యాపించి యుండెను. వానినన్నిఁటిని సుబోధకముగ వచింపనీవే సమర్థుఁడవు. ఓవాసుదేవా! నిన్ను నేవిధముగా నేయేస్వరూపములుగాభావించి ధ్యానముచేసిన నిన్ను నేనుదెలియఁగలుగుదునో ఏయే వస్తువులు నాచే నిన్నారాధింప నర్హములైనవో చెప్పుము: హే! కృష్ణా! భక్తవత్సలా! నీయొక్క యైశ్వర్య యోగములను సవిస్తరముగా మరల నాకెఱింగింప వలయును! నీమృదుమధురభాషాసుధారసంబును గ్రోలుచున్న కొలఁది నాకు తృష్ణతీఱకున్నయది. ఇట్లనిన యర్జునునివాక్యములకు శ్రీకృష్ణుఁడిట్లుమాటాడఁబల్కెను,

అర్జునా! తేజోవంతములగు నాయైశ్వర్యము లనంతములు అద్భుతములు, ఆనందదాయకములు, నిగూఢములు వానిలో ప్రధానమైనవాటిని గొన్నిఁటినినీకుఁజెప్పెద నాలకింపుము. సమస్త భూత హృదయాంతరాళము లందుఁగల (ప్రత్యగాత్మ) 'పరమాత్మ' స్వరూపుఁడను నేను,జీవులహృదయములందును స్మరింపఁదగినవాఁడను నేను,భూతములసృష్టిస్థితిలయములకు కారణము నేను, ద్వాదశాదిత్యులలో విష్ణువు, జ్యోతులలో సూర్యుఁడు, మరుద్గణములో మరీచి, తారాగణములో చంద్రుఁడు, వేదములలో సామవేదము, దేవతలలో నింద్రుఁడు, సమస్తేంద్రియములలో మనస్సు, భూతములలో సాక్షీభూతంబగు చైతన్యము, ఏకాదశరుద్రులలో శంకరుఁడు, యక్షులలో కుబేరుఁడు, అష్టవసువులలో నగ్ని, పర్వతములలో మేరుపర్వతము, రాజపురోహితులలో బృహ

స్పతి, సేనాధిపతులలో కుమారస్వామి, సరస్సులలో సము
ద్రము, మహాఋషులలో భృగుమహర్షి, అక్షరములలో ఓం
కారము, యజ్ఞములలో జపయజ్ఞము. రాజపర్వతములలో
హిమవత్పర్వతము, వృక్షములలో అశ్వత్థమును, దేవఋషు
లలో నారదుఁడును, గంధర్వులలో చిత్రరథుఁడును, సిద్ధు
లలో కపిలమహాముని, గుఱ్ఱములలో నుచ్చైశ్శ్రవము, గజము
లలో నైరావతము, మానవులలో చక్రవర్తి, జీవులనువృద్ధి
జేయు మన్మథుఁడును.

ఆయుధములలో వజ్రాయుధము, ధేనువు (ఆవు)లలో
కామధేనువు, సర్పములలో వాసుకి, పన్నగులలో నసం
తుఁడు, జలదేవతలలో వరుణుఁడు– పితృదేవతలలో నార్య
ముని, పితృదేవతల పుణ్యాపాపవిచక్షణాదక్షుఁడగు యముఁడు,
దానవులలో ప్రహ్లాదుఁడు, గణకులలో కాలుఁడు, మృగము
లలో హర్యక్షము, (సింహము) పక్షులలో గరుత్మంతుఁడు,
పావనముచేయువారిలో వాయువు, ధనుర్ధరులలో శ్రీరాముఁడు,
జలజంతువులలో మొసలి, పుణ్యవాహినులలో గంగ, సృష్టు
లలో నాదిమధ్యాంతములు, విద్యలలో నధ్యాత్మ విద్య,
వాదములలో తర్కవాదము, అచ్చుయక్షరములలో 'అ'కా
రము, సమాసములలో ద్వంద్వ సమాసము, నాశనములేని
కాలము, కర్మఫలవిధాతయును బ్రహ్మ, నాశనము చేయు
మృత్యువు, భావిజన్మల కుత్పత్తిస్థానము– స్త్రీలలో కీర్తి, సతి
లక్ష్మి–వాక్కు–బుద్ధి–ధైర్యము–క్షమ– సామములలో బృహ
త్సామము– చందస్సులలో గాయత్రి– మాసములలో మా
ర్గశీర్షము– ఋతువులలో వసంతఋతువును నేనే–

జూదరులయొక్క-జూదము- తేజోవంతుల తేజఃపుంజము- సత్వగుణప్రధానుల సత్వము. కృషీవలుల వ్యవసాయము- యాదవులలో శ్రీకృష్ణుఁడను నేను. పాండవులలో అర్జునుఁడ నీ నీవు- మునీంద్రులలో వ్యాసుడు-కవులలో భార్గవి- దండ నాధికారులలో దండనీతి [శిక్షాస్మృతి - న్యాయశాస్త్రము] జయాసక్తుల జయోపాయము-రహస్యమగువానిలో మౌనము. జ్ఞానవంతులజ్ఞానరూపము-రాజ్యపాలుర పాలనరూపము మొద లగు స్థావరజంగమాత్మకంబయిన దేవతిర్యగ్మనుష్యాది సకల భూతవస్తుసముదాయములు నే నేసుమా! సర్వమునాచైతన్యమే. విశ్వసృష్టికి మూలకారణమే నేనని గ్రహింపుము. నేను సమస్తనియస్తనై సర్వమును గనుగొనుచున్నాను. చరాచర సమస్తభూతవస్తుసముదాయములో నాచేఁగాని దేదిన్ని లేదు: అర్జునా! మదీయ దివ్యాయిశ్వర్యమహాత్మ్యంబులకు మేర లేదు. నావిభూతులనంతములు. వాటిని నీకిపుడు సంగ్రహముగా గొన్నిఁటినిమాత్రము చెప్పితిని. ప్రపంచమునందేయే వస్త్వై శ్వర్యకాంతులతోఁగూడినవై శక్తివంతములై ఉత్సాహముతో విరాజిల్లుచుండునో ఆయావస్తువులన్నియును నా తేజో భాగ మువలననే గలిగినవిగా గ్రహించుము. పార్థా! నా ప్రభావం బు నెంత నేఁ జెప్పఁగలను, నీ వెంతనియాలకించగలవు? నా యంశ మువలననే యీసమస్తప్రపంచము నానావిధవస్తుసంపదలతో నిండి ప్రకాశించుచున్నది. నేను సర్వాంతర్యామినై ప్రతి పరమాణువునందిమిడి విశ్వమంతయు నిండి 'ప్రత్యగాత్మ'నై ప్రకాశించుచున్నాను.

వి॥ ఈయోగమునందు నాత్మయోగ ప్రభావమును భగవంతుని అనంతవిభూతులును దెలుపఁబడినవి. భగవద్విభూతులఁదెలియవలెనన్న సామాన్యముకాదు. కడుదుర్లభములు. అయ్యవిలనుభవపూర్వకముగాఁదెలియఁ దగినవిగాని యితరయత్నము లనుపయోగములు. కావున బాహ్యములు, సగుణములునైన యీశ్వరవిభూతులలోదేని నేని నారాధించి పరమాత్మజ్ఞానము నార్జించుట సాధ్యమని యిందు శ్రీకృష్ణ భగవానునిచే వచింపఁబడినది. సర్వజీవులయందుండు ప్రత్యగాత్మ' సర్వత్రనున్న పరమాత్మయేయని యర్జునునకు భగవానుఁడుపదేశించెను. ఇందువలన జీవబ్రహ్మైక్యము తప్పక ద్యోతకమగుచున్నయది. ప్రకృతియందుగల భౌతికపదార్థములువిజ్ఞానమయములు. యోగసాధనములు. ప్రపంచమంతయు ప్రకృతిభౌతికపదార్థమయమై ప్రభలుచున్నది. ప్రతిపదార్థమునందును భగవత్తేజముపరమాణురూపమున నణఁగియున్నది. ఇట్టిమిడియున్న తేజశ్శక్తిని నేఁటి విజ్ఞానశాస్త్రజ్ఞులు (భౌతిక శాస్త్రవేత్తలు)పరిశోధించి తదాశక్తి నుత్తేజింపఁజేసి దానివల్ల మానవాతీతమగు మహాకార్యములనెన్నిఁటినో చేయఁగలుగుచున్నారు. కావున నీయోగరహస్యము నెఱిఁగినసమగ్రజ్ఞానులు ఆత్మజ్ఞానపరాయణులయి, విభేదభావ విసర్జనులై తరింతురనుట నిస్సందేహము.

దశమాభాగము—విభూతియోగము

సమాప్తము.

ఓమ్.

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# శ్రీమదాంధ్ర భగవద్గీత



ఏకాదశభాగము.

## విశ్వరూప సందర్శనయోగము

శ్రీవిశ్వాత్మకశౌరీ

భావజ్ఞమునీంద్రహృదయ । పద్మవిహారీ!

పావనదివ్యశరీరా!

సేవకజనభయవిదారి । శ్రీరఘువీరా!॥

శ్రీకృష్ణా! నీవునాయందనుగ్రహము గలవాఁడవై నా కుపదేశించిన మహత్తరమైనదియు, నిగూఢరహస్యంబునగు ఆత్మానాత్మపదార్థవివేక జ్ఞానోపదేశముచే నాయొక్క యజ్ఞానము పూర్తిగానశించినది. సకలప్రాణిసమూహములయొక్క సృష్టిస్థితిలయాదులనుగూర్చి బాగుగా వివరించితివి. నీవువచించినదంతయు నిజమే. సందియములేదు. నాశరహితమగు నీ మహాత్మ్యమునుగూడ దేటతెల్లముగా జెప్పితివి. కాని, యీ సంగతులు నాకెన్నోమారులు ప్రబోధించియున్నావు. మనస్సు నిలకడలేకుంటచే దెలియఁజాలకుంటిని. కావుననీవు ఏరీతిగా బ్రహ్మమున్నగు దేవతలు, సమస్త చరాచరభూతములు, సర్వ లోకములు నెట్లు నీస్వరూపములై యొప్పుచున్నవో నీయొ

యీశ్వరసంబంధమైన రూపంబును వీక్షింప నామనం బిచ్ఛగించుచున్నది. నేనాస్వరూపంబును గాంచుటకు నర్హుండ నగుదునేని అవ్యయమగు నీనిజస్వరూపంబునుజూపి నన్నుం గృతార్థుంజేయ వేడుచున్నాడననిన యర్జునునకు శ్రీకృష్ణభగవానుండిట్లు మారుబల్కెను.

అర్జునా! సనాతన కల్పితంబులైన యనేక చిత్రివర్ణంబులుగలిగి పెక్కు దివ్యచిహ్నములుగలరూపములతో నొప్పుచున్నడియు పరమతపోధనులకు సైతము గాంచ నశక్యమగు నట్టిదియునగు నావిశ్వరూపమును వీక్షింపుము. ద్వాదశాదిత్యులు, ఏకాదశరుద్రులు, అష్టవసువులు. అశ్వినీదేవతలు, (దేవవైద్యులు) అష్టదిక్పాలకులు, సప్తవాయువులు, సప్తమహాఋషులు, దేవమానియగు నారదాది సర్వామరబృందములు, ఇదివఱకెన్నఁడు నీవుచూచియుండని మహోద్భుతములగు పెక్కువిలసితయాకారము లిప్పుడు నాయందుజూడుము ఈస్థావరజంగమాత్మకంబయిన సకలప్రపంచమును, మఱియు, న్యాయాన్యాయములు, జయాపజయములు, సత్యాసత్యములు, మొదలగు యితరవింతలనన్నిఁటినో నా శరీరమందే నీవిపుడు చూడుము. ప్రాకృతంబగు సామాన్యనేత్రములతో నీవీసమస్తంబును జూడఁజాలవు. కనుక నా విశ్వరూపమును జూచుటకొఱకు నీకప్రాకృతంబగుదివ్యదృష్టినొసంగుచున్నాను ఇదేనాయోగశక్తినివిలోకింపుము, అని మహా యోగీశ్వరుఁడగు శ్రీకృష్ణ భగవానుఁడు తనదివ్య తేజోమయ మహోత్కృష్

శక్తియుక్తమైన విశ్వరూపము నర్జునునిఁ బ్రదర్శించెను.

ఆరూపమందు లెక్కలేని ముఖంబులు, నేత్రములు, హస్తములు ఆశ్చర్యదర్శనములగు అసంఖ్యాక దివ్యాభరణములు, గణనాతీతమైన ఖడ్గములు, గదలు, శూలములు, పరశుపట్టిచక్రాయుధాది వివిధాయుధములు, పారిజాతపుష్ప మాలికలు కనకాంబరధారిగను, దివ్యగంధలేపనపరిమళసంయుతమై. మహావిచిత్రాలంకృత శృంగారభూయిష్టమై, మనోనందకరమై, ఆదిమధ్యాంతరహితమై, అనంత ముఖములు కలదై ప్రకాశించు శ్రీమన్నారాయణుని విశ్వరూపమును పాండవ మధ్యముఁడు తిలకించెను. సహస్రభాగమందొక్క పాలు భాను సహస్రోదయచందమున మహాకాంతివంతమగు నిఖిల నిర్జర మానవాది బహురూపములతో సర్వలోక సంయుతముగా నొప్పుచు కన్నులకు మిరుమిట్లుగొల్పు శ్రీకృష్ణ భగవానుని విశ్వరూపసందర్శనముఁ జేసినయోడనే యర్జునుండు మిగుల నాశ్చర్యచకిత మానసుఁడై, విభ్రమానముతో వినమ్ర శిరస్కుఁడై శ్రీకృష్ణునకు నమస్కరించి చేతులుజోడించి యిట్లు సన్నుతింపసాగెను

ఓ దేవదేవా! వాసుదేవా! నీదేహమందున నఖిల నిర్జర మానవాది పశుపక్షి మృగవ్యాళ సమస్త ప్రాణి సముదాయంబును, వృక్షశైల నికుంజాది జడపదార్థ శ్రేణులును, కమలాసనంబుతో నొప్పుచున్న చతుర్ముఖబ్రహ్మను, సకలమునిగణంబులను, వాసుకి మొదలగు నానావిధపన్నగసమూహంబు

లను జూచుచున్నాను. ఓ జగన్నియామకా! హే నారాయణా! విశ్వరూపా! విశ్వనాథా! స్వామీ! ఏవంక దిలకించినను యగణితమైన హస్తములు, ఉదరములు, మోములు, కన్నులు, చతుర్దశభువనములు, స్థావరజంగమాత్మకంబయిన సర్వలోకములు నీయందు కాన్పించుచున్నయవి. ఆది మధ్యాంతము లెచ్చటను గానవచ్చుటలేదు. ఎందు జూచినను కిరీటము, చక్రము, గద, పరశువు ధనుర్బాణాది వివిధాయుధములఁ [illegible] ఆదిత్యాగ్నుల సన్నిభమై, చూచుటకు శక్యము కానిదై, దీప్తివంతమై విద్యుత్కాంతిమాడ్కి తేజఃపుంజమై అప్రమేయమై, అనంతమై ప్రకాశించుచున్న నీదివ్య స్వరూపము దుర్నిరీక్షణమైయొప్పుచున్నది. నీవునాశనములేని పరబ్రహ్మస్వరూపివి. జగదాధారుండవు, అప్రమేయుండవు, అఖిలాంతర్యాముండవు, సర్వధర్మరక్షకుండవు, సనాతనుండవు, మహా[illegible]నుండవు, పరాక్రమశాలివి, పరాత్పరుండవు, సర్వలోకనాథుండవు అని నేను దెలిసికొనఁగలిగితిని. కృష్ణా! పరంధామా! నీవాదిమధ్యాంతశూన్యుండవు, భూరిసద్గుణసంపన్నుండవు. అగణితహస్తములు కలవాఁడవు. *హరి సుధాకరులు నీకు నేత్రములై, జ్వాలనుఁ జేసెడు వదనమై స్వీయ కాంతిచేతనే జగమెల్ల దపించునట్టిదిగాఁ గానవచ్చెడిని. ఓ దేవా! నీరూపము విశ్వమంతయునిండియెల్లచోటులనీరూపమే జూపట్టుచున్నది. ఆశ్చర్యకరంబై భయముఁగొల్పు నీయుగ్రరూపమునుగాంచి త్రిలోకంబులును కంపించుచున్నయవి. నిఖిలామరగణములు

---

* సూర్యచంద్రులు

నీయందు గోచరించుచున్నవి. అందులోఁగొందఱు ముకుళీ
కృతకరకమలద్వయులై సన్నుతించుచున్నారు. సప్తఋషి
లోకము స్వస్తివాచకముల నిన్నుఁ గీర్తింపుచున్నారు. ఏకా
దశరుద్రులు, ద్వాదశాదిత్యులు, అష్టవసువులు, ♦అమరభిష
గ్వరులు, సాధ్యులు, విశ్వేదేవతలు, మరుద్గణములు, పితృ
దేవతలు, యక్షరాక్షసాసురసిద్ధగరుడ గంధర్వకిన్నరకింపురు
షాదిసమూహంబులు మహదాశ్చర్యముతో నెల్లఱు నీరూప
మునే వీక్షించుచున్నారు. హే! నారాయణా! వాసుదేవా!
పరమాత్మా! నీ భయంకరాకారముఁ జూడ భయంబగు
చున్నది. నీమూర్తి యందెచ్చోట గాంచినను ముఖములు,
కన్నులు, కంఠములు, కరములు, కాళ్ళు, కడుపులు, తొడలు
భయంకరమైనకోరలుకడలేక గన్పట్టుచున్నవి. ఈ నీ గొప్ప
రూపమునుగాంచి సర్వలోకములు, ప్రపంచ మందలి సకల
ప్రాణిసమూహములు ప్రకంపించుచున్నవి. నాకును భయాన
కంబుగా దోచెడిని. నాశరీరము కంపమగ్నమైనదగుచున్నది.

ఓకృష్ణా! ఆకాశంబునంటుచున్న నీరూపము మిక్కిలి
తేజోవంతమై, నానాచిత్రవర్ణశోభితంబై, దీప్తవిశాలనేత్ర
నివహమై, వికృత వక్త్రసమూహ సంయుతమై యుండుటకు
మిక్కిలి భయంకరముగానున్నది. నాకేమాత్రము ధైర్యసం
తోషములు పొందకున్నవి. శాంతి శూన్యమైనది. ఘోర
ప్రళయాగ్నిసన్నిభమై, భయానకమై వికృతఘోరదంష్ట్రలచే

♦ అశ్వని దేవతలు.

నొప్పి నీముఖంబులఁ జూచినంతనే నాకు దిక్కులు యగోచర
ములై కన్నులకుఁ గానరాకున్నవి. ఓ దేవదేవా! జగద్రక్షా!
నాకుఁ బ్రసన్నుఁడవగుము. నన్నుఁ గృతార్థుఁ జేయుము.
స్వామీ! ఈరణతలంబునగల ధార్తరాష్ట్రశతమును, సర్వరా
జన్యసమూహములును, భీష్మద్రోణకర్ణాది మహావీరులును,
మనసైన్యమందలి దృష్టద్యుమ్నుఁడు, విరటుఁడు మొదలుగా
గల మహాయోధులును వక్రములైన కోఱలుతో వికృతా
కారమైభీతిగొల్పు నీవదనగహ్వరమునందుజొచ్చుచున్నారు.
కొందఱి శిరస్సులు నీదంతములయందు జిక్కువడి తుత్తుని
యలై కన్పట్టుచుండెను. మహానదీ ప్రవాహము లన్నియు
సముద్రమును జేరుచున్నవిధముగా నీసంగ్రామమునందలి వీర
శ్రేష్ఠులును భీషణ జ్వాలాభీలమై దీపించుచున్న నీవదనాభి
ముఖులై యేతెంచి యందఱుగూరుచున్నారు. కాలుచున్న
[illegible]మునకై నశించు శలభములమాడ్కి సమస్తప్రాణిసమూహ
ములును సంభ్రమముతో, ప్రళయకాలాగ్ని కీలికల వలె
వ్యాపించి ప్రజ్వరిల్లునీముఖములందు జొచ్చి మారణమగు
చున్నవి. దీర్ఘములయిన నీనాలుకలచే సకలప్రాణి సమూహ
ముల నీడ్చుకొనిపోయి గ్రసియించుచున్నావు. సర్వభూత
సముదాయములు వక్రతములైన నీనిశిత కోఱలయందు జిక్కి
మూర్ణముగా! జేయఁబడి నాశనమగుచున్నవి. నీయత్యుగ్రతర
కాంతిపుంజము సమస్తలోకంబులును తల్లడిల్లఁ జేయుచున్నది.
హా! విశ్వరూపా! నీ భయంకరాకారము నిఁక జాలింపుము.

నాకుఁ బ్రసన్నుఁడవుగమ్ము. ఈరూపంబును ధరించిన నీవెవ్వరవో యనుగ్రహించి వచింపఁగోరి నమస్కరించుచున్నాను. నీప్రవృత్తి నాకు గ్రాహ్యావిహీనముగా నున్నది. భవదీయ సనాతనరూపవృత్తాంతము నించుకఁ దెలుపఁబ్రార్థించుచున్నవాఁడను. త్వదీయవచనములాలకించి శ్రీకృష్ణభగవానుఁడు యర్జునుని కిట్లనియెను.

అర్జునా! జగము లెల్లను నశింపఁజేయు కారణభూతుఁడను నేనే. లోకసంహారార్థమై కాలస్వరూపమును దాల్చియున్నాఁడను. నామాయ బ్రహ్మాదులకును దురంతము తెలియరానిది. ఈకాలంబున నీయిరువైపు సైన్యములందు యుద్ధము సేయనివారునన్నా నీవునుదప్ప మిగతవారందఱును మడియుదురు. యుద్ధనెపంబున వారలనెల్ల సంహారము చేయింతును. నీవు యుద్ధము సేయకుండినంత మాత్రమున నీరిపువ్రాతము బ్రతుకజాలరు. కావున నీవు సంశయింపక లేచి యుద్ధమునకు గడంగుము. శత్రుసంహారమొనర్చి కీర్తికాంతను గైకొని నిష్కంటకమగు రాజ్యశ్రీనిబొంది సుఖములఁబడయుము. నీ శాత్రవులంనఱునిదివఱకే నాచే హతముకాబడిరి. నీవుయుం దుకు నిమిత్తమాత్రుఁడవనియే తలంపుము. శత్రుసైన్యమందు "భీష్మద్రోణులును, సైంధవుఁడు, కర్ణదుశ్శాసనాది దుష్ట చతుష్టయము ఇంకను యితరపరాక్రమవంతులును మరణమాసన్నమై యున్నవారలే. కావుననీవు నిమిత్తమాత్రుడవై సమరముచేసి శాత్రవులను జయించి 'జయశ్రీని' చేకొనుము.

నానారూపములను. తప్పక నన్ను జయించి తీరుదువు. ఈవిధం
బుగా బలికిన శ్రీకృష్ణుని వాక్యములాలకించి అర్జునుడు యావ
నతవదనుఁడై భగవానునకు నమస్కరించి భయకంపిత గద్గద
స్వరముతో నిట్లు పలికెను.

శ్రీకృష్ణా! నీ ప్రభావమునుగాంచి లోకము సంతసముచే
నీయందమితానురాగము వహించి వేవిధములఁ గీర్తించుచున్న
యది- రాక్షసులు భయభ్రాంతిచే నందఱున్ని దిక్కులకుఁ బారు
లిడుచున్నారు- ఓ! అనంతా! జగద్వినుతా! కృష్ణా!! ఆహా!
ఏమోయి నీ ప్రభావము- సిద్ధులందఱునిను నమస్కరించు
చున్నారు- కేలుమోడ్చి గంధర్వలోకము గానముచేయుచు
స్తుతించుచున్నది- సృష్టికర్తయగు బ్రహ్మదేవుని జనకాగ్ర
ణుఁడవైన నిన్నుఁ గొనియాడని వారెవ్వరుందురు? పరాత్పరా!
నీవు- కేవల పరబ్రహ్మ స్వరూపుఁడవు- అవ్యయుఁడవు-
ఆదిదేవుఁడవు- పురాణపురుషుఁడవు- సమస్తలోకములకు
నాధారమైనవాఁడవు- లోకేశుఁడవు- సర్వంబును దెలిసినవాఁ
డవు తెలియఁదగిన ప్రాప్తిస్థానంబును నీవే; ఓసర్వమయా!
వాయువు, యముఁడు, అనలుఁడు, వరుణుఁడు, సూర్యుఁడు,
చంద్రుఁడు, నవబ్రహ్మలు, బ్రహ్మకు జనకుఁడైన
శ్రీమన్నారాయణుండును నీవే- పరమశివుఁడవు కేశవుఁడవు
నీవే; నీకనేక నమస్కృతులాచరించుచున్నాను- విశ్వముఖా!
నీసమస్తముఖములకు నాయభివందనములు- పరమాత్మా!
నిన్నుఁ దెలియఁజాలని వాఁడనై అతిపరిచయంబున సఖాయ

నియు, ప్రమాదవశమున యాదవుఁడా యనియు, కృష్ణా యనియు, బావాయనియు, సంబోధించి పలికిన నా యజ్ఞాన వాక్యములకు నా యపచారమును మన్నింపుము. ఆహారవిహారశయ్యాధివాసాది సమయములందు వేళాకోళము గానాడినపరిహాస వాచాదోషములను క్షమింపుము— ఇష్టాగోష్టివేళల ప్రసంగ వశాత్తు పరాకుచే చలోక్తిగా నేనాడిన తిరస్కారాది కటువచనాదోషాపరాధములను మన్నించుము. దేవా! స్థావరజంగమాత్మకమగు సర్వప్రపంచమునకు నీవే తండ్రివి— పూజనీయుఁడవు, సద్గురుఁడవు, రక్షకుఁడవు నీవే; నీకుసమానమయినవాఁడు లోకత్రయంబున లేనేలేఁడు— దేవ దేవా! శ్రీకృష్ణా! నాయపరాధముల నెల్లను క్షమింపుమని నమస్కారపూర్వకముగా బ్రతిమాలుచున్నాను— తనయుని తప్పులను మన్నించు తండ్రివలెను, స్నేహితుని తప్పులను సహించు చెలికానివలెను—ప్రేయసి తప్పులనెంచని ప్రియుని వలెను నాసమస్తాపచారములను కాచి నన్ను రక్షింప నీవే సమర్థుఁడవు—నాయదృష్టము కొలఁది భవదీయ విశ్వరూపముఁజూడ గలిగినందులకు నేనెంతయు ముదంబందుచుంటిని— కాని, నాభయం బింకను బాయకున్నది— కావున నో ప్రభూ దేవా! నాయందనుగ్రహించి తొల్లిటి నీస్వరూపమును జూపుము— హేభక్తవరదా! సాహస్రసహస్త్రా! విశ్వమూర్తీ! కిరీటము, గద, శంఖ చక్రములను దాల్చి చతుర్భుజయుతమైన దేవకీపుత్రి సౌమ్యాకారముతో సాక్షాత్కరించుము— నన్ను

జరిపార్థుని జేయుము—అనినయర్జునునకు శ్రీకృష్ణుండిట్లనియెను—

అర్జునా! నీవు నాయనుగ్రహామునకుం బాత్రుండవగుట చేతనే బ్రహ్మేంద్రాదులకు, నిఖిలవేదములకు, ఘోరతాప సులకు యజ్ఞయాగాది సత్కర్మాచరణజ్ఞానులకు, ధర్మదీక్షై కా నిబద్ధకంకణులకు సైతము గోచరించని దివ్యతేజోత్కృ ష్టమైన నావిశ్వరూపమును మర్త్యలోకమున నీకొక్కనికే చూపంబడినది— ఎంతటిమహాత్ములైనను, పరమ తపోధనులై నను మహాభక్తాగ్రేసరులైనను మానవులు నావిశ్వరూపము నుసందర్శింపంజాలరు నాయోగసామర్థ్యమువలన నీకుంజూపం బడినది— నా యీభీషణ విశ్వరూపమును వీక్షించిన నీవు మనోవ్యధ, మూఢత్వంబును వీడుము— నీవికనిర్భయుండ వయి మహదానందముతో నాతొల్లింటి శ్రీకృష్ణస్వరూపం బిదేచూడుము— అనిభగవానుండు విశ్వరూపంబును విడిచి నిజరూపధారియై నిల్చిమిగుల విత్రాకుంజెందియున్న యర్జును నూరడించెను— అంతటనాయర్జునుండు శ్రీకృష్ణ భగవానుని గాంచి నాసుదేవా! నీమనోహరమైనరూపమునుజూచి నామ నంబిప్పుడు స్థిమితపడినది, నాభయంబుతీరినది అనినయర్జునుని వాక్యములకు శ్రీకృష్ణుండిట్లనెను— అర్జునా! మహా తత్త్వవేత్త లకుం గూడదర్శించుటకలభ్యముకాని నా విశ్వరూపమును నీ విపుడుచూడగలిగితివి. ఇందులకు నాయందునీకుంగలభక్తియే కారణమని భావించుము. నన్నుంబొందుటకుంగాని, చూచు టకుంగాని యనన్యభక్తియే సాధనముగాని యితరసాధనము

లెవ్వియు లేవు. దేవతలుకూడ నావిశ్వాకారమును వీక్షింపఁ గోరెదరు. గాని, వారికిని దుర్లభుఁడను. ఎవ్వఁడు నా ప్రాపుకొఱకు అన్యాసక్తి లేని భక్తిగలవాఁడై, సంగపరిత్యాగియై సమస్తభూతములందు కృపగలవాఁడై విభేద భావము లేక సమత్వబుద్ధితో వర్తించుచున్నాఁడో వాఁడే నిజముగ నన్ను పొందగలుగుచున్నాఁడు. ఇదినిక్కమని నమ్ముము.

వి! ఈయోగమందు ముఖ్యముగాఁ దెలిసికొనఁదగిన విషయములెవ్వియన? శ్రీకృష్ణభగవానుఁడు తానేసర్వలోకాత్ముఁడననియుఁ బ్రపంచమంతటను దన యంశచే వ్యాపించి ప్రకాశించుచున్నదనియు, సర్వభూతాంతరాత్ముఁడ ననియు హానివృద్ధులాదిసర్వకర్మలకుఁదానేకర్తననియుఁ గావనియునిది వఱకనేకసారులు యర్జునునకుపదేశించెను. కాని, అర్జునుఁడిది నిక్కమా కాదాయను సంశయముగలవాఁడయ్యెను. ప్రపంచమున గోచరించు నానాత్వమందు నేకత్వ మెట్లుండునా యనుసందేహమే యర్జునునకు గలిగెను. దానంజేసియే భగవానుఁడు యర్జునుని సంశయనివారణార్థము తన విశ్వరూపమును జూపియుండెను. ఇంతకుమున్నెవ్వరికి నిట్టి విశ్వరూపమును మర్త్యలోకమున భగవానుఁడు చూపియుండలేదు. ఆవిషయము భగవానుఁడే చెప్పియున్నాఁడుగదా! పరమసాధ్వీమతల్లియగు 'కౌసల్యకు' మహర్షి గౌతమసతియగు 'నహల్యకు' తల్లియగు 'యశోదకు' విశ్వరూపము జూపి యున్నట్లు పురాణప్రసిద్ధి. కానియవి సామాన్యములు. అర్జునునకుఁజూప

బడిన విశ్వరూపమువంటిదికాదు. మహాయోగులకైననులభ్యముకానివిరాట్స్వరూపము. అనన్య భక్తాగ్రేసరుఁడగుటచేతనే మహోత్కృష్టమైన విరాట్స్వరూపసందర్శనభాగ్యము యర్జునునకు లభించినది తద్రూపముఁగాంచినతోడనే యర్జునునకు గలిగిన సంశయము తొలఁగిపోయినది. ఇందువలన నాత్మయోగమెంత గొప్పదియో విశదమగుచున్నది. అనన్యభక్తివలన బొందరానిదేదియు లేదనియు, చతుర్థ పురుషార్థమునకదియే ముఖ్యసాధనమనియు ధృవమగుచున్నది. 'భక్తియే ముక్తి' యనునార్యసూక్తి నాలకింపుడు—

"శ్లో॥ ఆజీవితంత్రియస్సేవ్యా వేదాంతోగురురీశ్వరః.
పూర్వంజ్ఞానాపయే తవయేవముక్తా కేవలమ్ధృవమ్॥"

(మానవుఁడు) జీవించియుండువఱకు మూఁడు ధర్మములు ఆచరించుచుండవలయును. అవియేవన;— గురుభక్తి, దైవభక్తి, వేదాంతశాస్త్రవిచారణము— వీనివల్లనే మొదట జ్ఞానముకలుగును, [తదాజ్ఞానమువలన ప్రపంచమున సదా గలుగుచుండు జననమరణసుఖదుఃఖాదిద్వంద్వములచేగలుగు తాపములు నశించి బ్రహ్మభావముదయించును.] దానివల్లనే తప్పక ముక్తికలుగును. అని "సర్వవేదాంతసార సంగ్రహ" మందు చెప్పఁబడినది. కావున సదా భగవద్భక్తి గలవారలు ధన్యులగుట కేమాత్రము సందియములేదు.

ఏకాదశభాగము—విశ్వరూపసందర్శన యోగము
సమాప్తము.

ఓమ్.

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# శ్రీమదాంధ్ర భగవద్గీత



## ద్వాదశ భాగము.

## భక్తి యోగము

శ్రీవాగ్భార్గవి ప్రణయా
సేవాన్వితమంజుకాయ। చిద్బ్రహ్మయా!
భావాతీత కృపామయ
దేవా సుజ్ఞాన జ్ఞేయ। దివ్యముఖాయా! ॥

దేవ దేవా! శ్రీకృష్ణా జగమంతయు విరాట్స్వరూపమే భూత జల తరుపాషాణాది తృణపర్యంతముండు చరాచర వస్తువులలో "సర్వంవిష్ణు" వని దేనింబూజించినను భగవంతుఁడనగు నన్నుపూజించినట్లే యనియు, దీనినే సగుణోపాసన యందురనియు— నిర్వికారము, నిర్గుణము, నిష్క్రియ మగు పరమాత్మ స్వరూపము నర్చించుట నిర్గుణోపాసన మనియుఁ జెప్పియున్నావు— ఇది కేవలము మానసిక పూజయైయున్నది— ఈద్వివిధోపాసకులలో నెవరు యుత్తములుగా పరిగణింపఁబడుదురని యర్జునుఁడడిగెను— అందులకు శ్రీకృష్ణభగవానుఁడి ట్లనుడివెను—

అర్జునా! సగుణోపాసన మిగుల గొప్పది. ఏమానవులు బ్రహ్మమొదలు పరమాణువు వఱకుఁగల జడాజడ సమస్త పదార్థములును భగవత్స్వరూపంబని భావించి సమాహితచిత్తముతో సదానన్నెవరుధ్యానించుచున్నారో! మహోఘనమైన నావిశ్వరూపమును హృదయపీఠంబునందుంచుకొని మిక్కిలిభక్తినియమములతో లోకేశ్వరుఁడనగు నన్నెవరు పూజించుచున్నారో ఆభక్తులునాకుమిక్కిలిప్రియమైనవారు. నాశనరహిత మైనదియు, ఊహాతీతమగునదియు, నిరాకార నిరంజనమైనదియు, సర్వవ్యాపియై ప్రకృతియందుండునది యుఁజలింపని నిత్యంబగు బ్రహ్మమునందే మనస్సునిలకడఁ జేసి నిరంతరము పరబ్రహ్మసంధానము నాకాంక్షించుటయే నిర్గుణోపాసన——ఇందు మొదటఁజెప్పఁబడిన సగుణోపాసకులు సదానాయందే మనస్సులగ్నముచేసిన వారై సమస్తకర్మలు భగవదార్పణమొనర్చినన్నేపరమగతిగానెంచినిశ్చలభక్తితో నన్ను స్మరించుభక్తులను మృత్యురూపమైన సంసారాబ్ధినుండి త్వరగా తరింపఁజేయుచున్నాను— ఈరహస్యంబు నీవఱకే నీకుఁజెప్పి యున్నాఁడను— కావున సంశయరాహిత్యమగు చిత్తమును, నిశ్చయాత్మకమగుబుద్ధిని నాయందునిల్పుము, దేహమునశించిన పిమ్మట తప్పకనీవు నారూపంబును పొందగలుగుదువు— నాయందు మనస్సు నిశ్చలముగా నిలుపుటకు సాధ్యముకానిచో నాయందు దృష్టిధ్యానము కలవాఁడవై, అభ్యాసముచే మెల్లమెల్లగా మనస్సును స్వాధీనపరచుకొని

నన్నుఁజేయుటకు ప్రయత్నింపుము— నీకిట్లుచేయుటకు శక్తిలేని యెడల పరమేశ్వర ప్రీత్యర్థం కర్మలాచరింపుము, ఆటంజేసి నీవు ఆత్మశుద్ధిగలవాఁడవై మోక్షమునుబడయగలవు—కాని, నీవుచేయుకర్మలు ఫలాపేక్షలేని నిష్కామ కర్మలుగానుండవ లెను— అన్నిటికంటెను నిష్కామకర్మయోగ మాత్మమన్నా నది. నిష్కామకర్మయోగమువలన నంతఃకరణ శుద్ధి గలిగి రాగా రాగా మేఘమువదలినపుడు సూర్యుఁడు స్వయముగా ప్రకాశించునట్లు ఆత్మజ్ఞానోదయముగలుగును. సంసారమో హంబునశించును— అజ్ఞానము నశించుటచే మోక్షప్రాప్తి కలుగును—

వి॥ యోగసాధనముచేఁజిత్తమును బంధించుటకంటె శ్రవణపఠనమననము లుత్తములు— వీనివలన భగవంతుఁడు కలఁడను పరోక్షజ్ఞానము ఆత్మసంధానము, నేనే పరమాత్మన నెడు నపరోక్షజ్ఞానము, శాంతిక్రమముగా గలుగును—శాంతి యేసర్వయోగసాధన కారణము, శాంతియేసుఖము, శాంతి సర్వార్థప్రదాయము, శాంతితో సమమైనదిమఱియొకటి లేదు—

శీతోష్ణాదిద్వంద్వములకు చలింపక సర్వేంద్రియముల నిగ్రహించి, సమస్తభూతములందు దయకలిగి దేహాభిమా నము విడిచి ద్వేషభావములేక నందఱియెడల స్నేహభావము నవర్తింపుచు, ఆర్తులనాదరించుచు, మమకార హంకారము లుమాని, సుఖదుఃఖములు సమానముగానెంచి, ఓరిమి,తో సదా చిఱునవ్వుగల వారలై సంతోషముతోనన్ను సేవించు

మూడు;—పైన చెప్పిన రెండు విధములు మనస్సును నిగ్రహింపలేనివాడు కర్మఫలాపేక్షమాని పరమేశ్వర ప్రీత్యర్థము విధ్యుక్త కర్మములను యాచరింపవలయును. అనగా నిష్కామ కర్మయోగంబు ననుష్ఠింపవలెను. దీనివలన సమస్త వాసన లంతరించి, అహంనశించి చిత్తశుద్ధికలుగును. ఇదియే జ్ఞాన సంపాదనకు ముఖ్యసాధనము.

నాలుగు:—ఇట్లు నిష్కామకర్మమాచరింప లేనివారు ప్రతిఫలాపేక్ష లేని విధ్యుక్తకర్మలఁదప్పక నాచరింప వల యును. కావున యర్జునుఁడు క్షత్రియుఁడగుటచే యుద్ధము చేయుట ధర్మవిధి. కాని యర్జునుఁడది పాటించక యుద్ధ మధ్యమున జయాపజయములకై విచారించుచు యుద్ధము సేయనని శ్రీకృష్ణునితోఁ బలికి యూరకుండెను. యుద్ధము చేయుట మానినట్లయిన తనక్షాత్రధర్మమును నిర్వహించని వాఁడగుచున్నాఁడు. ఈ ధర్మమునే బోధించి శ్రీకృష్ణుఁడు యర్జునుని యుద్ధమునకుఁ బ్రేరేపించి యుద్ధముచేయించెను.

కనుక ఫలముల నాసింపక, కర్మములనాచరించుటయే విహితధర్మము దీనినే 'కర్మఫలత్యాగ' మందురు. ఇదెంత యుసులభసాధ్యమైనది. సామాన్యులందఱు అనుష్ఠించుట కనుకూలమగునది.

యోగులలో 'సగుణోపాసకు'లనియు-'నిర్గుణోపాసకు లనియు రెండువిధములని చెప్పఁబడెనుగదా! శ్రీరామ, శ్రీకృష్ణ శివోహమ్ (నారాయణా, దామోదరా, శంకరా) యను

మొదలగు నామరూపభేదములతో స్మరించినవారై మరణా నంతరమున శ్రీహరిహరుల నగరులగు వైకుంఠకైలాసములని చెప్పఁబడు పరపదము నలంకరించుచున్నారు. వీరిని సగుణో పాసకులందురు.

"అహంబ్రహ్మాస్మి"యని యుపాసించి అనగా తానే, తనలోనున్నదే 'పరమాత్మ' స్వరూపమని బ్రహ్మైక జ్ఞానము కలిగి దేహపాతానంతరము పరబ్రహ్మస్వరూపమునే పొందుదురు. వీరు నిర్గుణోపాసకు లనఁబడుదురు.

సవికల్పసమాధి:-బాహ్య పదార్థమునుదేని నైనను మనస్సునందు దృష్టించి యుపాసించు సగుణ ధ్యానమే సవికల్ప సమాధియనఁబడును. ఇందుమనస్సు ధ్యానింపఁబడు పదార్థరూపమును పొందుచున్నది.

నిర్వికల్పసమాధి:- ద్వైతభావరాహిత్యమొనర్చి తన చిత్తమును చిత్తగు 'పరబ్రహ్మ'మందులయింపజేసి స్వస్వరూ పానుసంధానముఁ బడయఁగలుగుటయే 'నిర్వికల్ప' సమాధి యనఁబడును. ఇందు మనస్సు ధ్యానింపఁబడు పరమాత్మ భావమును పొందును. దీనినే స్వానుభవజ్ఞానమని చెప్పుదురు. ఇదిచిత్తగించండి:-

సూ॥ "సమాధిసిద్ధిరీశ్వరప్రణిధానాత్": పరమేశ్వరుని యందు అతిశయమైన భక్తిగలుగుటవల్లను, సమస్తమును ఈశ్వరార్పణ చేయుటచేతను, నిర్విఘ్నముగా నిర్వికల్ప సమాధి (బ్రహ్మసాక్షాత్కారజ్ఞానము)కలుగును. అనియోగ

వారలు నాకుమిగుల యిష్టమైన భక్తులు—ప్రాణి లోకమున కెవఁడు భీతిఁజెందఁడో! ఎవనివలన ప్రాణలోకము భీతిఁజెం దదో! ఇష్టము, అయిష్టము, హర్షము, అసహనము, భయము అభయములేని వారున్నా నాకుభక్తులే; కామ్య కర్మరాహి త్యుఁడు, కార్యసాధన సమర్థుఁడు, పక్షపాతబుద్ధి లేనివాఁడు, సంసారతాపత్రయా విరహితుఁడయినవాఁడునునాకుభక్తుఁడే, వాఁడేనాకు మిగులప్రియమైనవాఁడు—ఎవ్వఁడు యిష్టా యిష్ట ములు శుభాశుభములు— లాభలోభములు— కలిమిలేములు సంభవించుసమఁయములలో మనోవైకల్యాది సంతోషవిషాద ములు పొందకుండునో, లభ్యముకాని దాని నపేక్షింపఁడో! అలభ్యమునకై విచారింపఁడో, లభ్యమైనయెడ సంతసిం పఁడో వాఁడే నాయంతరంగిక భక్తుఁడు నాయందమిత నిష్టుఁడు నగుచున్నాఁడు— ఎవ్వఁడు మిత్రా మిత్రములందు, మానావమానములందు, ప్రాప్తాప్రాప్తములందు, శీతోష్ణాది సుఖదుఃఖములందు నిందాసంస్తుతులందు నొకేవిధమున ప్రవ ర్తించునో- సంగరహితుఁడై, సదాసంతోషియై, సంతృప్తి కలవాఁడై, మానముదాంకితుఁడై, జయశీలుఁడై, మనోని గ్రహుండై పరోపకార బుద్ధి పరాయణుండై మెలఁగునో వాఁడే నాకుమిగుల యిష్టమైనభక్తుఁడు— మిక్కిలిశ్రద్ధాభక్తు లతోనాయం కు బుద్ధిలగ్నముచేసి యెవ్వ రక్షఅ పరబ్రహ్మ మును నా[illegible]ంతవఱకుఁ జెప్పంబడిన యమృతోపమానమైన వాక్యులనువిశ్వసించి యీధర్మముల నాసక్తితోననుష్ఠించుచు

క్రిమము దప్పక నుపాసింతురో వారేనాకు పరమభక్తులు అత్యంతప్రియులు- వారుబ్రహ్మభావమును బొందిన వారై మోక్షార్హు లగుచున్నారు,

వి॥ ఈయోగమునందు భగవదోపాసన చేయువిధానములు, సగుణోపాసన భాగములు వివరింపబడినవి.

ఒకటి- జ్ఞానియగువాఁడు భగవంతుని నేరూపముగా లక్ష్యముంచి ఉపాసింపఁదలఁచునో తదారూపమునందు మనోబుద్ధులను సదాలగ్నముఁజేసిఉపాసించుట-ఇదిఫలించుటకెంతయో సాధికచేయవలయును-ఇందుకు మనోనాశనము ముఖ్యావసరము. యిదియింద్రియనిగ్రహము ద్వారా జరుగవలెను-కావున నింద్రియనిగ్రహమువలన మనోజయమును మనోజయమువలన బుద్ధినిలకడయుసిద్ధించును. దానంజేసి ఉపాసించుతానేభగవత్స్వరూపంబని చిత్తవృత్తి జనించును- ఇంగూచి కాగ్రతయెక్కువగానుండిననేగాని సఫలీకృతులు కాఁజాలరు-

రెండు:- ఈచెప్పఁబడిన విధముగా మనో బుద్ధులను నిర్జింపలేనిభక్తులు విషయములనుండి బుద్ధిని క్రమక్రమముగా మఱలించి చిత్తశుద్ధిని బడయవలెను. ఇదిభారత రామాయణ భాగవతాది హరికథాశ్రవణ, పఠన, హఠయోగాభ్యాసాదులచే మనస్సును స్వాధీనపఱచుకొనుట కలవాటు చేయవలయును. కాని హఠయోగాభ్యాసము సులభసాధ్యము కాదు. చిత్తస్వాధీనమైనపిమ్మట నిది ధ్యానాభ్యాసముచే పొందవచ్చును.

దర్శనము ఉద్ఘాటించుచున్నది. ఇట్లు బ్రహ్మ సాక్షాత్కార జ్ఞానము గాంచగలిగినవారికినిరంతరసమాధియొక్క అభ్యాసముచేతనే మనస్సునంటియున్న సమస్తవాసనలుఁ సకల బుద్ధిదోషములు మొదలంట క్షయించును. సమాధియనగా-

శ్లో॥ "ప్రశాన్తవృత్తికమ్‌చిత్తమ్‌పరమానన్దదాయకమ్।
అసంప్రజ్ఞాతనామాసౌసమాధిర్యోగినామ్‌ప్రియః॥"

(య. భారతి)

చిత్తము సర్వవృత్తులచేతను రహితమై ప్రశాంతమై ప్రసన్నమై తేజోరూపమై ప్రజ్ఞానమయమై బాహ్యాన్తరముల యందును కేవలపరబ్రహ్మమై యుండుటయే అసంప్రజ్ఞాత సమాధియగును. ఇదిసర్వయోగులకు ప్రియమైనది. ఇట్టి చిత్తముగలవాఁడే చిత్స్వరూపియగుచున్నాఁడు. సకలవ్యాపారములు ఉపరమించుటచే (విలయ—నశించుటచే) శాశ్వతోపరతిని పొందుచున్నాఁడు.

ఇందువలన నిర్గుణోపాసకుఁడగు యోగికి నిహలోకమందుగాని, మరణకాలమందుగాని, బ్రహ్మలోకమున గాని బ్రహ్మసందర్శనము తప్పక కలుగుట నిజము. కాబట్టి ముఖ్యముగ నిర్గుణోపాసమే అనుష్ఠింపఁదగినది.

ద్వాదశభాగము—భక్తియోగము
సమాప్తము.

ఓమ్.

శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః

# శ్రీమదాంధ్ర భగవద్గీత



## త్ర యో ద శ భా గ ము

## క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగము

శ్రీకౌసల్యా తనయా
పాకారి బుధాతిథేయ! వరముని గేయా!
ప్రాకట భద్రకరా త్రయ
లోకా సృజనాను భూత్య! లోకద్యేయా! !

శ్రీకృష్ణ భగవానుని అర్జునుఁడిట్లు ప్రశ్నించు చున్నాఁడు— వాసుదేవా! కర్మప్రధానంబగు కర్మకంటె జ్ఞానము మిగుల శ్రేష్టమైనదని తెలిసియుండియు నేకారణం బుచే మహాభయంకరమైన తత్కర్మయందు నన్నుఁ బ్రవేశిం పుమని పురికొల్పుచున్నావు? నీవుమాటి మాటికిఁ జెప్పినవి యే చెప్పుచున్నావు. నీతీరుజూడ సందిగ్ధ వచనములచే నా మనస్సును భ్రమింపఁజేసెడివానిగా దోఁచుచున్నావు. నేను దేనినాచరించినచో సులభముగా ముక్తిని బొందుదునో తదా జ్ఞానకర్మలలో నేదోయొకదానిని నిశ్చయించి చెప్పిన వాఁడవేని నేను కృతార్థుఁడనగుదును— కావున ప్రకృతిని,

పురుషుని, క్షేత్రము, క్షేత్రజ్ఞుని, జ్ఞానము, జ్ఞేయము నివియెల్లను నాకు విశదముగాఁదెలియఁజెప్పుమని కోరి ప్రార్థించుచున్నాను— అనినవిని శ్రీకృష్ణుఁడు యర్జున కిట్లుచెప్పనారంభించెను.

అర్జునా! గోచరమానమగు యీదేహమునకు క్షేత్రంబని పేరు— యీదేహసమస్తమును తనది కాదని యెవ్వఁడీ శరీరమర్మంబును గ్రహించుచున్నాఁడో వానిని క్షేత్రజ్ఞుఁడని విజ్ఞులువచింతురు. సమస్త క్షేత్రంబులందును గల క్షేత్రజ్ఞుఁడను వాఁడను నేనే—అనగా సమస్త ప్రాణి సమూహముల శరీరములను తెలిసియున్న వాఁడనుగా నన్ను నెఱుంగుము— ఎన్ని ఉపాధి భేదములచే నొప్పుచున్నను సర్వత్రా వ్యాపించియుండు పరమాత్మ నొక్కఁడే; ఆయన అద్వితీయుఁడు కేవలచైతన్యుఁడు— కేవలచైతన్య స్వరూపుఁడు అయినను స్థూలసూక్ష్మశరీరోపాధులచే నానాత్వముఁజెందుచున్నాఁడు— తానొకఁడయి చేతనాస్వరూపుఁడయ్యు తదా ఉపాధులచే అనేకవిధములుగా భాసిల్లుచున్నాఁడు. (అమృతబిందూపనిషత్తు)

శ్లో॥ "గవామనేక వర్ణానామ్ క్షీరస్యాస్యేకవర్ణతా।
క్షీరవత్పశ్య తేజ్ఞానమ్ లింగివస్తుగవామ్యథా"॥ అనగా

నీలశ్వేతాది వర్ణములచే గోవులు భేదరూములచే నొప్పుచున్నను పాలుఒకటియే, ఆత్మయు ఒకటే— శరీరములువేరు— ఒకేపరబ్రహ్మచైతన్యము అవిద్యోపాధిచే జీవరూపమును ధరించుచున్నది— ఆజీవుఁడు శరీరములో ప్రవేశించి

సమస్తవ్యవహారములు చేయుచు అభేదబుద్ధిచే అనాత్మపదార్థములు నేననియు,నావనియుందలంచి భ్రమించుచున్నాఁడు-విచారించిన వాటికన్నిఁటికి విలక్షణుఁడై సాక్షియై సమస్తమునెఱుంగును సనాతనుఁడు ఒక్కఁడే—

శ్లో॥ "ఘటసంవృత మాకారం నీయమానే ఘటేయథా।
ఘటోనీయేత నాకాశస్త ద్వజ్జీవో నభోపమః,,॥

ఘటముపోయినను ఆకాశముపోదు, నశింపదు—ఆవిధమునశరీరముపోయినను ఆత్మనిత్యము- త్రివిధాత్మక దేహము నకన్న వేరై వ్యష్టిసాక్షిత్వమును బొందుచున్నాఁడు- విచారించిన సాక్ష్యతీతమగు పరమాత్మస్వరూపము కేవలచైతన్యమేతానుగాయున్నాఁడు—అటులనే ఓకే పరబ్రహ్మచైతన్యము మాయోపాధిచే ఈశ్వరరూపమును ధరించుచున్నది—ఆ ఈశ్వరుఁడు ప్రపంచోపాధిలోఁబ్రవేశించి చరములగు దేవ, తిర్యగ్, మనుష్యులుగను, అచరములగు పర్వతాదులుగను తోచుచున్నాఁడు— ఈప్రకారము నానావిధ చరాచరాత్మకమై ఈశ్వరుఁడున్నాఁడు— ఈలాగున పరబ్రహ్మమే సర్వత్రాతానై ప్రకాశించుచున్నాడు—

ఈవిధమున క్షేత్ర క్షేత్రజ్ఞుల స్వరూపమును దెలియుటయే సమ్యక్ జ్ఞానము అనబడును— ఈక్షేత్రక్షేత్రజ్ఞుల స్వభావాది ధర్మస్వరూప గుణవికారము లెట్టివో,అదియెందువల్లగలుగునో, వీరితత్వపరిభావమెట్టిదో యను మనఃప్రవృత్తిని వశిష్ఠాది ఋషీశ్వరులు పలువిధములుగఁ జేర్కొని యుండిరి—

వేదములందు బహువిధములుగఁజెప్పబడినది - మఱియు సందేహము లేని బ్రహ్మసూత్రములందును యుక్తియుక్తము గావచింపఁబడియెను.

(1) క్షేత్రముః—అది 'పృథివ్యాపస్తేజోవాయురాకాశంబు'లను పంచభూతములునూ, మనోబుద్ధిచిత్తాహంకారములునూ, జ్ఞానకర్మేంద్రియములనెడు దశేంద్రియములునూ శబ్ద స్పర్శ స్వరూపాది మొత్తమిఱువది నాలుగు తత్త్వములు కలది. పంచప్రాణములు పంచకర్మేంద్రియములలో జేరినవి. మఱియు కామము, క్రోధము, సుఖము, దుఃఖము శరీరేంద్రియసంగాతము— అంతఃకరణ ప్రతిబింబితమైన మనోవ్యాపారము, ధైర్యమనుహృదయచైతన్యభావము అవివేకము (తెలివిలేమి) ధృతి యను వికారములతో సంయోగమైనది క్షేత్రమని, సంగ్రహముగా చెప్పఁబడుచున్నది.

(2) క్షేత్రజ్ఞుఁడు— జ్ఞానముః— ఆత్మస్తుతి; అనగా తన్నుఁదాను పొగడుకొనుట, బడాయి, కపటము వీనియందాసక్తి లేకుండుట-అహింస, సహనము, సత్యము, యథార్థవాచ్యము, గురుభక్తి, దైవభక్తి, అన్యులయెడ గౌరవాభిమానము, దీనరక్షణము, సోదరభావము, బాహ్యాంతరశౌచము, నిశ్చలత్వము, చిత్తస్వాధీనము, విషయాసక్తివిరహితము, కోపవర్జితము వైరాగ్యములు గలిగి జననమరణ జరారోగ దుఃఖములందలి దోషములఁదెలిసికొనుట; సంగరాహిత్యము, ఈషణ త్రియాసక్తి లేకుండుట, ఆత్మచింతన

కంటె అన్యచింత లేకుండుట, ఇష్టాయిష్టములందు సదాసమ త్వముతో చరించుట, నాయందసమానభక్తిగలిగి యేకాంత వాస మభిలషించుట, పామరమైత్రి జనసంఘ ప్రవేశము లేకుండుట, సదా ఆత్మజ్ఞానాభ్యాసముచేయుట, మోక్షప్రదం బగు తత్వజ్ఞాన ఫలాన్వేషణ మందే మనస్సులగ్నముచేయుట యీావచించిన వన్నియు జ్ఞానసాధనమునకు ముఖ్యములు, వీనికంటె యితరంబయిన వన్నియును అజ్ఞాన హేతువులని చెప్పఁబడుచున్నవి. ఈరహస్యంబు డెలిసికొన్నవారు అనతి కాలములోనే యుత్తమపురుషార్థ హేతువగు సర్వజ్ఞానమును బొందుటవలన తప్పక మోక్షమునుబొందుదురు- ఇవి తెలిసిన వాఁడే క్షేత్రజ్ఞుఁడు-

అర్జునా! ఇప్పువడు నేను చించిన వానిలోఁగొన్నివిష యములనిదివఱకే నీకుఁదెల్పియున్నాను- ఇప్పుడు నీవు తెలి యఁదగినదియేదో, దేనిని డెలిసికొనిన మోక్షపదవి లభించు నో అట్టిజ్ఞేయమగు పరబ్రహ్మ ప్రభావముఁ జెప్పెద నాల కింపుము. పరబ్రహ్మమాదిమధ్యాంత శూన్యము, అక్షరము, నామరూపరహితము, అది సత్తు నసత్తులు రెంటునుకాదు - కాని మహావిలక్షణముగలది- ఆపరబ్రహ్మము జగత్తునందం తటను కరచరణంబులు, కన్నులు, శిరములు, ముఖములు, కర్ణములు కలదియైనిండి ప్రకాశించుచున్నయది. దానికింద్రి

---

అవిద్య = అజ్ఞానము, మాయ, చీఁకటి, బుద్ధిమాంద్యము,
క్షేత్రము = శరీరము, వరిమడి, భూమి, పెండ్లాము.

యశూన్యములయ్యును సమస్తేంద్రియముల నుత్తేజింపఁజే యుచున్నది- దేనిని అంటనిదయ్యు సకలము నాకర్షించు చున్నది- గుణశూన్యంబయ్యు తదా గుణస్వభావ భోగము లఁబొందుచున్నది. స్థావరజంగమాది సకలభూతము లందు నంర్యాభతముగాను, బహిర్యాభతముగా నున్నది. అదిస్థిరము గాను చరముగాను ఉన్నది- రాత్రింబవళ్ళవలె నది యజ్ఞా నులకంధకారము, నప్రత్యక్షము- జ్ఞానులకు జ్యోతిర్మయము ప్రత్యక్షమునయ్యున్నది. పరమాత్మస్వయంజ్యోతిస్వరూపము, మహదానందమయము- ప్రకృతిదోషరహితము, త్రిమూర్త్యా త్మైకస్వరూపము- అది ఆకాశవిహంగమువలెనన్యులకు దూర దృశ్యముగానున్నది. అనగా*జ్ఞానులకుపరబ్రహ్మము సన్నికర్ష మని భావింపనగును. తదా పరబ్రహ్మపదార్థము ఉపాధి భేద ములచే భిన్నరూపములుగా దోఁచుచున్నను సమస్తభూత ములందు నేకమైయుండి భూతములను సృజించి వృద్ధిఁబొం దించి గ్రసించుచున్నది- (సృష్టి స్థితి లయములు గావించు చున్నది.) ఈపరబ్రహ్మమే తెలియఁదగినది -బ్రహ్మము సూర్య చంద్రాగ్నుల తేజస్సులను దిక్కరించు మహాకాంతివంతమై, అజ్ఞానమున కసాధ్యమై, జ్ఞానమై, జ్ఞేయమై జ్ఞానమునకు చేరు వయై సమస్త భూతాంతరాళములందు ప్రకాశించు చున్నది. నీకిప్పుడు క్షేత్రము, క్షేత్రజ్ఞుఁడు, జ్ఞానము జ్ఞేయము వీనియొ క్కముఖ్యాంశములను సంగ్రహముగా వచించితిని- నాభక్తుఁ డై నవాఁడీ భావంబు గ్రహించినవాఁడై నాయొక్క మోక్ష

పదంబును బొందుట కర్తృ,డగుచున్నాఁడు— మఱియు నిటు లాలకించుము—

ప్రకృతిపురుషుఁడు;— క్షేత్రము క్షేత్రజ్ఞుఁడు అనగా "పృథ్వ్యాదిపంచభూతములు" మనోబుద్ధిమొదలగు అహంకారగుణముల 'పరాపకృతి'— ప్రాణభూతమగు పరాప్రకృతి పురుషుఁడు వీరిద్దఱు ననాదియని చెప్పుదురు— దేహేంద్రియాదులకు గలుగు సమస్తవికారములును, గుణములును, బుద్ధియందు దోఁచుకార్యా కార్య విచార్యమాది సుఖ దుఃఖములుపకృతివలన సంఘటిల్లునని గ్రహించుము—మాయ దేహము, సుఖము, దుఃఖము మొదలగునవన్నియు ప్రకృతి జన్య హేతువులే—దేహాది సమస్తేంద్రియ వ్యాపారములకుఁ బ్రకృతియేకారణము— మనుజులెల్లఱును అహంకారముచే ప్రతిబింబితులై క్షేత్రజ్ఞుఁడనుపేరున నహంకార మమకారములతో మసలుచు సుఖదుఃఖములుబొందుచుందురు— క్షేత్రజ్ఞుని సుఖదుఃఖములకు అంతఃకరణమే కారణము— జీవుఁడుజ్ఞానమునకాస్పదంబయిన బొందిఁజేరిప్రపంచోపాధిలోఁబ్రవేశించి బుద్ధిఅత్యాసక్తిచే భేదభావమున వ్యవహరించుచు నానాగా దోఁచుచున్నాఁడు— జీవుఁడు దేహాభిమానియగుటంజేసి సుఖదుఃఖములు జీవుఁడనుభవించునటులఁ గన్పట్టుచుండునేగాని నిజముగా నీవిషయములతో జీవునకెట్టి సంబంధమున్న లేదు—

* తానే పరబ్రహ్మమని తన్నుదాను తెలిసికొనుట, అనగాస్వస్వరూపసంధానము.

జీవుఁడు నిర్వికారుఁడు— దేహేంద్రియాదులకు సంభవిల్లువికారములెల్లను ప్రకృతిసంబంధములు—దేహిప్రకృతి మాయచేనావరింపఁబడి నేను సౌఖ్యవంతుఁడను, భోగవంతుఁడను, గొప్పవాఁడను భాగ్యవంతుఁడను సర్వాధికారిని అనియు, మూర్ఖుండను, అభాగ్యుఁడను, అబలుఁడను నీచుఁడననియుఁదలఁచుచుండును.

ఇట్లు ప్రకృతి మోహమున జిక్కుటఁజేసి పుణ్యాపాపసంయుతములైన సదసద్యోనులందు పుట్టుటకుఁగారణమగుచున్నది— కాఁబట్టి అజ్ఞానమువలననే నిర్వికారుఁడైన జీవునకు దేహాభిమానము గలుగుచున్నది. ఇదియేబహుజన్మహేతువగుచున్నది— కారణమేమన? దేహాభిమాని కర్మాసక్తుఁడై కర్మలుచేయుచున్నాఁడు—తత్కర్మానుష్ఠానముచేఅజ్ఞానమధికమగును—దానంజేసి మరలజన్మలు పొందుచుండును— ఈవిధమున మాయాతీతుఁడగు పరమాత్మయే శరీరధారియై 'ప్రకృతి, మాయననుసరించి దేహేంద్రియాది వ్యాపారములచే ప్రపంచసంబంధముగలవాఁడై కర్తృత్వభోక్తృత్వాది వికారములతో యనేకనామరూపభేదములచే వ్యవహరింపఁబడుచున్నాఁడు— ఇట్టివ్యష్టిస్వరూపభావమునే 'ప్రత్యగాత్మ' యందురు—సమిష్టిభావమును "పరమాత్మ" యందురు—ఉపాధులన్నియు మాయతోఁగూడినవిగనుక సర్వాంతర్యామియగు పరమాత్మయే ప్రత్యగాత్మయని భావింపబడుచుండెనని తెలిసికొనుము— జీవునకును పరమాత్మకును (దేవునకును) సత్యదృష్టిలో భేదములేదు. అయినను మాయాసంబంధమేర్పడిన

చోట అజ్ఞానివలె జీవుఁడై భాసిల్లుచున్నాఁడు— ఆమాయ తొలఁగినచో జీవుఁడే దైవమని చెప్పఁబడును— ఈరహస్యము నెవ్వఁడు సమగ్రముముగా దెలిసికొని వర్తించుచున్నాఁడో వానికి పునర్జన్మలేదు— దీనినే "జ్ఞానమందుగ" ఇట్టిజ్ఞానము గలుగుటవలన మానవుని ప్రారబ్ధకర్మము శరీరపాతముతో నశించి పునర్జన్మలేని మోక్షమును బొంది వైకుంఠాధిపతినగు నన్నుఁజేరి పరమానందముతోనుండును—

అర్జునా! కొందఱు ధ్యానంబు చేతను, మఱికొందఱు తపస్సుచేతను పరమాత్మను గాంచుచున్నారు - ఇంకను గొందఱు జ్ఞానయోగముచేతను, నిష్కామకర్మయోగ ములచేతను పరమాత్మను దర్శించుచున్నారు— ఇంకను దీనిని దెలియనివారు గురూపదేశము ననుసరించి అభ్యాసములచే నుపాసనజేసి జన్మరాహిత్యమును బొందుచున్నారు— ఇది యుంగాక వేదాంత శ్రవణాసక్తచిత్తులును పునర్జన్మలేని మోక్షమును బొందుచున్నారు—స్థావరజంగమాత్మకంబయిన ప్రపంచమున బ్రహ్మాదిపరమాణువు వఱకుఁగల ప్రతివస్తువు సర్వభూతములును ప్రకృతిపురుషమాయాశక్తిసంయోగము వలననే పుట్టుచున్నవి. ఎవ్వఁడు త్రిగుణాత్మకమయినమాయా శక్తివల్లనే సమస్తకర్మలు చేయఁబడుచున్నవనియుఁదాను నిష్క్రియుఁడననియు నేదిచేయుటకుఁదానుకర్తనుగాననియు నుపాధిరహితుఁడననియుఁ దన్నుఁదాను తెలిసికొనునో వాఁడేఆత్మజ్ఞాని— క్షేత్రజ్ఞుని నిజస్వరూపమును దెలిసికొనిన యుత్తమయోగియాతఁడే— అఖిలభూతగణనిలయంబగు యీ

సర్వప్రపంచమును నాత్మేతరముకాదని యేమహాత్ముఁడు తెలిసికొనగలుగునో యాతఁడే బ్రహ్మభావమును బొందు చున్నాఁడు— పరమాత్మజన్మలేనివాఁడు— గుణరహితుఁడు, అవినాశనుఁడు— వాయువు ఆకాశమందంతటను వ్యాపించి నను దేనిని అంటియుండనిరీతిగా పరమాత్మ శరీరమందు నన్నప్పటికిఁ గర్మాచరణుఁడుకాఁడు— దేనిని స్పర్శింపఁడు— కర్మవర్జితుఁడు— సూక్ష్మాతి సూక్ష్మస్వరూపుఁడగుటవలన నేసంబంధము లేనివాఁడై యున్నాఁడు— సూర్యుఁడు ఒకఁడే యీసమస్త జగంబులను బ్రకాశింపఁజేయుచున్నట్లుగా క్షేత్ర జ్ఞుఁడు సకల [క్షేత్రముల] దేహములయందుండి ప్రకాశింపఁ జేయుచున్నాఁడు— ఈవిధముగాప్రకృతి పురుషుల యొక్క విలక్షణత్వంబును భూతముల మాయాశక్తి ప్రభావప్రవర్త నంబును జ్ఞానదృష్టిచే నెవ్వరు తెలిసికొందురో వారేబ్రహ్మజ్ఞా నులై బ్రహ్మమును బొందుచున్నారు— 'కష్టేఫలి' యనునట్లు ఎంతకష్టపడియైనను జ్ఞాన మార్జించినవారు తప్పక ముక్తిని బొందుచున్నారు—

సారాంశము:— పరమాత్మ నిర్వికారుఁడు, నిష్క్రి యుఁడు నిర్గుణుఁడునై స్వీయప్రకాశముతో సర్వక్షేత్రము లను భాసిల్లఁజేయుచున్నాఁడు— ఈవిధంబున నెఱిఁగిన పర మాత్మజ్ఞానమునే జ్ఞేయమనిచెప్పుదురు. క్షేత్రమనగా కేవల స్థూలశరీరము మాత్రమేకాదు—పదునేడుతత్వములతో నిండిన

(1) మనస్సు, (2) హంకృతి, (3) మతి, (4) చిత్తము యీనాల్గును చేరి అహంకారమనఁబడును—

సూక్ష్మశరీరము దీనియందంతర్భూతమైయున్నది. సర్వప్రపం చమునకుమూలకారణమగు ప్రకృతి— అవిద్య, మాయఅను పెక్కునామములతోఁ బరఁగుకారణశరీరము ఇందున్నది—దీని యందు చిదచిత్తాంశలు రెండును ప్రతిబింబించుచుండును— వీనికి చిద్భావము అచితాభావము అనునామములు; చిద్భావ మనగా జీవుఁడు, ఈతఁడే క్షేత్రజ్ఞుఁడనబడును—అచిద్భావమం తఃకరణము. ఇదిత్రిగుణములతోఁగూడి చిద్భావమున ప్రతి బింబించుచుండును— ప్రకృతివికారములన్నియు నంతఃకరణ ధర్మములేగాని జీవునకెట్టి సంబంధములేదు— జీవుఁడు నిత్య శుద్ధజ్ఞానస్వరూపుఁడు. ఈరహస్యము నెఱిఁగినవారు తప్పక పరమాత్మయందు మనస్సునిశ్చలముజేసి మోక్షమునుబొందు దురు— ఎన్ని అవరోధములుగలిగినను, ఎన్నియాపదలు తార సిల్లినను లెక్కగొనక సమస్తబాధలు పడియైనను జ్ఞానము నార్జించినవారికి మోక్షప్రాప్తి కలుగును—ఇదిసత్యము, సందే హము లేదు—బ్రహ్మజ్ఞాని చరాచరములలో వ్యాపించియుండు బ్రహ్మమునే తనయాత్మగా దైవభావన జేయుటచేనిట్టిఫలితము గలుగుటకవకాశమగుచున్నది—ఇట్టిజ్ఞానము, ధ్యానసాంఖ్యఫల విరహిత కర్మయోగముల నాశ్రయించినమహాత్ములకు లభ్య మగుచున్నది. కావుననెంతశ్రమపడియైనను జ్ఞానమునార్జించి నపరమయోగులకు చతుర్థపురుషార్థమగు మోక్షము సునా యాసముగాలభించును—

త్రయోదశ భాగము

సమాప్తము.

ఓమ్.

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# శ్రీమదాంధ్ర భగవద్గీత



## చతుర్దశ భాగము

## గుణత్రయ విభాగయోగము.

శ్రీధరణిజ కుచాంచల
భేదనపరిచేల కేల। ప్రియకరలీలా
మాధవ త్రిభువనజాలా
మోదావహరామచంద్ర। మునిజనలోలా! ॥

శ్రీకృష్ణపరమాత్ముండర్జునునితో నీవిధముగాం జెప్పం బూనెను—

అర్జునా! జ్ఞానములలో నేదియుత్తమమైనదో! ఏజ్ఞానసాధనమువలన మహాఋషులెల్లరును మహానందకరంబగు దివ్యపదవి నలంకరించిరో! ఆజ్ఞానోపాసనాది విధుల ననుష్ఠించి సిద్ధోత్కారమందు కథావిధానం బెట్టిదో నీకువక్కాణించెద నిర్మలచిత్తుండవై యాలకింపుము— ఈజ్ఞాన సంపాదకులు బ్రహ్మసృష్టి స్థితి లయములు, జన్మజరామృత్యువులు లేని నా స్వరూపమునుబొందుదురు— త్రిగుణాత్మకమగు నామాయ పంచభూతములకంటె గొప్పది— పంచభూతములు, అవిద్య,

కామ్యకర్మలకు మూలమగు "నాయపరాప్రకృతిని" అనగా రెండవప్రకృతియగు నామాయాశక్తిని, పరాప్రకృతి యగు క్షేత్రజ్ఞునితో సంయోగము గలిగించుచుందును— అందువలన నఖిలజీవరాసులును జనించుచున్నవి. సృష్ట్యాదిని నాయ పరపరాప్రకృతుల సంయోగమువలన సువర్ణాండమును దాని నుండి బ్రహ్మదేవుఁడును జనించును— ఆబ్రహ్మదేవుని వలన స్థావరజంగమాది సకలభూత సృష్టియు గావింపఁబడుచున్నది. కావున జగంబునగల చరాచర సర్వభూతములకు ప్రకృతియే తల్లి, పరబ్రహ్మస్వరూపుఁడ నగునేను తండ్రిని— నేను ప్రకృతి ననుసరించి ప్రపంచసృష్టి స్థితి లయములకు కర్తగా నున్నాను— ప్రకృతిజన్యమగు "సత్వరజస్తమోగుణములు" దేహస్థుఁడగు జీవుని శరీరమునందు బంధించుచున్నవి—అనగా నిర్వికారుఁడయిన జీవునకు దేహాభిమానమును గలిగించు చుండును— ఈమూఁడుగుణములలో—

(1) సత్వగుణము:— స్వచ్ఛమగు స్ఫటికమాణిక్య దీప్తివలె కాంతివంతమై ఉపద్రవశూన్యమై సుఖసంగంబుతోను అంతఃకరణ ధర్మములతోను చేరుచున్నది. మానవుఁడీమూఁడుగుణములచేతనే 'అహము'ను, బొందుచున్నాఁడు—

(2) రజోగుణము:— ఎడతెగని ఆశానురాగములతో గూడిన స్వరూపముగలది. కావున దనివిజెందని కోరికలచే దేహినిసదా కర్మాచరణునిగాఁ జేయుచున్నది—

(3) తమోగుణము;— అజ్ఞానంబువలన జనించుచు న్నది— అందుచేతనే దేహిని, ప్రమాదము—ఆలస్యము—నిద్ర యీమూఁడును వశపర్చుకొనుచున్నవి— ఈవిధముగా 'సత్వ గుణము, సుఖాసక్తియు, 'రజోగుణము, కర్మాసక్తియు— తమోగుణముఁ అజ్ఞానప్రధానంబగు మోహాసక్తియు గలి గించుచున్నవి— ఓకానొకసమయమున మనోనిశ్చయమును బట్టి సత్త్వగుణము రజస్తమోగుణములను ధిక్కరించి నెగడు చుండును. కొన్నివేళలందు రజోగుణము సత్వతమోగుణము ల నణచినైచి విజృంభించును— మఱికొన్ని సమయములందు తమోగుణము రజసత్త్వగుణంబులఁ ధిక్కరించి చెలఁగు చుండును. మానవుని చిత్తప్రవృత్తి ననుసరించి గుణ గతులు మారుచుండును— ఒకగుణముపెంపొంది తక్కిగుణములు సన్నగిలును— సత్త్వగుణ మధికమగునపుడు భోగముల కునికిపట్టగు యీశరీరమాది సకలేంద్రియములందునంతఃకరణ రూపమగుజ్ఞానము జనించుచుండును— రజోగుణంబతిశయిం చినపుడు పరధనాపేక్ష, మనశ్చంచలనము, విషయాసక్తి, కర్మాచరణము, పరస్త్రీగమనము మొదలగు గుణాశయములు మెండగుచుండును— తమోగుణంబెక్కువగునపుడు బుద్ధిమాం ధ్యము, బద్ధకము, ప్రమాదము మోహము అకార్యకర్మా చరణాసక్తియు గలుగుచుండును— ఈగుర్తులాధారమునుబట్టి యేగుణమధికమైదియు గ్రహింపవచ్చును—

(1) సత్వగుణ మెక్కువై యుండు వేళలో శరీరధారియగు జీవుడు తనువు త్యజించుచో వాడు బ్రహ్మవేత్తలు పొందు పరబ్రహ్మము నందైక్యమయి పుణ్యలోకములను పొందు చున్నాడు—

(2) రజోగుణం బధికమైయుండునప్పుడు శరీరమును బాసినచో కర్మాభిలాషగల మానవలోకంబున మరలజన్మిం చును—

(3) తమోగుణ మభివృద్ధియై యుండునప్పుడు దేహ పాతము కలిగినచో సూకర, శునక, మార్జాలాది క్షుద్రజంతు యోనులందు పుట్టుచుండును—

(౧) స్వగుణ ప్రధానకర్మఫలవర్ణము:— నిష్కళంక జ్ఞానమునకు నెలవు, యవలవర్ణము—

(౨) రజోగుణ ప్రధానకర్మఫలవర్ణము;—లోభత్వము, అస్థిర బుద్ధియు నెఱ్ఱనికాంతియు, దుఃఖాస్పదమును గలది -

(3) తమోగుణ ప్రధాన కర్మఫలవర్ణము;—అజ్ఞానము, జడము, స్వార్థపరత్వము, నల్లనికాంతి ఘోర కర్మాసక్తియు గలుగుచుండును—

(i) సాత్త్విక గుణప్రధానులు దేవలోకములందు తిరుగజన్మించుచున్నారు—

(ii) రజోగుణ ప్రధానులు నరలోకంబున నరులై జన్మించుచున్నారు—

(iii) తమోగుణప్రధానులు పశుమేషాది మూఢను యోనులందు పుట్టుచున్నారు—

ఎవ్వఁడీరహస్యమును గ్రహించి కర్తృత్వ భోక్తృత్వములకు గుణములే ప్రధానమనియు, గుణగతులకుఁదాను సాక్షిమాత్ర మేయనియుఁదలంచునో వాఁడే కేవలము నాస్వరూపమును బొందుచున్నాఁడు — కార్యాకార్యములగు సమస్తకర్మము లకు గుణములే మూలహేతువనియు జీవుఁడు స్వయంకృత కర్మకారుఁడుకాఁడనియుఁ దెలియుటయే 'సమ్యగ్దర్శనము,,

'సత్వమ్ రజస్తమ ఇతిగుణాః ప్రకృతి సంభవాః।
నిబధ్నన్తిమహాబాహో దేహే దేహిన మవ్యయమ్,,॥

ఓయర్జునా! నాశనరహితుఁడైన దేహస్థుఁడగు జీవాత్మను దేహమునందు ప్రకృతివలన బుట్టిన పైనజెప్పిన సత్వరజస్తమోగుణములు బంధించుచున్నవి— కావున మానవుఁడుజీవించియున్నప్పుడే—

"గుణానేతానతీత్యత్రీన్ దేహీ దేహ సముద్భవాన్।
జన్మమృత్యు జరాదుఃఖై ర్విముక్తోఽమృతమశ్నుతే,,।

జీవుఁడు దేహోత్పత్తికి కారణభూతములైన త్రిగుణముల నతిక్రమించినచో బ్రహ్మజ్ఞానముచేత త్వదీయగుణములనుండి పుట్టుక చావు ముసలితనము దుఃఖములు మొదలగువాటిని బొందక జీవన్ముక్తుఁడై అమృతత్వమును బొందుచున్నాఁడు— అనగా సాక్షాత్పరబ్రహ్మమేయగుచున్నాఁడు— (మ. స్వా)

వి శే॥ పరమాత్మకు మానవదేహము దేవళమనిభావింప నగును—దేవాలయముపై ఎత్తైనభాగముభుజస్కంధమనియు, దానిపై నున్న శిఖరము మానవునిశిరమువంటిదనియుఁదెలియ వలెను—

"గర్భగేహమ్ గళాంతరమ్,, అనగా దేహమందలి కంఠము ఆలయమున గర్భగృహమైయున్నదని భావము,

"మండపమ్ కుక్షిమిత్యాహుః,, అనగా నపునిగర్భమో గుడియందలి మండపముగ వ్యవహరింపఁబడెను. కావున మానవదేహము భగవంతునకు ముఖ్యాశ్రయస్థానమని దృష్టిప్రబోధమగుచున్నది– ఈరహస్యము నెఱిఁగినవాఁడు తానే భగవంతుఁడనని తెలిసినవాఁడై బ్రహ్మభావమును బొందుచున్నాఁడు

అహంకార మమకారాది గుణములచే సంచరించు మూఢుని శరీరము ప్రతిష్ఠలేని పాడుదేవాలయము వంటిదే యగును–కావున మహాత్ములగు యోగిపుంగవులు శాస్త్రములందు ఎట్లువచించియున్నారో యాలకింపుము.

శ్లో॥ "త్రిభిశ్చ కరణై సమ్యక్
హిత్వావై షయికీం క్రియామ్।
స్వాత్మైక చింతనమ్
యత్త్వధీశ్వర ధ్యానమీరితమ్,, ॥

అనగా మనోవాక్కాయములలోఁగల విషయసంబంధ క్రియను లెస్సగా రహితమొనర్చి యాత్మధ్యానముమాత్రము గలిగియుండుటేదిగలదో యదే యీశ్వరపూజయగును–అదే ధ్యానము గూడనగుచున్నది.

యీసూక్తి ననుసరించిచూడ మానవుని దేహము భగవంతునకు దేవళమనియు దేహస్థుఁడగు జీవాత్మయే దేవుఁడనియుధృవమగుచున్నది. కావున ఎవ్వఁడు సమస్తేంద్రియ

వ్యాపారములను జయించి మనస్సు పరబ్రహ్మమునందులగ్న
జేసి బ్రహ్మోపాసన జేయుచున్నవాఁడై, సర్వభూత హృద
యాంతరస్థమై ప్రకాశించుచున్న చైతన్యము తానే పరమా
త్మస్వరూపమొకటియే యని సర్వాత్మభావమును పొందుచు
న్నాఁడో వాఁడే సర్వభూత సర్వాత్మభావముచే బ్రహ్మమే
తానై అనగా దేవుఁడే తానై యున్నవాఁడగుచున్నాఁడు-

ఇట్లువచించిన శ్రీకృష్ణునకు యర్జునుఁడిట్లనెను—వాసు
దేవా! ఈమూఁడుగుణముల నతిక్రమించువాని లక్షణము
లెట్టివి? వానియాచారధర్మములెట్లుండును? ఈమూఁడుగుణ
ములకు వశ్యుఁడుగాక యెట్లువర్తించగలుగును? దెలుపఁ
బ్రార్థించుచున్నాఁడననగా శ్రీకృష్ణుఁడిట్లుమారు బలికెను—

అర్జునా! గుణముల కతీతుఁడగు వాఁడు సత్వగుణ
సంభవమైన జ్ఞానమును,రజోగుణముచేగలిగిన చిత్తవృత్తిని,
తమోగుణసంభూతమైన మోహంబును సంధిల్లినపుడు విరో
ధింపఁడు— అవరోధములు కలిగినకార్యముల కేమాత్రమును
విచారింపఁడు— ప్రాప్తముకానివాటి నాశింపఁడు— నిర్మల
మనస్కుఁడై సర్వకార్యములు త్రిగుణాత్మకంభులగు వ్యార
ములేయని తలంచి ద్వంద్వములగు శీతోష్ణాది సుఖదుఃఖము
లందు—ఆనందవిచారములచే కలఁతజెందక మానావమానాది
సమస్తకార్యములందు సమానమనస్కుఁడై నిర్వికారుఁడై
మెలఁగుచుండును— ఏమానవుఁడు గుణసంభవములగు వికా
రములను ధైర్యముతో నెదుర్కొని ఇత్తడిపుత్తడి, ఇష్టుఁడు
విరోధి, బంధువు యితరుఁడు, భాగ్యవంతుఁడు బీదవాఁడు,

సమర్థుఁడు అసమర్థుఁడు నను వ్యత్యాసభావముల నీక్షించక సమత్వదృగ్మనస్కుడై ఫలాసక్తిగల కర్మములను త్యజించి నిశ్చలభక్తితో నన్నుపాసించుచున్నాఁడో వాఁడుత్రిగుణాతీతుఁడై పరబ్రహ్మనగునాస్వరూపమును బొందుటసత్యము— నేను పరమాత్మస్వరూపమునకు ప్రతిమను— నాశనములేని మోక్షమునకునాశ్రియుఁడను స్థిరంబయినధర్మంబునకు ఆశ్రయమైనవాఁడనునేనే— సుఖమున కాశ్రంబునేను, సకలధర్మాధర్మాది కర్మసమస్తమున కాశ్రయంబునేనే యగుచున్నాను. అందువలననే సర్వజనాశ్రయుండనని నాభక్తులునన్నుస్తుతించుచున్నారు—

గద్య॥ ఇది శ్రీరామచంద్రగురుకరుణా వరప్రసాదసమాలబ్ధ కవితామాధుర తెలగకులసముద్భవ శ్రీబల్లావంశక్షీరపారావారరాకాసుధాకర తిరుపతిరాయ సత్యమాంబా వర కుమార బుధజనవిధేయ ఆంధ్రోపాధ్యాయస్వామికవి నామధేయ విరచితంబై, శ్రీమహాభారతాంతర్గత భీష్మపర్వంబున విలసిల్లు భగవద్గీతలకాంధ్రానువాదమగువచనకావ్యమున శ్రీకృష్ణార్జున సంవాదరూపంబైన బ్రహ్మవిద్యయను యోగశాస్త్రమునందు చతుర్దశాభాగము గుణత్రయవిభాగయోగము సమాప్తము

ఓమ్.

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# శ్రీమదాంధ్ర భగవద్గీత



## పాంచదశ భాగము.

## పురుషోత్తమ ప్రాప్తి యోగము.

[సంసారస్థితి — వినాశము]

శ్రీ వసుధా నవలాసుత
సేవాపరిష్వంగ భరిత । చిత్తోపేతా!
పావన పదవనజాతా!
దేవా దిదిగీశవినుత । దీపిత గాత్రా॥ ॥

అర్జునా! వినుము, పరబ్రహ్మము గుణవికార శూన్యమగు నిర్మలస్వరూపము. నిబిడీకృతము, నిష్క్రియము— మాయనుబొందుటచే ప్రపంచ సృష్టిస్థితిలయములు సాగించుచున్నయది- ఈప్రపంచము భగవంతుని సంసారమనే మహావృక్షము. దీనినే మొదలులేని సంసారమని మహాత్ములువచింతురు- అశ్వత్థవృక్షమని కూడ చెప్పుటకలదు- దీనికి ప్రకృతియే మూలబీజము- కామక్రోధములు మూలములు- అనగా వేళ్లు, బుద్ధియే మాను- అహంకారము విటపము- పంచమహాభూతములు కొమ్మలు— గుణత్రయముచే విస్తరించెడు విషయములే చిగుళ్లు- వేదములు ఆకులు— తృష్ణయేజలా

శయము- పలువిధములైన వ్యాఖ్యానాదులు చిగురుటాకులు- ఇంద్రియములే కోటరములు స్వర్గమోక్షాదిలోకములు కులాయములు - శోభితఫలపతనములు సుఖదుఃఖములు (శీతోష్ణాది ద్వంద్వములు)- సమస్తప్రాణి సమూహములు పక్షులు- ప్రాణులనుభవించు సంతోష విషాదములే పక్షుల కలకలధ్వనులు- ఈవృక్షమూలాంకురమే హిరణ్యగర్భుఁడు శాఖాంకురములే ప్రాణుల సూక్ష్మశరీరములు- ఆకులనుగాంచి చెట్లను దెలియఁగలుగునటుల, ఆకులవంటి వేదములఁ దెలియఁ గలుగువాఁడే యీసంసార వృక్షమును దెలియఁగలుగు చున్నాఁడు - ఈస్థితి నెఱుఁగలేనివాఁడు నేర నేర్తు కాఁ జాలఁడు-

ఈమహా వృక్షము స్థావరజంగమాది పరమాణువు మొదలు బ్రహ్మవఱకు శాఖోపశాఖలుగ దిగువమీఁదలకు వ్యాపించియున్నది. ఇదియాది మధ్యాంతములుగాని, ఆకార రముగాని లేనిది - ఈగుణత్రయాo విలాసముచేఁ బెంపొంది తీరని ఆశానురాగ ప్రచండ వాయువీచికలచే చలించుచు దేహిని సంక్షోభింపఁజేయుచుండును. దేహి ఈవిధంబున సంసారమోహసాగర తరంగములలో బడి యీదులాడుచు మునిఁగి తేలుచుండును- ఇందుల కజ్ఞానమే మూలహేతువు- కావున దేహియగువాఁడిది గుర్తించి కర్మయోగసాధనముచే చిత్తశుద్ధివడసి అహంకార మమకారాది దుష్టమట్కము నిర్జించి, సుఖదుఃఖాది ద్వంద్వములను సహించి సంగపరి

త్యాగియై వైరాగ్యము నవలభించి ఫలకాంక్షావిరహిత కర్మ లనాచరించుచు బ్రహ్మభావమును బొందినచో యీవృక్షము సమూలముగా పెల్లగిలికూలి నశించును—

ఇట్టిజ్ఞానంబును సంపాదించినవాఁడు త్రిగుణాత్మకమైన మాయను అతిక్రమించినవాఁడై నిర్వికార, నిర్గుణ, నిష్క్రియ పరమాత్మను దెలిసికొని "అహంబ్రహ్మాస్మి" తానే పరమాత్మనని బ్రహ్మభావమును బొందుచున్నాఁడు. కావున సమస్తము బ్రహ్మమని చక్కగా గ్రహించినవాఁడే అజ్ఞానపాశ బంధములనుండి విడువఁబడి ముక్తాత్ముఁడగుచున్నాఁడు. ఇట్టి జ్ఞానమార్జించినవాఁడు స్వయంజ్యోతిర్మయుఁడు. సూర్యచంద్రాగ్నుల ప్రకాశమాయనయెదుట పట్టపగటింటి దీపము వంటిదగును. అనగానాకాంతినిమించిన కాంతిలేదని గ్రహింప నగును. కనుక నన్నాశ్రయించి మోక్షమును బొందినవానికి బునర్జన్మంబు లేదు. అజ్ఞానమే 'మాయ' మాయయే మానవుని ప్రబలశత్రువు. కావున దీనింజయించినవాఁడే మహాత్ముఁడగుచున్నాఁడు.

<u>పరమాత్మ విశ్వవ్యాపకజ్ఞానము:</u>— అర్జునా! పరమాత్మ జగత్తునం దంతటను నిండియున్నది. ఆయనలేనిస్థలమే లేదు—ఆయన సర్వవ్యాపి బ్రహ్మ మొదలు పరమాణువువరకు చేతనాచేతన సర్వపదార్థము లాయన యంశము—భూతకోటి యొక్క కర్తృత్వ భోక్తృత్వాది సర్వకర్మలాచరించు జీవుఁడా సనాతనుని యంశమేగాని యితరముగాదు— ఇదియే జీవ

రూపమున మాయనుండి మనస్సును జ్ఞానేంద్రియముల నాక
ర్షించి విషయముల వంకకు మఱలించుచున్నది— జీవుఁడు
శరీరమును బొందుచున్నప్పుడు, శరీరమును బాయుచున్న
పుడును సుగంధ దుర్గంధములను వాయువు గొంపోవుచంద
మున సూక్ష్మభూతములతోఁగూడినమనస్సు నింద్రియములను
గొనిపోవుచున్నాఁడు— దీనినే సూక్ష్మశరీరమందురు— సూక్ష్మ
మగుటం జేసియే తదింద్రియములు జీవునకు భోగోపయుక్త
ములుగావు— కాఁబట్టి జీవుఁడు స్థూలదేహమును బొంది
యింద్రియములను అంతఃకరణమునధిష్ఠానము గావించుకొని
వానిచేగలుగు, శీతోష్ణసుఖదుఃఖాది సకల ద్వంద్వములనను
భవించుచుండును— అజ్ఞానులు దేహమును జీవుఁడు విడుచు
నప్పుడు, దేహధారియై ఫలముల ననుభవించునప్పుడు త్రిగు
ణములచే గూడినవారై వ్యవహరించు నప్పుడును జీవునిదెలి
యఁజాలరు— సద్గురోపదేశమును బొందిన యాత్మానాత్మ
వివేకముగల జ్ఞానులు మాత్రము జీవబ్రహ్మమును దెలియఁ
గలుగుదురు— జ్ఞానజిజ్ఞాసులే ప్రబలప్రయత్నములు చేసిన
వారై యీరహస్యమును దెలిసికొనగలుగుదురు— దేహేం
ద్రియాది మనోనిగ్రహులై వాసనాక్షయమును గాంచిన
యోగీంద్రులు తపోబలముచే పరమాత్మను, తమయందే
గాంచగలుగుచున్నారు— ఎంతప్రబల ప్రయత్నము చేసినను
చిత్తసంస్కారములేనిమూఢులు దీనిం దెలియఁజాలకున్నారలు

* హరిహారాగ్నులయొక్కయు, మణులయొక్కయు, మఱి యితరములగు సమస్త ధాతు వస్తువుల యొక్కయు ప్రకాశమంతయు నాత్మ తేజమే— సకల భూతములు పుట్టి పెరుగుటయు, సకల తరులతావితానములు శోభితకర పుష్పనికుంజాది సమస్తఓషధీ ప్రకరంబులు, రసస్వరూపాత్మకుఁడగు చంద్రునిచే నభివృద్ధిగాంచుటయు నాసంబంధమయిన యాత్మ ప్రభావమువలననే యని గ్రహించుము. తదాత్మయే జఠరాగ్ని స్వరూపమునుబొంది సర్వశరీరముల నాశ్రయించి యదిభుజించుభక్ష్యభోజ్యంబులు, లేహ్యాచోష్యంబులను చతుర్విధ యాహారపదార్థములను బాగుగాఁబచనమొనర్చి ప్రాణాదివాయువులతో సంయోగించి శరీరమందంతటను విస్తరింప జేయుచున్నది. సర్వభూతాంతర్యామియైయుండి వానియొక్క పూర్వభవ కర్మానుసరణిని భక్తి, వివేక, జ్ఞాన, మాంద్యములను గలుగ జేయుచున్నది. వేదములచేతఁ దెలియఁదగినవాఁడు, వేదములనెఱిఁగినవాఁడు, వేద వేదాంతకర్తయునాత్మ బ్రహ్మమేయని గ్రహించుము.

అపరోక్షజ్ఞానము—పురుషత్రయము:— ఈశ్వరసంసారమగు యీవిశ్వంబున క్షరుఁడని, అక్షరుఁడని యిద్దఱు పురుషులున్నారు. వీరిలో క్షరుఁడనువాఁడు అపరాప్రకృతితోఁ గూడిన సమస్తభూతశరీరరూపములనియు; అక్షరుఁడనువాఁడు శరీరములు మారుచున్నను వానియందుండు జీవుఁడుఒక్కఁడే యనియు నెట్టిమార్పులేక శాశ్వితుఁడై ప్రకాశించుచుండు

* సూర్యుఁడు, చంద్రుఁడు, అగ్నియని భావము

ననియుఁజెప్పఁబడుచున్నాఁడు— ఈయిఋవ్రరికంగాను విలక్షణుఁడయి, మాయావిశిష్టుఁడై, అవజ్ఞానసగోచరుఁడై, అవ్యయుఁడై, నిత్యచైతన్యస్వరూపుఁడయి వెలుగొందు పురుషుఁడు పరమాత్మయనియు బుధులు చెప్పుదురు. ఈ పరమాత్మస్వరూపుఁడే అనంతుఁడగు 'శ్రీమన్నారాయణుఁడు, ఈయననే పురుషోత్తముఁడని వేదములు వర్ణింపుచు ప్రశంశించుచున్నవి. ఎవ్వఁడు ప్రకృతియంశసంభూతమైన సంసారమోహమును విడిచి మనోనిగ్రహుఁడై చిత్తోపరతినిగాంచునో వానికి సర్వత్రనేను గోచరించుచుందును. వాఁడేసర్వజ్ఞుఁడయి నన్నుఁబొంది పురుషోత్తముఁ డగుచున్నాఁడు. అట్టి మహాత్ముఁడు మరల మాయాసంజనితమైన సంసారమునకు మఱలని జన్మరాహిత్యమునుబొందినాలోలీనమగుచున్నాడు. నీవును నట్టివాఁడవగుదువేని తప్పక నీవేపురుషోత్తముఁడవు. కాగలవు. ఇది ముమ్మాటికి నిజము.

ఓయర్జునా! ఇదిమిక్కిలి రహస్యంబయిన శాస్త్రము, నాచే నీకు నిప్పుడు చెప్పఁబడినది మహాగుహ్యాతమమైన యోగము—కావున జ్ఞానముగలవారు యిందలియదార్థమును గ్రహించుకొని జ్ఞానోదయము కలవారలై సర్వ విధముల సద్బుద్ధికలిగినవారగుచుఁ దామీ లోకమం దాచరింపఁదగిన కర్మలను దప్పక నాచరింతురు. అందుచే సకలద్వంద్వ రహితులై నిరంతర మానందవారధి నోలలాడుచుందురు.

పంచదశభాగము—పురుషోత్తమప్రాప్తియోగము

సమాప్తమ్.

ఓం.

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# శ్రీమదాంధ్ర భగవద్గీత

★



## షోడశభాగము.

## దైవాసుర సంపద్విభాగయోగము.

శ్రీకర! రఘుకులభూషణ
రాకాశశిబింబవదన । రాజితనయనా!
పాకారార్చిత చరణా!
ప్రకట భువనైకవీర । భవభయహరణా!॥

శ్రీకృష్ణభగవానుఁడర్జునునితో నిట్లు చెప్పఁబూనెను—

అర్జునా! దైవాసురాంశసంభూతులగు వారిగుణావగుణంబులను జెప్పుచున్నాఁడను శ్రద్ధతో నాలకించుము. నిర్భయముగానుండుట, నిర్మలాంతఃకరణము, సాత్వికభావము, జ్ఞాననిష్ఠ, బాహ్యేంద్రియ వశీకరము, స్నాన సంధ్యానుష్ఠ యజ్ఞహోమాదిసత్కర్మాచరణము, జపతపములు, వేదపఠనము, అహింస, సత్యము, చిత్తశాంతి, ఆర్జనము, ధాతృత్వము, క్రోధవర్జితము, భూతదయ, పరదోషాన్వేషణరాహిత్యము, విషయవాంఛా విముఖత్వము, మృదుభాషణము, గాంభీర్యము, ఓర్మి, ధైర్యము, ఉపకారబుద్ధి కలిగియుండుట;

ద్రోహబుద్ధి గర్వము. సిగ్గు, చపలత్వము. అసూయ లేకుం డుట, సదాన్యాయసంభాషణము మొదలగు ధర్మగుణము లన్నియు దేవాంశసంభూతులకుఁ గలుగుచుండును.

అతిశయము, డాంబికము, ధనప్రమత్తత, స్వాభి మానము, మత్సరము, ఆసహనము, అతిశయము, కోపము పరుషవాక్యములు, పరధనాపహరణము, పరస్త్రీగమనము యుక్తాయుక్తవివేకశూన్యము, పరపీడనము, ప్రాణహింస అన్యాయము, దుష్టత్వము, అక్రమమార్గప్రవర్తన మొదలగు దోషాకరములైన గుణములు రాక్షసాంశసంభూతులందుగాన బడుచుండును—అమరసంపదవలన ముక్తియు, అసురసంపద వలన సుఖదుఃఖాదుల కాకరమగు సంసారబంధమునుగలుగు చున్నవి.

యర్జునా! నీవు దేవాంశసంజనితుఁడవు—కావున నీవు పిల్లుటజనదు—ప్రపంచమందు ప్రాణులు దేవతాంశజనితులనియు రాక్షసాంజమనియు రెండువిధముల జన్మములు గలిగియుగా నున్నవి. దేవాంశసంజనితులనుగూర్చి నీకువివరముగా జెప్పి యున్నాఁడను. ఇఁక రాక్షసాంశసంభూతులగు వారిని గూర్చి జెప్పెదనాకర్ణింపుము—రాక్షసాంశమునబుట్టినవారలు కర్మ జ్ఞానములు రెండును దెలియలేరు. శుచిర్భూతి, ఆచారము, ఆత్మశుద్ధి, అహింస, క్షమ, దయాదాక్షిణ్యభావములువారి కుండవు. ధర్మాధర్మవిచక్షణాశూన్యులయి అక్రమపథమున చరింతురు. దురభిమానులు, క్రూరహింసాచరణులు,

దుర్మార్గ సంచరణులు అవినీతి ప్రధానులు — వీరు లోక మననేమి? ధర్మమనఁగా నెట్టిది? దైవ మనగా నెవఁడు? యిది యంతయు వట్టిదని చెప్పుదురు. వారి ప్రవర్తన మంతయు నక్రమము — వారు మాయావులు —వంచకులు— అసత్యవాదులు — సదా దుష్టకృత్యాభిమానులు — వీరు ప్రపంచమంతయు కామసంభవమగు స్త్రీపురుష సంపర్కము వలననే పుట్టినదిగాని వేరుకారణముకాదందురు. ఈవిధంబున బల్కుచు నీచబుద్ధులై కామక్రోధ మదమాది దుర్గుణములు కలవారై దుష్కర్మము లాచరింపుచుఁ దీరని కోరికలచే నన్యాయమార్గావలంబనులై పరధనపరదారాపహరణాది పాప కృత్యములకుఁబాల్పడి లోకకంటకులై, అర్థసంచయాసక్తులై ప్రవర్తించుచు నేను మహాబలవంతుఁడను. భోగవంతుఁడను, సుఖవంతుఁడను, ధనవంతుఁడను, నేనేగొప్పవాఁడను, నాతో సమానుఁడు లేడని విఱ్ఱవీగుచు నపవిత్రవ్రతములనాచరింపుచు విషయసుఖములనే పరమావధిగానెంచి యన్యాయమునకుఁ బాల్పడి యాజన్మాంతము వానియందే సదాతీవ్రేచ్ఛ గలిగి సంసార వ్యామోహమునబడి విషయలంపటులై చరించు చుందురు. అమాయకులను మోసగించి యన్యాయముగ ధనమునార్జించి తమలోదాముప్పొంగుచు నేనింత ధనము సంపాదించితిని. ఇంకను సంపాదింపగలను. నాకుఁగల కోరిక లన్నిఁటిని బొందగలను. ఈశత్రువును నేనుజంపితిని. ఇంకను మిగిలిన శాత్రవులనుగూడఁజంపఁగలను, చంపించగలను. నా

కెదురాడువాఁడెవ్వఁడుగలఁడు? యజ్ఞయాగాదులుచేయుదును
ధనమెంతయైన దానమునిచ్చెదను. నాకెంతయు సంతోష
ముగానున్నది. నన్నందఱు మెచ్చుకొందురు, అని నానా
విధములైన చిత్తభ్రాంతులచే చలించినవారలై చరించు
చుందురు. ఇట్టివారు ఘోరనరకముల పాలగుచున్నారు.

ధనమదాంధులై శాస్త్రధర్మంబుల నుల్లంఘించి,
డాంబిక కర్మలనాచరింపుచు, బీదలను బాధించుచు, అమా
యకులను మోసగించుచు, పాపభీతిలేక యథేచ్ఛసంచారులై,
అజ్ఞానులై, నాయందు ద్వేషభావమును బూని నన్నులేని
వానిగాఁదలంచి నాభక్తులను హింసించుకౄరనరాధములను
రాక్షసయోనులందే జన్మింపజేయుచున్నాను, ఇట్లు బహు
జన్మంబులు రాక్షసాంశమునబుట్టి యజ్ఞానులై పరమాత్మజ్ఞాన
ములేక ఘోరపాపకార్యముల నాచరించినవారలై నాసాయు
జ్యమును బొందనేరక మహాభయంకరములగు దుర్గతుల బొందు
చున్నారు, నరకలోకప్రాప్తికిని నాత్మవినాశమునకును కామ
క్రోధ లోభము లనునవియే ముఖ్యకారణము. కావున యీ
మూఁడింటిని మొదలంట ఛేదింపవలెను. ఈ యంధకార
బంధురమార్గములగు యీమూఁడు గుణములను విడిచినవాఁడే
క్షేమకరుఁడై దేహపాతానంతరము నుత్తమగతియైనమోక్ష
మును బొందుచున్నాఁడు. ఏవాఁడైనను శాస్త్రధర్మముల
నుల్లంఘించి వక్రమార్గానుసారియై యథేచ్ఛగా ప్రవర్తించు
చున్నాఁడో వాఁడుపురుషార్థసిద్ధిని బడయఁజాలఁడుసరిగదా!

ఇహలోకసుఖమునుగాని, పరలోకసుఖమునుగాని బొందనేరక రెంటికిని దూరుఁడగుచున్నాఁడు. కావుననీవు శాస్త్రమందు చెప్పఁబడిన ధర్మములఁబర్యాలోచించుకొని యుక్తాయుక్త వివేకజ్ఞానముగలవాఁడవై స్వకీయకార్యసాధనమగు యుక్త కర్మలనాచరింపుము. నీకు శ్రేయోదాయకంబగును. తప్పక విజయము చేకూరును, నా మాట వినుము. సత్యము గ్రహింపుము,

అర్జునా! చింతయనునది నీ చిత్తమున జేరనీయకు సుమా! ఇది వ్యాధికి మూలహేతువగును. చెప్పెద నాలకింపుము. వ్యాధిమానసంబనియును, శారీరకమనియును రెండు విధములై యుండును. మఱియు వాతపిత్తశ్లేష్మములు మూఁడును సమత్వమునొందునపుడు మానవుఁడు స్వస్థుఁడగును. ఆ మూటిలో నొక్కటి వికారమును బొందినను శరీరమునకు వ్యాధికలుగును' సత్వరజస్తమోగుణములు మూఁడును సమముగ నుండునపుడు సమభావము గలవాఁడై యుండును. ఆమూటిలోనొకటి విషమించినను భిన్నస్వభావముగలవాఁడై యుండును. ఇదియే మనోవ్యాధియనబడును. కావున నీవు నీమనస్సుచేత నీద్వివిధముల యొక్కయు, సత్వరజస్తమో గుణములయొక్కయు యదార్థంబును దెలిసికొని శాంతిపరుఁడవగుము.

మానవునకు మనంబుశత్రువు. కావున నీవేవిధముగనైన నీలోని శత్రువులను జయించి కుశాగ్రబుద్ధివై శాంత

తను గైకొనుము. నీవంతరంగంబును శుద్ధముగఁ జేసికొననినేని
యేకార్యమును జేయఁజాలవు. కావుననీవిషయంబును సర్వం
బును యోజించుకొని బుద్ధినిశ్చయప్రవీణుఁడవుగమ్ము. పెక్కు
మాటలాడుటవలన ప్రయోజనమేమి? ఇటువినుము, రెండక్ష
రములు మృత్యువు. మూఁడక్షరములు బ్రహ్మము. 'మమ'
యను రెండక్షరంబులును మృత్యువు. 'సమము' యనుమూఁ
డక్షరంబులును బ్రహ్మము. భూతంబులచేతఁగానఁబడక యీ
బ్రహ్మమృత్యువులు పోరుచుండును. తత్త్వమెన్నటికిని నాశ
మును బొందునదికాదు. శరీరత్వముచేతఁబరగెడు భూతరాశి
సర్వకాలములయందును నాశనస్వభావము కలదై యుండును.
ఇట్లని యార్యులు పలుకుదురు.

మఱియు నోయర్జునా! ఇంకొక రహస్యంబును దెల్పు
చున్నాను వినుము. జ్ఞానములలో అవ్యక్త తత్త్వ జ్ఞానము
మిగుల మంగళకరమైనది. పాపములను నశింపఁ జేయునట్టిది.
అంతియగాక యది యవ్యయంబును, నమృతంబునునై యుం
డును. కావున నా తత్త్వమును గొనుటకుఁ బ్రయత్నశీలుండవు
గమ్ము. దీనికంటె శ్రేష్ఠమైన కార్యంబు నెన్నటికి లేదు
దానిచేత నిత్యమగు వస్తువులను బొందవచ్చునని తత్త్వ
వేత్తలుచెప్పుదురు. ఎవ్వఁడు సాత్త్వికంబులనఁబడు సత్యము,
సంతోషము, హింసారాహిత్యము, ధృతియు, క్షమయు,
నార్జవమును, కామవర్జితమును, విజ్ఞానయోగాశయమును
గలవాఁడగునో వాఁడే పరతత్త్వమును గాంచఁ గలుగు
చున్నాఁడు.

సకల ధర్మములలో సర్వభూతాహింస యుత్తమ ధర్మంబు. అహింసాసమేతుఁడైనవానికి నుత్తమ జ్ఞానోదయంబగును. దానివలన మోక్షముగలుగును. కోర్కెచేతఁగర్మను జేయువాఁడు గతాగతంబులను బొందును. ఫలాభిలాష లేక నిర్దోషతచేత మేలాచరించినయెడల తప్పకముక్తి సిద్ధించును. పద్మపత్రమునందలి యుదకబిందువుచందంబున నేవిషయము లందును దగులుకొనినవాఁడు సత్సాంగత్యముచేత మోక్షమును బొందుననుటకు సందియములేదు. పరతత్త్వమునుగనుటకు సత్త్వగుణము దీపమువంటిది. కావున సత్త్వగుణప్రవృద్ధుఁడగు మానవునకు సర్వకార్యములందును జయము చేకూరును. ఇది సత్యము. కనుక నీవు సత్త్వగుణము నవలంబించి యుండుట శ్రేయంబగును.

మఱియు నవ్యక్తగుణంబొ మహాతత్త్వము, మహాతత్త్వగుణంబహంకారను, అహంకార గుణంబులు మహాభూతంబులు. మహాభూతగణంబులు శబ్దాదులు. అందాకాశమునకు శబ్దంబుగుణంబు. వాయువునకుశబ్దస్పర్శంబులుగుణంబులు. తేజస్సునకు శబ్దస్పర్శరూపంబులు గుణంబులు. జలంబునకు శబ్దరూపరసంబులు గుణంబులు. పృథివికి శబ్దస్పర్శరూపరసగంధంబులు గుణంబులు. శబ్దంబు మృదుముఖరాది బహువిధభేదంబులు గలిగియుండును. స్పర్శంబు శీతోష్ణముఖ్యములై తనరుచుండును. రూపంబు మనస్సునకాహ్లాదకరమగునట్టియు, వికారముగలట్టియునునేకవిధములుగానొప్పా

చుండును. గంభంబు అమృతము నానందము, శోత యనా రోగ్యములు కలిగించునదిగానుండును. తత్త్వవేత్తలు యీ రహస్యంబు నెఱింగినవారలై ధర్మార్థకామ మోక్షములను బడయఁగలుగుచున్నారు. కావున నీవు నామాటలయందలి యదార్థమును గ్రహించి తదుపరి నీ యిష్టమెట్లో యట్లు వర్తించుము.

ఈయోగమునందు దేవతాంశ దానవాంశజుల గుణ ప్రవర్తనాది విషయములఁగూర్చి భగవానుఁడు విపులముగా నుద్ఘాటించెను. అందు రాక్షసాంశ సంభూతులనుగూర్చి ఎక్కువగా ప్రస్తావించియుండెను. మనుజుఁడొకప్పుడు దేవునివలెను మఱియొకప్పుడు రాక్షసునివలెను తనచేష్టలనుబట్టి గానబడు చుండును. హర్యక్షమువలె పెద్దపెద్ద బొబ్బలువెట్టుచు చిందులు ద్రొక్కుచు చేతుల నటునిటు త్రిప్పుచు హుంకారముగా నఱచుచున్న మానవునకు నరణ్యమున దిరుగాడు లేళ్ళు, వరాహములు, మొదలగువానిని భక్షించు క్రూరరక్కసునకు నణుమాత్రముభేదము గన్పట్టదు. దీనింబట్టిఅసురాంశ సంభూతులు పాపకార్యాచరణాసక్తులనియు, అజ్ఞానపాశా నిబద్ధులై క్రూరహింసాది ఘోరకృత్యములకుఁ బాల్పడుదు రనియు, లోకకంటకులై మెలంగుచుందురనియు సవిస్తరముగా నిందు చెప్పఁబడినది. ఇట్టివారు మహాదుఃఖమును బొంది ఘోరనరకములపాలై యధోగతినొందుదురనియును. దేవతాంశసంభూతులు సన్మార్గవర్తనులనియు పాపభీతిగల

వారనియు, సత్యవాదులనియు, దైవభక్తి గలవారలనియు ధృవమగుచున్నయది. వీరయుత్తమగతియగు మోక్షమును బొందుటకు కొవంతయు సందియములేదు, కనుక రాక్షస యోని సంజాతులు క్రూరహింసాది దుష్ప్రవర్తన స్వభావములను త్యజించి సర్వాత్మభావమును [బ్రహ్మభావమును] బొందిననేగాని వీరికి మోక్షము గలుగనేరదు.

షష్ఠాదశభాగము–దైవాసురసంపద్విభాగయోగము

సమాప్తము,



ఓమ్.

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# శ్రీమదాంధ్ర భగవద్గీత



## సప్తదశ భాగము.

## శ్రద్ధాత్రయవిభాగయోగము

శ్రీ కారుణ్యపయోనిధి
కాకుత్సకులాబ్ధిచంద్ర । కౌస్తుభభరణా!
రాకాసిమూకహరణ
భీకర కోదండపాణి । బృందశరణ్యా!॥

శ్రీకృష్ణభగవానుని యర్జునుఁడిట్లు ప్రశ్నించుచున్నాడు

దేవదేవా! శ్రీకృష్ణా! శాస్త్రోక్త విధానంబులఁ దెలిసి కొనజాలక వానిని విడిచి యాస్తికబుద్ధి కలవారలై పూజలు చేయువాని యనుష్ఠానమెట్టిది? సాత్వికమా? రాజసమా? తామసమా? అనియడుగగా శ్రీకృష్ణుఁడిట్లు ప్రతివచించెను—

కుంతీనందనా! అర్జునా! శరీరధారులగు జీవులకు వారి వారి పూర్వజన్మకర్మవాసనల ననుసరించి కలిగిన యా శ్రద్ధ (ఆస్తిక్యబుద్ధి) సాత్వికమనియు రాజసమనియు, తామసమనియు మూఁడువిధములు. వానినిగురించి చెప్పెదనాకర్ణింపుము. సమస్త ప్రాణులకు వానియొక్క పూర్వకర్మము ననుస

రించి యతఃకరణము సంకుచితవికాసభావములుగా బరిణామ మొందుచున్నయని. జీవునకీ మూఁడు గుణములలో నేగుణ మెక్కువగా నలవడునో ఆగుణము ననుసరించియే శ్రద్ధయు గలుగుచున్నది. లోకములో విద్యాధికులు, స్తోత్రపాఠాభిలాషులు, మహాత్ములు, యోగ్యులు, వంచనశీలురు, కుత్సితులు మొదలగు పెక్కువిధములగు మనుజులున్నారు. వీరందఱు నొకేవిధముగా నగపడుచున్నను "ఉప్పుకప్పురముల" మాడ్కి గుణములు వేరుగానుండును. ఈభేదకారణము లంతఃకరణ ధర్మములే గాని వేరొండుకాదు. తదాధర్మ సంకోచ వికాసముల ననుసరించియే శ్రద్ధకలుగుచున్నది.

(1) సత్వగుణప్రధానుని శ్రద్ధ సాత్వికము— (2) రజోగుణప్రధానునశ్రద్ధ రాజసము— (3) తమోగుణ ప్రధానుని శ్రద్ధ తామసము. ఈరీతిగా గుణము లొప్పుచుండును. పురుషుని శ్రద్ధయే స్వభావము. శ్రద్ధ ననుసరించియే స్వభావ ముండును.

1. సత్వగుణులు: పరమార్థ చింతనులు, దేవతలను పూజింతురు.

2. రజోగుణులు:—యక్ష రాక్షసులను పూజింతురు. అతిశయ వర్తనులు.

3. తమోగుణులు:—స్వార్థపరత్వ చింతనులు. ప్రేత భూతపిశాచములను పూజింతురు. దంభాహంకారసంయుతులై కామానురాగబలాన్వితులై అశాస్త్రీయమగుఘోరతపోనిష్ఠా

గరిష్ఠులయి, మూఢాత్ములై తమశరీరములందుగలయింద్రియ వర్గిజమును, వాటికర్మలనన్నిటికిని సాక్షిభూతస్వరూపుడనై యున్న నన్ను సరకుసేయక ద్వేషించుచున్నారో వారు రాక్షస సంపన్నులని యెఱుంగుము. ప్రపంచమందలి సర్వజీవుల యాహారము మూడు విధములుగా నున్నది. తద్విధముగానే, యజ్ఞము, దానము, తపము యనునవి వారలకు ప్రియతము లగుచున్నయవి. ఆభేదమును చెప్పుచున్నాను వినుము;-

ఆహారము—మనుజుడు భుజించెడు యాహారము జఠరాగ్ని చేబచనమై త్రివిధములుగా మారుచుండును. స్థూల భాగము మలమూత్రములుగాను, మధ్యభాగము రసమై, రక్తమై మాంసాదిసప్తధాతువులుగాను పరిణామమొందుచుండును. కనిషభాగముమనస్సైమారును. కావున నాయుర్వృద్ధికరములై ఆరోగ్యము, సుఖము, సంతోషము బుద్ధిబలము నొసంగి సత్వగుణమును బెంపొందించి చిరకాల ముండునట్టి రసతైలయుక్తములగు చూచుటకింపయినట్టి భోజన పదార్థములు తఱచుగా సత్వగుణప్రధానులు యిష్టముగా భుజింపుచుందురు. దీనినే సాత్వికయాహారమందురు.

వికారము- అనారోగ్యము -అసౌఖ్యము- నిరుత్సాహము-బద్ధకమును కలిగించునట్టి చేదు, పులుపు, ఉప్పు, కారము మిక్కిలిగాగల వేడి గలిగించు యాహారపధార్థములు యెక్కువగా రజోగుణ ప్రధానులు మిగులయిష్టముతో భుజించెదరు. దీనినిరాజ సాహారమందురు.

వండినపిదప జామువరకు నిలవయున్నట్టియు, చల్లబడి నట్టియు, రసహీన మయినట్టియు దుర్వాసన గలిగియున్నను, చద్దియైనను, ఉచ్ఛిష్టమైనట్టియు అయోగ్యభోజనపదార్థము లను అమితముగా తామసగుణప్రధానులు మిక్కిలియిష్టముగా భుజించుచున్నారు. దీనిని తామసయాహారమందురు. కావున నీయాహార విధానము ననుసరించి తద్గుణస్వభావముగల మానవులు సాత్వికులో రాజసులో, తామసులో సులువుగ గ్రహించి నిర్ణయింపవచ్చును.

యజ్ఞము:— ప్రతిఫలాపేక్షరహితములై శాస్త్రయుక్తముగా మనస్ఫూర్తితోఁ జేయు యజ్ఞములు సాత్వికయజ్ఞములని చెప్పఁబడును.

ఫలాసక్తిగలిగి లోకులమెప్పుగోరి డాంబికముగా జేయబడు యజ్ఞములు రాజస యజ్ఞము లనఁబడును.

అన్నదాన రహితమై వేదబుగ్మంత్రాదిస్వరశూన్యమై నిర్దక్షిణగా నశ్రద్ధతోఁ జేయు యజ్ఞములు తామసయజ్ఞములని బుధులు చెప్పుదురు.

ఈచెప్పఁబడిన యజ్ఞములు కేవల మశ్వమేథాదియజ్ఞము లనియేభావముకాదు. లోకమున సాధారణముగా ప్రతినిత్యమాచరించు స్నానసంధ్యానుష్ఠ జప తప హోమకర్మాది పూజా వ్రతాధికసమారాధనలు, సంతర్పణలు, పైతృకదహన సంస్కరణాది కృత్యములన్నియు యజ్ఞతరగతికిఁ జెందినవేగాని యన్యములుగావు.

తపము:—దేవతలను, బ్రాహ్మణులను, *గురువులను బుధులను పూజించుట; పరిశుభ్రత, నిర్దోషము, బ్రహ్మచర్యము, అహింస, సత్యము, పరోపకారదీక్ష, సర్వసమైక్యదృష్టి మొదలగు గుణములు కలిగియుండుట శారీరసంబంధమైన తపమని పెద్దలు వచింతురు.

అన్యులకాగ్రహము కలిగించు పరుషవాక్యములాడకుండుటయు, సదానిజమునే పలుకుటయు, సంతోషకరమగు హితవచనంబులాడుటయు, వేదాభ్యాసముచేయుటయు మొదలగు సద్వచనములన్నియు వాగ్రూపమైనతపస్సని యార్యులు వచింతురు.

చిత్తనిష్కళంకత్వము, సాధు వర్తనము, మౌనవ్రతము, మనోనిగ్రహము,అంతఃకరణశుద్ధి,వచోనియమము, సుశీలత్వము, సౌభాతృత్వము మొదలగు సత్ప్రవర్తనలక్షణములన్నియు మానసికతపమని పండితులు పల్కుదురు.

ఫలాపేక్షలేనివారలై, మహా నియమము గలవారలై మిగుల శ్రద్ధాభక్తులతోఁజేయఁబడు నీత్రివిధములైన—శారీర, వాచిక, మానసిక—తపములుసాత్విక తపములని చెప్పఁబడుచున్నవి.

ఇతరులచేగౌరవింపఁబడుటకు, వారినిమోసగించుటకు నాడంబరముగా జేయుతపము రాజస తపమనియందురు. ఇది

*విద్యచెప్పినగురువు. తండ్రి—తాత—అన్న— ఆపదనుండి రక్షించినవాఁడు—తనకంటెపెద్దలగువారు.

కపటయుక్తము, చంచలము, నశించునట్టిదియునై యున్నది.

తనకు హానికలిగించునదిగాను, పరులకు కీడు గలుగ జేయునదిగాను, స్వీయకోరిక సిద్ధించు కొఱకుగాను మిగుల మూర్ఖదీక్షతోఁజేయు తపస్సును తామస తపమని చెప్పు చున్నారు.

దానము:- గొప్ప పుణ్యక్షేత్రములందును, పుణ్య కాలములందును ప్రత్యుపకార మభిలషింపక దానస్వీక రణకుఁ దగినయోగ్యుఁడయినవానికి దేశకాలపాత్రములకను గుణ్యముగా దానమొసంగదగునని నిశ్చయమానసులై ప్రత్యు పకారము చేయఁజాలని యసమర్థులకొసంగుదానము సాత్విక దానమని చెప్పుదురు.

ప్రత్యుపకార కోరికతో గాని, ఫలాసక్తితో గాని, ఇష్టములేని మనస్సుతో బలవంతము మీఁద చేయఁబడు దానము 'రాజసదానమని' బుధులుచెప్పుదురు,

దేశకాలపాత్రములఁ బాటింపక మూఢమతులకు- చోరులకు-జూదగులకు-త్రాగుబోతులు మున్నగు అపాత్రులగు వారలకు నపూజ్యపూర్వకము గాను, అవమానకరముగాను జేయఁబడుదానము తామసదానమని పెద్దలువచింతురు.

పరబ్రహ్మము:-బ్రహ్మవిదులు"పరబ్రహ్మ"నామో చ్చారణ సమయములందు 'ఓమ్' అనియు, 'తత్' అనియు- 'సత్' అనియు త్రివిధనామములతోఁ బేర్కొను చుందురు. ఆపరబ్రహ్మమునుండియే మొదట బ్రాహ్మణులు, వేదములు,

యజ్ఞములును నిర్మాణముకాఁబడినవి. ఆకారణముచేతశాస్త్ర వేత్తలుశాస్త్రమందు చెప్పబడిన యజ్ఞములు– తపములు – దానములు–కర్మలు అనుష్ఠించుటకు ముందు బ్రాహ్మణులు 'ఓమ్'అను ప్రణవాకారంబగు శబ్దమునుచ్చరించుచుందురు. మోక్షాభిలాషులచే ఫలాపేక్షరహితమైన యజ్ఞతపోదానాది సమస్త సత్కర్మక్రియలు 'తత్' అను పరమాత్మ పదార్థ రూపంబగు శబ్దమునుచ్చరించినవెనుకనే జరుపఁబడుచున్నవి.

'సత్' అనుపదము సద్భావమును, శ్రేష్ఠత్వమును సూచించును. కావున ప్రశస్తమగు సమస్తకర్మలందు'సత్' అనుశబ్దము ప్రయోగింపబడుచున్నది. యజ్ఞ తపోదానాది కర్మములందలి నిష్ఠమున్నగు వానిని కొనసాగించుటకు జేయ బడు సమస్త కార్యములు భగవదార్పణముగా జేయ బడినపుడు 'సత్' అనియే చెప్పఁబడుచున్నది అర్జునా! ఈ చెప్పఁబడిన యజ్ఞ, దాన,తపోనిష్ఠాదిసమస్తకర్మలునుశ్రద్ధా విరహితముగా నాచరించినచో తదాకర్మసమస్తమును'అసత్' అనిచెప్పఁబడుచున్నది. అందుచేనది యిహపరసౌఖ్యమిను మంతయును గలుగఁజేయునదికాదు. ఇట్టి విరహిత శ్రద్ధాళు లు యిహపరములు రెండింటికి దూరులుకాబడి చెడినవార లగుచున్నారు. ఇదిసత్యము.

వి॥ ఈయోగమునందు పురుషుని శ్రద్ధాత్రయమును వానియొక్క నైజధర్మములు. ఆచారవ్యవహారిక యాహారా దులయందు శ్రద్ధాస్వాభావికధర్మములు—మనుజుని మానసిక

వాచికకాయిక వ్యాపారములు మనుజులకు యజ్ఞదానతపము లందుగల శ్రద్ధ వారివారి యంతఃకరణసంస్కారము ననుసరించి గలుగుచుండును. జగత్తునందు గాన్పించుసమస్త వ్యవహారిక భిన్నరుచులకు శ్రద్ధయే కారణమనుట నిక్కము. అదియే యిందు ముఖ్యముగా గ్రహింపఁదగినవిషయము.

సప్తదశభాగము—శ్రద్ధాత్రియవిభాగయోగము
సమాప్తము

ఓమ్.

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# శ్రీమదాంధ్ర భగవద్గీత



## అష్టాదశ భాగము.

## మోక్షసన్యాసయోగము

శ్రీ రాజీవదళేక్షణ
నీరదనిభదేహమాని । నివహస్వాంతా
పారముదానుత చరణా!
సారకృపాగుణధురీణ । జానకిరమణా! ॥

శ్రీకృష్ణా! నీవునాకింత వఱకుఁ బెక్కు విషయములను గూర్చి విశదముగా దెలిపియున్నవు— కాని, సన్యాస మనగా నేమో! త్యాగమనగా నేమో యీరెండు విషయములందును యథార్థంబును దెలిసికొనుటకు నామనంబిచ్ఛగించుచున్న యది గాన స్పష్టముగా దెలియఁజెప్పుమనిన యర్జునునకు శ్రీకృష్ణభగవానుఁడిట్లు చెప్పదొడంగెను;—

అర్జునా! దేవలోక సౌఖ్యదాయకము జ్యోతిష్టోమాది కామ్యకర్మ పరిత్యాగమును సన్యాసమనియు, వేదములందు చెప్పఁబడిన సమస్తకర్మల నాచరించి త్వదీయఫలముల భగవదార్పితము గావించుట త్యాగమనియు కవీశ్వరులు వచింతురు — సర్వకర్మములు దోషప్రపూర్ణములు— దేహాభిమాన

సంయుతములు— కావున వానిని పూర్తిగ త్యజింపవలెనని కొందఱు చెప్పుదురు— కర్మము వేదోక్తమయి యజ్ఞదాన తపములయొక్క— స్వరూపమనియు, కావునదానిని విడువందగదనియుఁగొందఱందురు— ఇఁకత్యాగమును గూర్చి చెప్పెద శ్రద్ధతోనాలకింపుము—

అర్జునా! ఆత్యాగంబు మూఁడు విధములుగా జెప్పఁబడియున్నది— యజ్ఞ, దాన, తపములు పండితులకుఁబరమ పవిత్రంబులగుటచేతఁ దప్పక వానిని జేయవలసినదే— కాని, ఆచేయఁబడు కర్మలు మమకారాది ఫలాభిలాషలను విడనాడి చేయవలయును— ఇందుచెప్పఁబడిన కర్మత్రయంబునుగూడ సక్తి యాచరింపవలెనని నానిశ్చితాభిప్రాయము— నిత్యానుష్ఠాననియమ బద్ధమగు కర్మలను విడువఁదగదు— ప్రకృతి మోహంబున వాటిని త్యజించుట తామస త్యాగమని యందురు—

శరీరమునకు నష్ట భ్రష్టత్వరోగాది కష్టములగు భయ భ్రాంతులచే కర్మలు దుఃఖకరంబులని విడచువాఁడు రాజస త్యాగియనబడును— అందువలన బొందుఫలం బొక్కింతయు గానరాదు— ఎవ్వనిచేత ఫలాసక్తి విరహితమై ప్రతికర్మయు విధిగా జేయవలెనని యెంచి చేయఁబడు చున్నదియో! ఆ జేయువాఁడు సాత్వికత్యాగము చేసినవానిగా గ్రహించుము. సత్వగుణప్రపూర్ణుఁడు, సర్వాత్మభావసంయుతుఁడు, సందేహ నిర్ముక్తుఁడు సాత్వికత్యాగి కనుక శుభాశుభ కర్మములందు

సంతోషవిషాదములు పొందక ద్వివిధములందును సమాన
ముగా వర్తించుచున్నాఁడు, దేహాభిమానముగల మానవు
నకుఁ బూర్తిగ కర్మపరిత్యాగము చేయుటసాధ్యము కాదు.
కాని, కర్మలాచరింపుచు కర్మఫలత్యాగ మొనర్చుట సులభ
సాధ్యమేయగును. ఫలాపేక్షలేని కర్మాచరణుఁడే త్యాగి
యనఁబడుచున్నాఁడు.

కర్మఫలములు మువ్విధములుగాఁ జెప్పఁబడినవి. అవి
యెవ్వన? ఇష్టములు—అనిష్టములు— ఇష్టాయిష్టములు— యీ
త్రైవిధకర్మలననుష్టించెడువారలకు నాయాకర్మానుసారముగ
మరణానంతరము ఫలములు సంప్రాప్తమగుచుండును. ఇవి
కర్మలొనర్చుసమయంబున నపూర్వమగు ధర్మమును గలి
గించి నిక్షేపముగ నశించును. సత్కర్మానుష్ఠానము వలన
దేవతాశరీరమును, దుష్కర్మాచరణముచే నానావిధ తిర్య
గ్జంతు శరీరమును, మిశ్రమ కర్మానుష్ఠానముచే మానవ శరీ
రమును కర్మానుసారముగ ప్రాప్తములగుచుండును. ఇట్లు
పూర్వకర్మసంచిత వ్యాసములైన వాసనల భాగ్యముచేత
దేహములు ప్రాప్తములగుచు జీవుఁడు భాగ్యభోగ్యాది సుఖ
దుఃఖాదుల ననుభవించుచున్నాఁడు. కర్మఫలాభిలాషు లివ్వి
ధముగ ఫలములననుభవించుచుందురు. కర్మఫల త్యాగులకు
నాయాఫలములేమాత్రమును బొందనేరవు. సమస్తకర్మలసిద్ధి
కొఱకు సాంఖ్యశాస్త్రమందు (తత్వశాస్త్రమందు) వేర్వేరు కార
ణములు నిరూపింపఁబడినవి. కర్మసిద్ధిబడయుటకు, దేహము—
ఇంద్రియములు—కర్త; ఇతర తాక్రియలు—ఈశ్వరుఁడు కారణ

ములు; దేహము, జ్ఞానకర్మేంద్రియములు, అహంకారము, ప్రాణాపానాది వాయువ్యాపారముల కర్మసాక్షియగు 'చిదాభాసుఁడు కర్త', వీనియన్నిఁటి కంటెను ప్రధానమైనది భగవదనుగ్రహము.

కాలానుగుణ్యముగ సంచరించిననే ప్రారంభింపఁబడిన యేపనియైనను సమాప్తి కాఁగలదు. మానసికవాచికకాయిక వ్యాపారకర్మములన్నియు న్యాయబద్ధములు. శాస్త్రపరిశోధితములయినవనియు, అన్యాయములు శాస్త్రదూషితములయినవనియు రెండువిధములు. ఈద్వివిధకర్మలకు నీవరకుఁ జెప్పఁబడిన అయిదును కారణములు. ఈవిధముగా ప్రతికర్మయు కారణపంచకమని తెల్లమగుచుండ ప్రతికర్మకు దానేకర్తనని భావించి అహమును బొందువాఁడు బుద్ధిహీనుఁడు, పరమాత్మతత్త్వము తెలియనివాఁడు; ఎవ్వఁడుసంగపరిత్యాగియై అహంకారమును విడిచినవాఁడయి, ఫలాపేక్ష లేనివాడయి, కర్మలననుష్ఠించుచున్నాఁడో వాఁడు యెంతమందిని జంపినను, ఎవరిని జంపినట్టివాఁడుఁకాడు. వానినెట్టికర్మదోషములు బాధింపఁజాలవు. కారణమేమన? సంగరాహిత్యము, కర్తృభోక్తృత్వములాది యహంకారములను విడిచినవాఁడు కేవల పరమాత్మస్వరూపుఁడు జీవన్ముక్తుఁడు నగును. ఇది సత్యము. ఇట్టిస్వస్వరూపజ్ఞానము కలవానిని మారణాది క్రియలేమాత్రము బాధింపనేరవు,

కర్మల ననుష్ఠించుటకు పూర్వము, వానిజ్ఞానము,

జ్ఞేయము, జ్ఞాతయగత్యము— అనగా కర్మోపదేశము జ్ఞానమనియు, అజ్ఞాన దెలియఁ దగినవిషయము జ్ఞేయమనియు కర్మానుష్ఠాత జ్ఞాత యనియుఁ జెప్పఁబడు నీ మూఁడు ను ప్రధానావసరములు— మఱియు నీకర్మల ననుష్ఠించుటకు, ఒకటి, సాధనము— 'కరణము'— రెండు, చేయఁదగినపని— 'కర్మ'— మూఁడు, చేయువాఁడు— 'కర్త' యీమూఁడును ముఖ్యావసరమే—'కర్త'జ్ఞాత యనునవి రెండు నించుమించు సమానార్థములే; త్రిగుణములననుసరించి జ్ఞానము, కర్మము, కర్తయను త్రైవిధములుగ వక్కాణింపఁబడియున్నవి— వాని యదార్థమును వచించెద నాలకించుము—

—: జ్ఞా న ము :—

౧. పెక్కు రూపశరీర భేదములచేఁగాన్పించు సమస్త ప్రాణిసమూహములందును వేఱుగాక నఖండమైనదియు నవ్యయమైనదియు, నిత్యమైనదియు నొక్కటేయగు"పరమాత్మ" స్వరూపమును వీక్షించుజ్ఞానము సాత్త్విక జ్ఞానమని చెప్పఁబడును—

౨. సమస్త భూతములను వేఱు వేఱను విభేదభావము తో 'పరబ్రహ్మము' కూడ భిన్నరూపమని అంతఃకరణము నందూహింపఁబడునో యాజ్ఞానము రాజస జ్ఞాన మనంబడును—

3. అకారణమైనదియు, అసత్యమైనదియు స్వల్పఫల మొసఁగునదియు, నొకేవిషయమునందుసమస్త జ్ఞాన మున్నదానిగా దలఁచునట్టియు మనఃప్రవృత్తిని తామస జ్ఞానమని

చెప్పుదురు— ఎట్టిజ్ఞానముచే జీవుని శరీర పరిమాణునిగాను, భగవంతుని కొయ్య, ఱాయి, భంజిక రూప పరిమాణుని గాను భావించునో అట్టిజ్ఞానమును తామస జ్ఞానమనియే వచింతురు—

—; క ర్మ ము :—

1. ఫలాపేక్ష రహితమై కామక్రోధవర్జితమై శాస్త్రోక్తమై అంతఃకరణపరిశుద్ధమై చేయఁబడు కర్మము సాత్త్విక కర్మమని చెప్పుదురు—

2. ఫలాభిలాష సంయుతమై యభిమానాహంకారములతో డాంబిక యుక్తముగా మిగుల నాయాసముతో నాచరించు కర్మ రాజసకర్మమని చెప్పఁబడును—

3. భవితవ్య ప్రమాదము నాలోచింపక, మంచిచెడ్డలనీక్షించకఁదనకు నధోగతియు నన్యులకు ఘోరహింసాది బాధలునొందిచునదియు నగుదానిని గలిగించుటకు శక్తివంచనలేక మూర్ఖముతోఁజేయఁబడు కర్మ తామసకర్మమని చెప్పుదురు—

—; కర్తత్రియము :—

౧. ఫలాసక్తిని విడిచి తనగొప్పతనమును ప్రచురించుకొన నిష్టములేక ధైర్యోత్సాహయుక్తముగా సాఫల్య వైఫల్యములకుఁగర్మయందు రాగద్వేషములు పొందక దీక్షగలవాఁడయి శాస్త్ర విధోచిత కర్మల ననుష్టించువాఁడు సాత్త్వికకర్త యని చెప్పఁబడు చున్నాఁడు—

౨. ఎవ్వాండు 'యీషణాత్ర'యానురాగ సంయుతుఁడై, కర్మఫలాపేక్షనిశ్చయమానసుఁడై, పరస్త్రీ పరద్రవ్యాసక్తిగలిగి పరులను హింసించుటయు హాత్యగావించుటయుఁబరమాసక్తియును నైజగుణము గలవాఁడయిసుఖదుఃఖాది ద్వంద్వములందుఁ గలఁత జెందునో వాఁడు రాజసకర్త యని వచించుచున్నారు—

3. ఇంద్రియముల నుండి మనస్సును మరల్చుకోనవేరని వాఁడును, పామరుఁడు— జడమతియు, మాయావి— కపటి— కుత్సితుఁడు— మందబుద్ధి— పరనిందా కల్పితదూషణ స్వభావము కలవాఁడు— దుఃఖస్వాంతుఁడు— కార్యవిలంబనా సాధనయుక్తుఁడు— గర్వోపేతుఁడును తామసకర్త యనబడుచున్నాఁడు—

అర్జునా! త్రిగుణానుసారముగ బుద్ధియు ధృతియుఁ ద్రివిధము లయ్యున్నవి, చెప్పెదనాలకింపుము;—

—: బుద్ధి త్రియము :—

1. కర్మజ్ఞాన మార్గములను— కృత్యాకృత్యములను— భయాభయములను— బంధమోక్షములను దెలిసికోను బుద్ధి సాత్వికబుద్ధి యనఁబడును—

2. న్యాయాన్యాయములను— సత్యా సత్యములను— శుభాశుభకార్యములను నిజంబు దెలియనేరక వానికివ్యతిరేకముగ భావించు బుద్ధి రాజసబుద్ధి యని చెప్పంబడును—

3. అజ్ఞానావృతమై సత్యమసత్యముగ, అసత్యము

సత్యముగ సకలవస్తువులను వానికి ప్రతికూలముగ గ్రహించెడుబుద్ధి తామసబుద్ధి యని చెప్పఁబడుచున్నది—

—; ధృతి త్రియము ;—

౧. యోగముచే వ్యభిచారిణిగా మనోప్రాణేంద్రియ వ్యాపారములను యేనిశ్చల ధైర్యముచే నిగ్రహింపబడుచున్నవో యాధృతి సత్వగుణమైనసాత్వికధృతి యనఁబడును.

౨. ఏధైర్యమును వహించి ఫలాభిలాషగలిగి ధర్మార్థ కామసిద్ధికొఱకు మానవుఁడు కర్మల నాచరించుచున్నాఁడో యాధృతి రాజసధృతి యందురు.

3 దుష్టబుద్ధిగల మనుజుఁడు ఏధైర్యమునాశ్రియించుకొని తన నిద్రను, భయమును, దుఃఖమును, విచారమును, మదమును విడువకుండునో యాధైర్యమునే తామసధృతి యని చెప్పఁబడుచున్నది.

ఫల్గుణా! ఏస్థితియందు మర్త్యునకు దుఃఖోపశమనము, నిరతిశయానందము గలుగుచుండునో యాచిత్తవృత్తిని సుఖమని వచింతురు. త్రిగుణానుసరణిగా సుఖంబుగూడ త్రైవిధములై యొప్పుచున్నది. చెప్పెద నాలకింపుము:—

—: సుఖత్రియము :—

1. అభ్యాస నైపుణ్యమువలన మానవుఁడు సుఖమును బొందుటకే నాకాంక్షించుచుండును. ఏసుఖము జ్ఞాన వైరాగ్యధ్యాననిష్టాదుల ప్రారంభమున విషతుల్యమట్లుభరింపనశక్యముగా దోఁచి అభ్యాసమువలన రానురాను యమృత

తుల్యమగునో, రాగద్వేషములు విడనాడిన పరిశుద్ధాంతః కరణమందు నేదిస్ఫురించుచుండునో! ఆసుఖము సత్వగుణ ప్రధానమగు 'సాత్వికసుఖ' మని చెప్పఁబడును.

2. విషయములనుండి బుద్ధిని మఱలించుట మిగుల కష్టసాధ్యము. మొదట విషతుల్యముగా నుండుననుటసత్యమే కాని, యాబుద్ధి కేవల మాత్మయందే లగ్నమైనచో సంకటములన్నియు నంతరించి యమృతోపమానమైనదిగా నుండును. అనగా బ్రహ్మవిద్యాభ్యాసము విషమువలెను, బ్రహ్మాత్వ మమృతమువలె నుండునని గ్రహించవలయును. విషయేంద్రియకూటమివలన గలుగు సుఖము మొదటనమృతమువలెనుండి రానురాను విషముగా బరిణమించును. ఇట్టిసుఖమునే 'రాజససుఖమని' చెప్పుదురు. కుజనమైత్రి వనితాసుఖ మీవిధము గలదేయని గ్రహించుము.

3. మానవునకు ఏసుఖము యనుభవ కాలమాది చివరావస్థలయందు విమోహము, నిద్రాలస్య ప్రమాదములచే నుత్పన్నమగుచున్నదో యాసుఖము తామస సుఖమని చెప్పుదురు- స్వర్గమర్త్యపాతాళము లనెడి త్రిలోకములందును జనించు సమస్తజీవులును మాయవలన బుట్టిన (పకృతిజన్యములైన) యీమూఁడుగుణములకు లోఁబడియే చరించును- ఏజీవియు త్రిగుణముల నతిక్రమించి నడువఁజాలదు—ఏజీవుఁడు యీ చెప్పఁబడిన సత్వ— రజః—తమోగుణముల నతిక్రమించి బ్రహ్మజ్ఞానమువలన త్రిగుణముల నుంచి పుట్టుక చావు

ముసలితనము దుఃఖములు మొదలగు వాటిని బొందక జీవ న్ముక్తుఁడై యమృతత్వమును బొందుచున్నాఁడు—

అర్జునా! బ్రాహ్మణ, క్షత్త్రియ, వైశ్య, శూద్రు లను చాతుర్వర్ణ సంజాతులకు వారి వారి స్వాభావిక గుణము లననుసరించి వారలకు శాస్త్రమందు చెప్పఁబడిన యథో చిత కర్మలును, ఆచార వ్యవహారిక ధర్మములు విభాగింపఁబ డి విధింపఁబడియున్నవి—సకలాంతరేంద్రియబాహ్యేంద్రియ నిగ్రహము,తపముఓర్పు,ఆచారము,జ్ఞానము,విజ్ఞానము సత్య ము వేదపఠనము, శాస్త్రవిచారణ, పురాణసమ్మకము ఇవి బ్రాహ్మణులకు స్వాభావికమయినట్టియు, చిత్తసంస్కారము ననుసరించి విధింపఁబడి నట్టియు నిత్యకర్మములాదియాచార వ్యవహారిక ధర్మములై యున్నవి—

క్షాత్రధర్మములు:— శూరత్వము, తేజము, ధైర్య ము, అనుశాసనము, సమరోత్సాహము, రాజ్యసంపాదనము, దానము, దీనజనరక్షణము, ధర్మపాలనము, శత్రుసంహార ము యివిక్షత్త్రియులకు విధికృత్యములైన కర్మలు— వీరిబుద్ధి సంస్కారమును బట్టి యీనియమిత కర్మముల నెఱవేర్చుట ధర్మవిధియైయున్నది—

వైశ్యధర్మములు:— వ్యవసాయము, గోసంరక్షణము, వాణిజ్యము,ఇయ్యవికోమటులకు స్వభావసిద్ధమయిన కర్మలు. వీరిబుద్ధి సంస్కారము యివిచేయుట కనువుగానున్నది. ఇవి యేవీరి స్వధర్మ స్వభావిక కృత్యములు—

శూద్రధర్మములు!— పరిచర్య చేయుటయే ముఖ్య ధర్మము— అనగా బ్రాహ్మణులకు సేవచేయుటయే శూద్రులకు నియమితమైన కర్మ— ఇదియే విధివిహితకర్మ, విద్యుక్త ధర్మమునై యున్నది—

—: విషయ విచారణ :—

ఇందు చెప్పఁబడిన జాతియొక్క—స్వీయ కర్మ వృత్తి ధర్మవిభాగములు నిర్ణయించుటలో కర్షక వ్యాపారకర్మలు వైశ్యజాతి కంటఁగట్టి, కేవలమొక్క— సేవకాత్వ కర్మనే శూద్రజాతి మెడకుఁజుట్టి జాతిస్వీయ కర్మాచరణము సేవకాత్వ వృత్తియే శూద్రధర్మమని స్వాభావిక ధర్మ నిరూపణచేయఁబడినది— ఇదియెంత అక్రమమో యాలోచింపఁదగ్గ విషయము, కడుశోచనీయము— సర్వసముఁడగు భగవానుఁడిట్లలవచించెవాయని దీనినాలకించిన జ్ఞానముగల ప్రతిమానవునకు సందేహము సంథిల్లకమానదు— ఇది కేవల మొక్క— శ్రీకృష్ణభగవాఁడే వచించియుంట కాదు —వేదవ్యాస మహర్షియు నీవిధముగనే వచించియుండెను— కాని యమ్మహాత్ముల భావమది కాదనుట నిస్సందేహము, ఆలోచించిచూచిన నిందలి యదార్థము జ్ఞానదృష్టిగల మహాత్ములకు సత్యగోచరము గాకమానదు—

ఆదినుండియు బ్రాహ్మణకులసంజాతులు విద్యాధికులగుటం జేసియు, స్వీయజాత్యాభిమానాభిలాషులగుటంబట్టియు బ్రహ్మభావశూన్యులై విభేదభావార్థములను గల్పించి మూలగ్రంథ

ముఖ్యయం దనుకూలరచనలకుఁ గడంగియుండురని సామాన్య లోకాభిప్రాయము. కాని, సర్వజ్ఞ పండిత లోకాభిప్రాయ మదికాదని చెప్పనగును. కావున నిందలి సత్యాసత్యములు గ్రహించవలెనన్న విజ్ఞానదృష్టితో వీక్షించినచో యథార్థ విషయము గోచరించకమానదు అదేమన? బ్రాహ్మణకుల ములోఁ బుట్టినంతమాత్రముననే బ్రాహ్మణుఁడు కాఁజాలఁడు. వర్ణాశ్రమధర్మముల ననుసరించి బ్రాహ్మణవిహిత కర్మము లను నియమిత కాలానుష్ఠానియై స్వీయవృత్తి ధర్మముల మేరకు ప్రవర్తించునాతఁడే బ్రాహ్మణుఁ డనబడును. అట్లు వర్తించనివాఁడు చండాలుఁడే యగును. ఏజాతివాఁడైనను ఏమతమువాఁడైనను, ఏయాశ్రమము వాఁడయినను బ్రాహ్మణాచారములు గలిగి బ్రహ్మజ్ఞాని యగువాఁడే [సర్వాత్మ భావము గలవాఁడే] బ్రాహ్మణుఁడనబడుచున్నాఁడు. ఇందు లకు "సూతవాల్మీకాదులే" ప్రబలనిదర్శనము.

మఱియు నింకొక విషయము. బ్రాహ్మణేతరులకు, స్త్రీలకు బ్రహ్మవిద్యయందధికారములేదని కొందఱు శుష్క పండితులు పలుకుచు సనాతన గ్రంథములం దిటీవల స్వార్థా భిమానముచే నచ్చటచ్చట నిరికింపఁబడిన కల్లబొల్లిసంస్కృ తశ్లోకములను ప్రామాణ్యముగానెంచి నిరూపించుచు సామాన్య లోకమును అధమగతి పాలుగావించుచున్నారు. వేదయుగ మను ఆర్యఋషులకాలమున తమభర్తలతో సంసారమునం దుండి జ్ఞానోపాసినులై తరించిన యుత్తమ స్త్రీలు చాలినం

ములు శాస్త్రములయం దలరారుచున్నవి. కావున బ్రాహ్మణేతరులకు శాస్త్రీయకర్మవిద్యాధికారము లేదనువాక్యములు కేవలము సత్యదూరములు. అయ్యవి స్వార్థాభిమానములు సూచించునట్టివేగాని వేఱొండుకాదు. శమదమాది గుణములు గల మానవులందఱికిని బ్రహ్మవిద్యయందధికారము కలదని విశాలబుద్ధియు నిర్మల హృదయముగల సర్వజ్ఞులగు పండితవరులు మాత్రము పల్కక మానరనుట నిక్కము.

బ్రాహ్మణుఁడు కానిమ్ము అబ్రాహ్మణుఁడుగానిమ్ము స్త్రీలు గానిమ్ము, శుద్ధమూర్ఖులుగానిమ్ము భగవంతుని దృష్టిలో నందఱు సమానులేగదా! అట్టిచో నిట్టి విభేద మెట్లు ప్రాపించెనో దురూహ్యము. కావున నిందలి సత్యాసత్యములు మహాత్ములే గ్రహింతురుగాక—

---

కావున, మానవులు తమతమ వర్ణాశ్రమ ధర్మవృత్తి కర్మములమేరక ననువర్తించి కార్యసిద్ధి నెట్లు పొందుచున్నారో యక్కార్యసాధన విధానంబును జెప్పెద నాలకింపుము. ఎవనిచేత చరాచర సమస్త భూతవస్తుసముదాయములు జనించుచున్నవో! ఎవనివలన నీవిశ్వమంతయు నంతర్యామిరూపమున వ్యాపింపఁబడియున్నదో! అట్టి యీశ్వరునిమానవులు తమతమ నిర్దిష్ట కర్మలచేఁబూజించుట యుక్తధర్మము. అట్లు పూజించినవారు అంతఃకరణశుద్ధియు కర్మఫలసిద్ధియుఁబొందగలుగుదురు. మిగుల ఘనముగా ననుష్ఠింపఁబడిన యితర ధర్మముకంటె గుణహీనమైనను స్వకీయధర్మకర్మానుష్ఠానమే

ఫలసిద్ధిఁగూర్చఁగలవు. ఎవ్వరు వర్ణాశ్రమవిద్యుక్తధర్మముల ననుసరించి కర్మల నాచరించుచున్నారో వారినేదోషములును పొందవు. ఈశ్వర ప్రీత్యర్థముగా నొనర్చఁబడినటువంటికర్మ లకు ఫలాఫల విభేదములేదు. సమస్తమాయావకర్పితము లగు టచే తదాకర్మఫలముల నీశ్వరుఁడే భరించుచున్నాఁడు.కనుక దోషరహితము లగుచున్నయవి. మనము ప్రతినిత్య మాచ రించు సకలకర్మములు, సర్వధర్మములు స్వీయము గానిమ్ము పరకీయముగానిమ్ము దోషముతోఁ గూడినవే. అవి ప్రకృతి జన్యములైన సర్వరజస్తమోగుణ కార్యములగుటంజేసి ప్రతి ధర్మమునేదోయొక గుణముతోఁ గూడియుండక మానదు. అగ్నికణము నివురుచే గప్పఁబడినదయ్యు మనుష్యసాధనము వలన దేజమొందుటలేదా? కావున నీవు యీషణత్రయము లయం దాసక్తి విడిచి యింద్రియాతీతుఁడవై, నానావిధ చరా చరాత్మకంబయిన ప్రపంచమందు నిస్పృహా గలవాఁడవై స్వీయవర్ణాశ్రమోచిత కర్మమగు 'యుద్ధము' నీ నిజధర్మం బగుట దప్పక నను ష్ఠేయంబు కావున నీగోచితకర్మల నాచ రించి జాతీయ ధర్మవికాసమునకుఁ దోడ్పడుము. నీక్షాత్ర తేజమును వమ్ముజేయకుము, కీర్తివంతుఁడవుగమ్ము.

అర్జునా! ఏపురుషుండిట్లు చేయుచున్నాఁడో వాఁడు శ్రేష్ఠమైన నైష్కర్మసిద్ధి తానుచేసినట్టి త్యాగంబు వలననే పొందుచున్నాఁడు. కావున జ్ఞాననిష్ఠయను సిద్ధిని పొందిన వాఁడు పరమాత్మను గాంచుట కనువగు జ్ఞాననిష్ఠా పరిపాక

మును గూర్చి సంక్షేపముగ దీనిజెప్పెదవినుము. రజస్తమో
గుణము లంతరించుటంజేసి శుద్ధసాత్త్విక బుద్ధికలిగి కామక్రోధా
దిగుణవికారముల నెవఁడు సహింపసమర్థుఁడగువాఁడై వైరా
గ్యము నాశ్రయించి జితేంద్రియుఁడగుచున్నాఁడో వాఁడే
యోగయుక్తుఁడై సుఖవంతుఁడగుచున్నాఁడు. ఇట్లుశాంతుఁ
డైనయోగి బ్రహ్మభావమును బొందుట కర్హుఁడగు
చున్నాఁడు.

ఎవ్వఁడు పవిత్రమైన ఏకాంత ప్రదేశంబున సాను
కూలమైన ఆసనములో గూర్చున్నవాఁడై మితాహారియై,
ఇంద్రియములను జయించినవాఁడై, ఆత్మవ్యతిరిక్త
వస్తువులందు బుద్ధిని పోనివ్వనివాఁడై, నిర్వికారుఁడై
సదాధ్యానయోగాసక్తుఁడై తనయాత్మను సత్యజ్ఞానానంద
స్వరూపునిగా ధ్యానించుచుండునో వాఁడే సర్వాత్మభావ
మును బొందుటకుఁతగియున్నాఁడు. ఇట్లు బ్రహ్మభావమును
బొందినయోగి ప్రశాంతచిత్తుఁడగుటఁజేసి ప్రాప్తాప్రాప్తవస్తు
వులకొఱకుఁ జింతింపక సర్వజీవులందు సమ్మతాంతఃకరణుఁడై
జగదీశ్వరుఁడనగు నాయందు సంపూర్ణభక్తి విశ్వాసము గలిగి
సదానన్నే భజించుచుండును, తదాభక్తిజ్ఞానమువలన సచ్చిదా
నంద స్వరూపుఁడనని, సర్వవ్యాపిననని నాయదార్థతత్త్వమును
దెలియఁగలుగుచున్నాఁడు. నానిజస్థితి నెఱింగినపిమ్మట నన్నే
బొందుచున్నాఁడు. ఎవ్వఁడు నాప్రాపు నభిలషింపుచు, నన్నే
శరణుపొంది విధ్యుక్తకర్మములనన్నిటిని ఈశ్వరుఁడనై ననా

ప్రీత్యర్థముగా నాచరించుచున్నాడో, వాడు నాయనుగ్రహమును బడయుటవలన నాశనరహితమైనదియు, నిత్యమగునదియునగు నాయొక్క దివ్యపదమైన పరమపదంబు బొందుచున్నాడు. కావున నీవు జ్ఞానబుద్ధికలవాడవై సమస్తకర్మఫలములను 'భగవదార్పితం'బని నాకర్పణగావించినాయందే మనస్సునిల్పినవాడవై యోగతత్పరుడవై సదా నన్నే యాశ్రయించి నిశ్చలచిత్తుడవై యున్నచో నాయనుగ్రహమునసమస్త దుఃఖములు సమసిపోవును. దురభిప్రాయుడవై నీవు నామాటలనవిశ్వాసముతో నిర్లక్ష్యము సేయుదువేని తప్పక ప్రమాదములో బడిపోదువు. సందేహములేదు. ఇటువినుము:—

నీవు దేహాభిమాన బంధమానసుడవై యుద్ధముసేయ నొల్లనని పలుకుచున్నావు. కాని నీపలుకులన్నియు వృథాలాపములగును. కారణమేమన? ప్రకృతిసంభవమైన నీక్షత్రియధర్మమే నిన్నీయుద్ధమునకుఁబురికొల్పి రణోద్యోగమునఁబ్రవేశపెట్టక మానదు. నీక్షత్రియ స్వాభావిక తేజశ్శౌర్యాది వీరగుణములే నీవిష్టపడకున్నను మూర్ఖపట్టుదలచేఁ జేయఁగూడదని భావించుచున్న సమరము నవశ్యము నీచేత జేయించి తీరును. ప్రకృతిస్వాభావిక గుణములకు వశ్యముగాని ప్రాణి యేదియు నుండదుసుమా! కావున నీవు, నీ క్షాత్రధర్మమగు యుద్ధకర్మకు సంబద్ధుడవుగాక మానవు. అప్పుడునీ ప్రగల్భములన్నియు నేమగునో యోచింపుము. నిరర్థకములేగదా! సర్వ

జగన్నియామకుఁడగు ఈశ్వరుఁడు సర్వభూత హృదయాంతరాళములందు నంతర్యామియై యుండి జంత్రపు బొమ్మల నాడించు సూత్రధారివలె సమస్తజీవులను వారివారి పూర్వజన్మకర్మానుగుణ్యముగా భ్రమింపజేసి, తన మాయాశక్తిచే నాడించుచున్నాఁడు. అయ్యీశ్వరుఁడు సకలదేవతలకంటెను నెక్కుడని గ్రహించుము. అయ్యీశ్వరుఁడొక్కఁడేమూర్తిత్రయము నవలంబించి రాత్రింబగళ్ళు వచ్చుచు బోవుచు నుండు చందమున సకలజీవులకును సుఖదుఃఖముల గలిగించుచున్నాఁడు. కాని, మూర్ఖులగు మానవులది గ్రహింపఁ జాలక మానాహంకారములచే మసలుచు యధోగతిఁ జెందుచున్నారు.

సర్వము నాత్మస్వరూపమే యను భావముచేత నీ హృదయస్థుఁడగు ఈశ్వరుని రక్షణపొందుము. ఆయన నాకంటెను సకలదేవతలకంటెను నధికుఁడు. అయ్యీశ్వరాను గ్రహమువలన పరమోత్కృష్టశాంతిని సుస్థిరమైన మోక్షంబును బొందగలవు. ఇది సత్యము. జ్ఞానములలో మిక్కిలి రహస్యంబగు జ్ఞానమును నీకు నేనిప్పుడు దెల్పితిని. జ్ఞానమును నది మిగుల విశేషమయిన స్థితిగలది. దానికి నాశంబు లేదు. జ్ఞానము కలుగుటచేత సంకల్పవికల్ప రాహిత్యమై మానాహంకృతులు నశించును. నీవు వీనిని బూర్తిగా నాలోచించుకొని నీయిష్టమువచ్చినట్లు చేయుము. నీవు నాకుఁ బరమ మిత్రుఁడవు గావున నీక్షేమముగోరి యింకొక రహస్య విష

యముంజెప్పెద సాకల్యముగావినుము. నీవునాయందు మిగుల భక్తియుతుడవుగమ్ము. సదానాయందే నీమనస్సు లగ్నము చేయుము. నన్నే పూజించుచుండుము. నాకే యభివందనము లాచరించుము. ఈశ్వరప్రీత్యర్థంవిధోచితకర్మల నాచరించుము. అట్లుచేసినచో పరబ్రహ్మ స్వరూపుడనగు నా పదంబు నలంకరించగలవు. నేచెప్పినదంతయు యదార్థమని నీవు నాకుఁ బరమ మిత్రుఁడవు గాన ప్రమాణము చేయుచున్నాను. కావున నీవు నన్నే శరణుబొందుము. దానం జేసి తప్పక నీకు మోక్షము లభించును.

అర్జునా! సర్వధర్మ విరహితుఁడవై, అన్య దేవతారాధనమాని నన్నేశరణ్యముగా నమ్మినవాఁడవేని నిన్ను సమస్తపాపములనుండి తరింపజేయుదును. ఇది నిశ్చయము. విచారమందకుము. ప్రకృతిజన్యమగు నీయజ్ఞానము నశించుటకై నాచే వచియింపఁబడిన యీ 'గీతాశాస్త్రము' తపస్సు శ్రద్ధ భక్తి లేనివారికిని, నాయందు భక్తి విరహితులై అసూయ జెందువారికి నెంతమాత్రము బోధింపఁ జనదు. శ్రేష్ఠమైనదియు మిగుల గోప్యమైనదియు నగు "గీతాశాస్త్రంబు" నెవ్వఁడు నాభక్తులకు బోధించునోవాడు నాకు పరమభక్తుఁడై తప్పక నాస్వరూపమును బొందుచున్నాఁడు. నాభక్తులకు నీగీతలనుపదేశించు వాడు నాకత్యంతప్రియుడు. మానవులలో వానికంటెఁ బ్రియమైనవాఁడు నాకు మఱి యొకఁడు లేఁడు. ఇఁకముందుగూడ నాకట్టిప్రియుఁడు గలుగ బోఁడనుట నిజము.

సర్వధర్మసంయుతమగు మనయిద్దఱ సంవాద రూప మైన యీగీతలను పఠించువాఁడు జ్ఞాన యజ్ఞముచే నన్ను పూజించువాఁడే యగుచున్నాఁడు, ఇది నానిర్మలాంతఃకరణ నిశ్చితాభిప్రాయముతో వెలిబుచ్చిన సత్యవాక్యము. ఏమాన వుఁడీ 'భగవద్గీతలను' భక్తిశ్రద్ధలతో నాలకించునో, ఆల కించి యసూయఁ జెందక సత్యమని నమ్మునో, విసుగును జెందక నాలకించునో యాతఁడు యఖిలపాప విముక్తుఁడై సత్కర్మానుష్ఠానులు పొందుపుణ్యలోకములనుపొంది పరమా నందముతో నుండును.

అర్జునా! నాచే వచింపఁబడిన యీగీతలను నిర్మల చిత్తముతో సాకల్యముగా నాలకించినాఁడవుకదా! అజ్ఞాన వశముచే గలిగిన నీమోహమిప్పటికిని నశించలేదా? ఇంకను సంశయముగానేయున్నదా? అనియడిగిన భగవానునకుయర్జు నుఁడిటుబదులుపలికెను. శ్రీకృష్ణా! కృపామయా! నీసత్కృ పావిశేషముచే నాయజ్ఞానమంతరించి సందేహము లన్నియుఁ దీరిపోయినవి. సందేహానిర్ముక్తుఁడనయితిని. చిత్తముశాంతి వహించినది. ఇఁక నీయాజ్ఞను శిరసావహించి తప్పక నీవు చెప్పినట్లుచేయుదును. భవదాజ్ఞాబద్ధుఁడనై యుద్ధము చేయు టకు సంసిద్ధముగానున్నాను. ఇదిసత్యమనెను.

సంజయుఁడివ్విధముగా ధృతరాష్ట్రునకు గీతలనెల్ల సవి స్తారముగా జెప్పి మఱల నిట్లనియెను. ఓధృతరాష్ట్రమహీధవా! మహాద్భుతకరమగునదియు, పులకాంకురితగాత్రులఁ గావించు

నదియు శ్రీకృష్ణార్జునుల సంవాదరూపమైన యీగీతలను నే నామూలాగ్రముగ నాలకించితిని. ఋషితల్లజుఁడగు వ్యాసానుగ్రహంబున మహా నిగూఢమైనదియు నగు నీజ్ఞాన(యోగ) శాస్త్రమును మహాయోగీశ్వరుఁడైన శ్రీకృష్ణుఁడు ఫల్గుణునితో జెప్పుచుండగ ప్రత్యక్షముగ నేను వినియున్నాఁడను. ఓ రాజేంద్రా! మిగుల నాశ్చర్యంబుఁగొల్పునదియును, పుణ్యప్రదంబగునదియు నగు శ్రీకృష్ణార్జునులకు జరిగిన యీపవిత్ర సంవాదమును దలఁచుకొనినకొలఁది మాటిమాటికి వింత గొల్పుచు సంతస మొదవుచున్నయది. అహో! నృపాలా! శ్రీకృష్ణభగవానుని విశ్వరూపమును స్మరించుకొనిన కొలఁది త్వదీయరూపము నా మనోగోళమున తాండవింపఁబడుచు సాగరతరంగములచందమున పరమానందము ప్రభవించుచున్నయది. మహాయోగీశ్వరుఁడగు శ్రీకృష్ణుఁడును, మహావీరుఁడగు ధనుర్ధరుఁడయిన యర్జునుఁడు నెచ్చట నుండునో, ఆపక్షమున లక్ష్మి, విజయము, ఐశ్వర్యము, సుస్థిర ధర్మము, విజ్ఞానము, శుద్ధవిఖ్యాతకీర్తియుఁగలిగి సదావిలసిల్లు చుండు నని నాయభిమతము.

వి॥ ఈయోగమునందు గతయోగములందు జెప్పఁబడిన విషయములే చాలవరకు భగవానుఁడు మరల మరల వచించియుండెను. అయినప్పటికిని పునరుక్తి దోష మింత మాత్రము లేదని విజ్ఞాపన. సమస్త విషయముల సులభగ్రాహ్యమగుటకొఱకే పరమాత్ముఁడు మరలమరల చెప్పఁబడెనే గాని వేరొండుకాదని విజ్ఞులు గ్రహింతురుగాక.

ఈ గీతలయందు శ్రీకృష్ణపరమాత్ముఁడు అగ్గనునకుఁ బెక్కు-ధర్మములను బోధించియున్నాఁడు. వీనిలోఁ గొన్ని ధర్మములు లోకమందు నాచరింపఁబడుచు వ్యాప్తిఁ బోనున్న వనుట కేమాత్రము సందేహములేదు. అనిత్యమైన లోకవ్యవహారములందు మానవులు వారివారి బుద్ధిసూక్ష్మతననుసరించి ధర్మాధర్మ నిర్ణయము జేయనెంతురు. కాని, యిది మిథ్య మిది తథ్యమనుధర్మసందేహ పరంపర వెల్లువలోఁబడి నరుఁడెంత జ్ఞానవంతుఁడైనను గొట్టుకొని పోవచ్చునవుట నిజము. ఎవరి చిత్తవృత్తిననుసరించి వారుపలువిధములుగఁబలుకుచు 'తా బట్టిన కుందేటికి మూఁడేకాళ్ళ' నునటుల తర్క-వితర్క-వాదములు సలుపుచుందురు. అంతియేగాని సందేహ నిర్ముక్తులఁ జేయువా రెవరును గానరారు. కావుననే—'నీవుయితరచింతలు లేనివాఁడవై, సందేహనిర్ముక్తుఁడవై సమస్త కర్మలు నా కర్పణగావించుచు నన్నే శరణుపొంది, సర్వవిధముల నన్నే నమ్మి భజించువాఁడవగుదువేని నిన్ను రక్షించెదను' అని భగవానుఁడు విస్పష్టముగ పలుమారులు ప్రబోధించియున్నాఁడు. కనుక మానవులు ఎవరి ధర్మములను వారు గుర్తించుకొని తదాధర్మములను నిష్కామబుద్ధితో నాచరించిన వారగుచో నాత్మజ్ఞానమును బడసి మోక్షమున కర్హులగుదురు. ఇదియే గీతాశాస్త్రమందలి రహస్యధర్మము.

భూమియందు పుట్టిన ప్రతిమానవుఁడు స్వీయకర్మానుష్ఠానమందు ప్రావీణ్యము సంపాదించుట ముఖ్యకర్తవ్యము.

అంతియేకాదు, దానంజేసి సాధించవలసిన పురుషార్థమేమను టను వర్ణాశ్రమ ధర్మములు వివరించుచున్నవి. తాను తినుటకై సంపాదించుట-సంపాదించుటకై తినుట-యింతమాత్రమె మానవుని పురుషార్థముకాదు. వర్ణాశ్రమ ధర్మము లనిన సమాజక్షేమమునకును జననము నాధారముగ గైకొనివృత్తులను పంచిపెట్టు వర్ణాశ్రమముల రూపమని భావింపనగును కాని, జాతికిని ధర్మమునకును ముడిపెట్టుటసమంజసముకాదు. మానవుఁడు తనశక్తియొక్క ప్రతిపరమాణువును పరమేశ్వర సాక్షాత్కారమునకై వినియోగించుటకు పుట్టియున్నాఁ డనుట సత్యము. కావున 'మానవసేవయే మాధవసేవ-విశ్వ ప్రేమయే యీశ్వరపూజ' యనునార్యోక్తి ననుసరించి సర్వాత్మబుద్ధిగలిగి తన యావచ్ఛక్తిని విశ్వమానవకళ్యాణమునకే వినియోగించుట యుత్తమకర్మము. అట్లుచేయుటయే అధ్యాత్మికాభివృద్ధికిని మానవసమాజాభ్యుదయ వికాసములకుఁదోడ్పడినవాఁడై ఏతత్ఫలమగు ముక్తిని తప్పక పొందగలఁడు.

ఇంక శ్రీకృష్ణభగవానునివలన గీతలను సంపూర్తిగా నాలకించినపిమ్మట యర్జునుని యజ్ఞానమంతయు నశించెను. ధర్మవిజ్ఞానము నుదయించెను. తోడనే యతఁడు తన క్షత్రియ ధర్మమగు యుద్ధకర్మమునకు గడంగి విక్రమించి వీరవిహారుఁడై యుద్ధమునుసల్పి కృతార్థుఁడాయెను. అటులనే మనమును స్వయమగు నాత్మనుష్ఠానముల నమరక నిష్కామబుద్ధితో కర్మల

నాచరించినచోఁ గృతకృత్యులమై మోక్షమును బడయుదు మనుటలో సందియమిసుమంతయు లేదు. అనియిట్లు నీ యోగ మని చెప్పుదురు. ఇది భగవానుని యాదేశము. కావున యాయన వాక్యములందు సంపూర్ణవిశ్వాసము కలిగియుండ వలెను. ఎచ్చోట యోగనిష్ఠ, కర్మానుష్ఠానమాది పరమార్థ చింతనము కలిగియుండునో యచ్చోట సమస్త కార్యములు నిర్విఘ్నముగా నెఱవేరుచు సఫలము లగుచుండును. గీతా ధ్యానమువలన నలవరచుకొనవలసిన రహస్యధర్మ మిదియొక టని గ్రహించవలయును.

ఓమ్ తత్సత్.

ఓమ్ సర్వేషామ్ స్వస్తిర్భవతు.

ఓమ్ సర్వేషామ్ శాంతిర్భవతు.

ఓమ్సర్వేషామ్ పూర్ణమ్భవతు.

ఓమ్ శాంతిః శాంతిః శాంతిః॥

హరిః ఓమ్.

శ్రీ రామకృష్ణార్పణమస్తు.

శ్రీ వ్యాసమహామునీంద్రునిచే విరచితంబయిన శ్రీమదాంధ్ర భగవ ద్గీతలను శ్రీకృష్ణార్జున సంవాదరూపంబైన యోగ శాస్త్రమునందు మోక్షసన్యాస యోగంబను పదునెనిమిదవ అధ్యాయము వచనప్ర బంధమునసర్వంబునుసంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ

ఓమ్

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః

# గీతానుబంధము.

## మతత్రయము.

వర్తమానయుగమున మన యనుభవములో ముఖ్యమైనవి మూఁడు మతములు గానవగుచున్నవి.

(1) హిందూ మతము (2) మహమ్మదీయ మతము (3) క్రైస్తవమతము.

హిందువులకు భగవద్గీత, మహమ్మదీయులకు ఖురాను, క్రైస్తవులకు బైబిలు పవిత్ర గ్రంథములుగా బరిగణింపఁబడుచున్నవి. ఇంతియేగాదు హిందూమత గ్రంథము లనేకము లున్నవి. ఆర్యయుగము మొదలు ఒక్కొక్కకాలముననొక్కొక్క హిందూమతకర్త బయలువెడలి ఒక్కొకవిధమున మతసంస్కరణగావించి, శైవమనియు, వైష్ణవమనియు, ద్వైతమనియు, యద్వైతమనియుఁబలువురు పలువిధములమతధర్మముల నిరూపించి యున్నారలు. అందుచేమనముద్వైతాద్వైతసిద్ధాంతవాహినులలోఁబడి మునిఁగి తేలుచు దరిఁగానలేకున్నామనుట మనకనుభవనీయమైన విషయమే; ద్వైతము కానిమ్ము యద్వైతముకానిమ్ము, శైవముకానిమ్ము, వైష్ణవముకానిమ్ము తర్కించిచూడ కడకునన్నింటిధర్మమొక్కటే యని ఋజువుగాక మానదు.

ఇందు చెప్పఁబడిన మతత్రయలోకమునకు పరిశుద్ధ గ్రంథములుగా చెప్పఁబడిన 1. భగవద్గీత 2. ఖురాను 3. బైబిలు అను మూఁడు గ్రంథముల యందలిధర్మములను

విజ్ఞానదృష్టితో విమర్శించిచూడ గమ్యస్థానమొక్కటే, పర మాత్ముఁడొక్కఁడేయని తెలుపుచున్నవి. ఈమూడు గ్రంథ ముల సారాంశము గూడ నంతియేయని స్పష్టమగుచున్నది.

(1) హిందువులు విగ్రహారాధన జేయుదురు.

(2) మహమ్మదీయులు ప్రతినిత్యము పవిత్రస్థలము లందు ఉదయసాయంసమయముల రెండువేళల నిశ్చలమన స్కులై దైవప్రార్థనము చేయుదురు.

(3) క్రైస్తవులుకూడ నట్లే క్రీస్తును దైవభావనగా పూజించి ప్రార్థనలు చేయుదురు.

ఈచెప్పఁబడిన రెండు, మూఁడు మతములవారు, అందు ముఖ్యముకా క్రైస్తవులు విగ్రహారాధన కూడదనియు ఱాళ్ళు, రప్పలు, కొయ్యలు, బొమ్మలు దేవుఁడుకాదనియు వాటికి మ్రొక్కరాదనియు ఘంటాపదముగా చెప్పుదురు. కారణమరయ దురూహ్యము, విరుద్ధము.

'పరమాత్మ' విశ్వవ్యాపి– సర్వాంతర్యామి– ఆయన లేనిస్థలము లేదు. పరమాణువుమొదలు బ్రహ్మవఱకు భూత గణ నగ తరు జల పాషాణ లతానికుంజాది సమస్త జడాజడ పథార్థములందు భగవత్తేజం బిమిడియున్నది. సర్వమాయన చైతన్యమే; ఈవిధముగా నానావిధచరాచరాత్మకమై ఈశ్వ రుఁడున్నాఁడు, కావున వీనిలో దేనింబూజించినను భగవం తుని పూజించినట్లేయగును. అన్యము కానేరదు. అట్టిచో విగ్రహారాధన కూడదనుటెందులకో తెలియకున్నయది.

మానవులు వారివారి చిత్త సంస్కారము ననుసరించి నన్నుయేస్వరూపునిగా భావించి యారాధించినను జడాజడ పదార్థములలో దేనిని పూజించినను నన్ను పూజించినట్లే యనియు తదాభక్తులకు మోక్షము 'కరతలామలక' మనియు భగవానుఁడు చెప్పియున్నాఁడు. కావున నిందలి సత్యమును విజ్ఞులే నిర్ణయింతురుగాక.

ఆర్యులారా! మఱియు నింకొక్క విషయము. నాచే వ్రాయఁబడిన ఏతద్గ్రంథమగు 'శ్రీమదాంధ్ర భగవద్గీతలను' మండపేటవాస్తవ్యులును చౌదరి వశిష్ఠకేశవన్న యాజమాన్యులునగు శ్రీమాన్ సత్తిరాజు చౌదరిగారు అచ్చువేయిం చుటకుఁ బూనుకొని మండపేట 'లక్ష్మి ప్రెస్' లో ముద్రణ సేయుట కిచ్చియున్నారు. త్వదీయగ్రంథము నచ్చుకూర్చుట కనువగునటుల ఏయధ్యాయమున కాయధ్యాయము విభాగించి తేటతెల్లముగ వ్రాసి యచ్చుకూర్పరుల కందించుచుంటిని.

ది 20-6-1956 సం॥రం తేదీరాత్రి 'పురుషోత్తమ ప్రాప్తియోగము'ను సుమారు పదిగంటల వఱకువ్రాసి పరుండి నిద్రించితిని. తదా తేదీకి సరియైన శ్రీ దుర్ముఖినామ సంవత్సర జ్యేష్టశుక్ల త్రయోదశీ బుధవారం రాత్రి తెల్ల వారుజాము సుమారు 4-5 గంటలమధ్య నేనొక స్వప్నంబుఁ గాంచితిని. తెల్లనైన యసంఖ్యాక విద్యుద్దీపకాంతి పుంజముఁ తోఁ దుల్యమగు గొప్ప శీతల ప్రకాశ మందు దృగ్గోచర మయ్యెను. ఆ ప్రకాశమధ్యమునుండి కన్నులకు మిరుమిట్లు

గొల్పు దేహకాంతులతో నొప్పుచున్న మువ్వురు దివ్యపురుషులు సౌమ్యాకారములతో నరుదెంచి పాదములు పుడమి నంటీయంటని చందమున భూమిపై మోపక సాక్షాత్కరించి నిల్చియుండిరి. అంత నేనవ్వారలకుఁ బ్రణామిల్లి నమస్కరించి ధన్యోస్మియని వినమ్రుండనై నిల్చియుంటిని. వారిలో ధవళగాత్రుండును బ్రహ్మతేజోమయుండు నగు పురుషుఁడు కుమారా! భగవద్గీతలను వ్రాసినాడవు, నీవెంతయు ధన్యుఁడవన, మహాత్ములారా! ఇదంతయు భవదీయులకృపావిశేషమే. కాని, యిందెన్నియో దోషములుండుట నిక్కము, వానిం దెలియజాలకుంటిని. నాయందనుగ్రహించి తప్పులనుసవరించి దయచేయఁ బ్రార్థించుచున్నవాఁడనన, పుత్రా! నీవు పరమ పవిత్రుఁడవు. మాదయకుఁ బాత్రుఁడవైన నీవు తెలియరాని దేముండును! నీవు సర్వజ్ఞుఁడవు కాఁగలవు. ప్రపంచమున నీరచనలు యాచంద్రార్కమై విలసిల్లుచు నీకీర్తి చంద్రికలు చిరస్థాయిగా ప్రకాశించు చుండుగాక యని యాశీర్వదించి మదీయశిరాగ్రమున హస్తస్పర్శలొనరించి మునుమ్మూర్తులును క్రమముగా వెడలి యదృశ్యులైనారలు. అంత నేను మేల్కాంచి విభ్రమముతో నల్వంకలఁ గలయజూచితిని. ఎవ్వరును గానరారైరి. అప్పటికి ప్రకృతి తెలతెల బాఱుచున్నది. పక్షిగణములు కలకల ధ్వనులు చేయుచుండెను. వాడుక ప్రకారము నేను నిత్యకృత్యములలో నిమగ్నుఁడనైతిని,

కొందఱిది సత్యమనవచ్చును కాదనవచ్చును. లోకముగాకినూక ఎవరికి దోఁచినట్లు వారనవచ్చును, వారివారి బుద్ధిసంస్కారము ననుసరించి గుణావగుణులు పలువిధముల బలుకవచ్చును. గేలిసేయవచ్చును. ఇది ప్రకృతి నైజము. ఇందులకు భగవానుఁడే కర్మసాక్షి. ఆభారమంతయు భగవంతునకే విడిచినాను. కావున లోకమెట్లుభావించినను యీ పుణ్యఫలము లోకమే పొందగలదు. ఇది యెంతమాత్రము సత్యేతరము కాదని విజ్ఞాపన.

—o—

ఓమ్.

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

—: గీ తా ను బ ం ధ ము :—

## —:మతధర్మసారము:—

హిందూ మతమందలి దేవుఁడగు కృష్ణుఁడువ్యభిచారి యని క్రైస్తవులు వ్రాసిన గ్రంథము లెన్నియోకలవు. అంతియేకాదుక్రైస్తవులు జనపథము లందలి వీధులలోను, హిందువుల గృహములవెంబడిఁదిరుగుచు కృష్ణుఁడు దేవుఁడు గాఁడనియు, రాముడు దేవుఁడు గాఁడనియు నతఁడొకరాజని యుఘంటాపదముగఁబలుకుచు క్రీస్తువాధిక్యతను ప్రకటించుచున్నారనుము— అప్పుడు హిందువుఁడు క్రీస్తువెటులబుట్టెనో

మరచితివాయని యడిగిన పరిశుద్ధాత్మ క్రీస్తుగారి తల్లియందు
ప్రవేశింపగా నతఁడు జన్మించెనని వచియించును—లోకానుభవ
ములో పురుష సంబంధములేని స్త్రీ, సంతానవంతురాలగుట
యసంభవముగదా నీవాక్యము నమ్మఁజాలనని హిందువుఁడ
డిగినయెడల దేవుని మహిమచే జరిగినవాటికిలోకానుభవము
అవసరములేదని చెప్పును— శ్రీకృష్ణుఁడు దేవుఁడుగాన నతని
విషయమైకూడ మాట్లాడరాదని హిందువుఁడనును— అంతే,
శ్రీకృష్ణుఁడు దేవుఁడయ్యును నీచమైన వ్యభిచారము చేయ
వచ్చునా యని క్రైస్తవుఁడు ప్రశ్నించును— ఒకపురుష
సంబంధము లేకయే క్రీస్తుయొక్క తల్లికిసంతానము కలుగఁజే
యునంత సమర్థతగల పరిశుద్ధాత్మ లోక మనుమానించునట్లు
క్రీస్తుగారి తల్లియందు ప్రవేశించుటకంటె దేవుఁడు ఆదా
మును, పుట్టించునటుల తల్లికూడా లేక యేసుక్రీస్తు మహా
నీయుఁడు పుట్టినట్లల చేయలేకపోయెనని హిందువుఁడనును—

క్రీస్తుగారు జన్మింపఁ బోవుచున్నాఁడని ఆయన
పుట్టుటకు పూర్వమే లోకమున వెల్లడి కాఁబడినది గాన
అట్టి మహానీయుని గూర్చి సంశయింప నవసరము లేదని
క్రైస్తవుఁడు ప్రతివచనం బిచ్చును— రామావతారమున
ఆమహావిష్ణువు పదారువేల మహర్షులతో దాను కృష్ణుఁడై
యవతరించినపుడు గోపికాస్త్రీవేషములఁ దాల్చివచ్చితిరని
బ్రహ్మైక్యసంధాన ముపదేశించెదనని చెప్పియున్నాఁడు
గానకృష్ణావతారమునకు పూర్వమే యతనిరాక లోకమున

వెల్లడి కాఁబడినపు డట్టి పరమ పవిత్రుని విషయమై సంశ
యించుట మహాపాపముకాదా యని హిందువుఁడెదురా
డును—

ఇట్లు ఒకని ధర్మము (సిద్ధాంతము) వేఱొకనికి రుచిం
పనిచో, ఒకని నుండి వేఱొకఁడు దూరముగ నుండవలసినదే
కాని పరస్పర ద్వేషులై నిందించుకొనుచు, బలవంతుఁడు
బలహీనుని హింసింపరాదు— అన్యమత దూషణము మాన
వుఁడైన వానికి సహజముకాదు— అట్టివాఁడు ద్విపాద పశు
వనుట నిస్సంశయము—

శ్రీకృష్ణుఁడు తాను దేవుఁడననియెన్ని నిదర్శనములు
చూపినను, భగవన్మహిమ మెఱుంగని దుస్థితియందున్న
దుర్యోధనాదులా పరమపురుషుని గ్రహింపలేక పోయిరి—
అందుచే వారు శాశ్వత నరకమున నడెదరని నిందించరాదు.
ఆదోషమునకు తగిన పాపమనుభవించి, పిమ్మట జన్మమున
కొంచెము జ్ఞానులై యిటుల క్రమముగా సంపూర్ణజ్ఞానియగు
నని భావించవలెను—

ఏసుక్రీస్తు దేవుని కుమారుఁడనని చెప్పినపు డక్కా
లపు చేపలవాండ్రు నమ్మిరేకాని ప్రభువులు విద్వాంసులు
విశ్వసించలేదు— మహమ్మదు తాను దేవుని వాక్యముల
నాలకించిమత ముపదేశించుచుంటిననని చెప్పినను ప్రజలతని
పై దండెత్తిరి— కృష్ణునిగాని, క్రీస్తునిగాని, మహమ్మదుని
గాని విశ్వసింపని వారందఱికి శాశ్వత నరకమని నిందించి

అన్యమతము లను తన్మతకర్తలను, అజ్ఞానాంధకారమున
ముంచి వంచించుటపాపమును పంచుకొనుటయని గ్రహించ
వలెను— ఆయవతార పురుషుల ధ్యానించనివారు మరికొన్ని
జన్మములలో ధ్యానించగలరు—

శ్రీకృష్ణుఁడు నేనే దేవుఁడనని చెప్పుటచే నటుల ధ్యానించిన
భక్తులాయన లోకము నాలోకించగలరనుట నిక్కము
క్రీస్తు నేను దేవుని కుమారుఁడనని ప్రకటించుటచే, భక్త
లకు మోక్ష మొసంగ సర్వాధిపత్యము లేనివాఁడై తన
తనతండ్రియైన దేవుని (శ్రీకృష్ణుని) వద్దకుఁబంపుచుండును—
జనులీవిధమున బుద్ధిభేదములచే మార్గభేదముల నేర్పరుచు
కొని వ్యవహరించుచు క్రమముగా ముక్తులగుచుందురు—
కావున దేవుఁడు తండ్రియనియు, మతము తల్లియనియు తెలి
యఁదగును—

దేవుఁడొక్కఁడు మతము లనేకములు—గనుక, దేవు
నిశక్తు లనేకములని గ్రహించవలెను— అంతియేగాని గురివిం
దగింజ తనక్రిందనున్న నలుపెఱుంగనటుల నొకమతస్థుఁ డన్య
మతమునంగల లోపముల వెదకుచుండునేగాని స్వమత లోప
ముల దలఁపడు— పరమతమును నిందించుట పాపహేతువని
సర్వమతములవారు గ్రహించి స్వధర్మానుష్ఠాన పరులగుట
శ్రేయోదాయక మగును—

హిందూమతము బహుప్రాచీనమైనదనియు అతిపవిత్ర
మైనదనియు సం॥ ౧౯౫, ౫౮, ౮౫, ౦౬౦. (195, 58, 85
060.) సంవత్సరముల కాలమునాటిదనియు గ్రంథములరీత్యా
తెలియుచున్నది— కావున సర్వజనులు నేనెవరను—నేనెచట

జన్మించితిని— నాస్వధర్మమేమి— ఇపుడు నే చేయుచున్న దేమి యని కొంచెమాత్మ విచారణ సేయుట ప్రతిమానవు నకు విధియైయున్నది— "ఆత్మానాత్మ సముద్ధరేత్" అనగా ఆత్మవిచారణ చేతనే ఆత్మనుద్ధరించు కొనవలెననెడి భగవ ద్వాక్యము త్రోవగా చేయఁబడిన నెంబడినే; "స్వధర్మే నిధనం శ్రేయః। పరధర్మో భయావహః.॥ అనగా, స్వజా తిధర్మమున, మరణించుట మేలు, విజాతీయధర్మము తనకు నాశనకరము అనెడి వాక్యము స్ఫురించును— ఇటులష్టాదశ వర్ణముల వారాత్మ విచారణమొనర్చి ఆత్మావలోకనముచే నాత్మసామ్రాజ్యభోగము ననుభవించగలుగుదురు—

ఆదియుగమునుండియు హైందవస్త్రీలు పతిభక్తి నిర తలనియు, సుగుణవతులనియు అనుపమానమహామహిమాధిక సుధీ శక్తిగల వీరనారీమణులనియుఁ ప్రపంచమున ప్రఖ్యాతి వడసిన నేటి మన భారతాంగనలు ప్రకృతిమోహమునన్య మతయాచార వ్యవహారాది వేషభాషలకు లోనై తదా మత ముల స్వీకరించి సతీధర్మములఁ ద్రోసిపుచ్చి విచ్చలవిడిసంచా రిణులై పరమతపూజామందిరములకేగి ప్రార్థనలు చేయుచు పాటలుపాడుచు నాటలనాడుచు సంసారములు మఱచి విహ రించుచు, దూరదృష్టిలేని లోకముచే ననుమానింపఁబడుచు నిందలకు గురియై 'కులసతీత్వము' వమ్ము జేసికొనుచున్నా రనునది లోకవిదితము.

ఇది భారతమహిళాలోకము గుర్తించి సీత, సావిత్రి, సుమతి, సుకన్య మొదలగు సతీమతల్లులగు పురాణ స్త్రీల

యుత్తమ చారిత్రముల జ్ఞప్తియందిడుకొని యేస్త్రీలు శీలవతులై చరించెదరో వారు పుణ్యవతులై పాపముల నుండి విముక్తి నొందగలుగుదురు— సందియములేదు—

ఏ సంఘమున మతసూత్రములు త్రెంపఁబడునో అట్టి సంఘమునకు వినాశనము శరణ్యము—

క్రైస్తవాది మతస్థు లితర దేశములకేగి యచట వసించుచున్నను మతసూత్రమునకుఁ గట్టుపడినవారై నేటికిని సంఘమాభివృద్ధిని గాంచుచున్నారు— కాలవశమున హిందూ సంఘము మాత్రము స్వదేశముననే వసించుచు జాతీయధర్మముల నుల్లంఘించి విదేశీయ వేషభాషాది యాచారవ్యవహార వ్యామోహమునబడి సర్వవిధుల వారల ననుకరించుచున్నారనుట సత్యేతరము కాదు. హిందూదేశమున హిందువులై పుట్టి కుక్షింభరులు కొందఱు స్వమతమునకు స్వస్తి చెప్పి యన్యమతములం స్వీకరించిత్వదీయ మతప్రచారకులుగాబయలుదేరి సంఘమునకును దేశమునకును ద్రోహముచేయుచు తీరని కళంక మాపాదించిన వారగుచున్నారు. కావున, సాధ్వులోనిది గ్రహించి సంచరించుట శ్రేయము— (మతధర్మము)

సతికి పతిసేవనమే పరమావధి కావున, సతిలోకము పతియే దైవమని మతియందుంచుకొని సద్గతిఁబడయఁదగును.

సర్వేజనాస్సుఖినోభవంతు.

శ్రీ రామచంద్రార్పణమస్తు.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ